# అరుణతార

సాహిత్య, సాంస్కృతిక మాసపత్రిక

ARUNATARA

సంపుటి: 45 సంచిక: 2 హైదరాబాద్ 334 మార్చి, 2017 పేజీలు: 72 వెల: రు. 20



## విరసం 20వ సాహిత్య పాఠశాల

11, 12 ఫిబ్రవరి 2017

ప్రొద్దుటూరు, కడప జిల్లా

కా. రవూఫ్ నగర్, చిలుకూరి దేవపుత్ర ప్రాంగణం

సంక్షోభ కాల సూచికలు : ప్రజా ఆకాంక్షలు, ఆచరణ

## సోషలిజమే ప్రత్యామ్నాయం





# -: స్వీకారం :-

ఆవాజ్
మతం లేని సమాజం కోసం
పి. వరలక్ష్మి
ప్రచురణ :
విప్లవ రచయితల సంఘం
వెల : రూ. 65/-
పేజీలు : 120

మా తుఝే సలాం
కథలు
ఆర్. శశికళ
ప్రచురణ :
విప్లవ రచయితల సంఘం
వెల : రూ. 60/-
పేజీలు : 104

ప్రజాకళలు
పికెఎం ప్రభాకర్ రచనలు
ప్రచురణ :
విప్లవ రచయితల సంఘం
వెల : రూ. 70/-
పేజీలు : 135

పూలు రాలిన చోట
కవిత్వం
నాగేశ్వర్
ప్రచురణ :
విరసం వరంగల్ యూనిట్
వెల : రూ. 50/-
పేజీలు : 128

వెన్నెలవనం
కవిత్వం
సూర్యచంద్ర
ప్రచురణ :
విప్లవ రచయితల సంఘం
వెల : రూ. 50/-
పేజీలు : 72

నీదాకా వచ్చినా తాకుతావో లేదో
సాయంకాలం వానని
రివేరా కవిత్వం
ప్రచురణ :
విప్లవ రచయితల సంఘం
వెల : రూ. 30/-
పేజీలు : 60

కాగుతున్న రుతువు
కవిత్వం
కె.క్యూబ్ వర్మ
ప్రచురణ :
జంఝావతి
వెల : రూ. 80/-
పేజీలు : 173

పోస్ట్‌మార్టం-పోస్ట్‌ట్రూత్
రామగూడ (బెజ్జంగి), నీలాంబూర్ (బైజంక్షన్) ఎన్‌కౌంటర్ల గోబెల్స్ ప్రచారాలు
దాడిచేస్తే దాగని సత్యాలు
వరవరరావు
ప్రచురణ :
విప్లవ రచయితల సంఘం
వెల : రూ. 50/-
పేజీలు : 106

దోసెడు పల్లీలు
మరికొన్ని కథలు
ఉదయమిత్ర
పాలమూరు ప్రచురణలు
పాలమూరు అధ్యయన వేదిక
వెల : రూ. 120/-
పేజీలు : 176

అభాగ్యజీవులు
ఫ్రాంజ్ ఫనాన్
తెలుగు అనువాదం :
ఎన్. రవి, బి. అనురాధ
ప్రచురణ :
విప్లవ రచయితల సంఘం
వెల : రూ. 170/-
పేజీలు : 272

ఎర్ర దుక్కి
కథలు
ఎం. నారాయణ
పాలమూరు ప్రచురణలు
పాలమూరు అధ్యయన వేదిక
వెల : రూ. 100/-
పేజీలు : 96

మార్క్స్ పెట్టుబడి రచనాక్రమం
ఫ్రాన్సిస్ వీన్
తెలుగు అనువాదం :
ముక్తవరం పార్థసారథి
ప్రచురణ :
విప్లవ రచయితల సంఘం
వెల : రూ. 50/-
పేజీలు : 80

నక్సల్బరీ
ఒక ఊరు మాత్రమే కాదు
తెలుగు అనువాదం :
సి.ఎస్.ఆర్. ప్రసాద్
ప్రచురణ :
విప్లవ రచయితల సంఘం
వెల : రూ. 80/-
పేజీలు : 136

చైనా సాంస్కృతిక విప్లవంపై సమకాలీన వ్యాఖ్య
మలుపు తిప్పిన మహో ఉద్యమం
విలియం హింటన్
తెలుగు అనువాదం :
సి.ఎస్.ఆర్. ప్రసాద్
ప్రచురణ :
విప్లవ రచయితల సంఘం
వెల : రూ. 60/-
పేజీలు : 108

బోల్షివిక్ పార్టీ చరిత్ర
తెలుగు అనువాదం :
తుమ్మల వెంకట్రామయ్య
సరళీకరణ :
సి.ఎస్.ఆర్. ప్రసాద్
ప్రచురణ :
విప్లవ రచయితల సంఘం
వెల : రూ. 250/-
పేజీలు : 520




334

అరుణతార
సాహిత్య సాంస్కృతిక మాసపత్రిక

సంపుటి : 45 ◆ సంచిక : 2 ◆ మార్చి, 2017 వెల : రు. 20/-

సంపాదకీయం : 1

# అరుణతార-మహిళామార్గం చదవద్దా! ఏవి చదవాలి!

**అరసవిల్లి కృష్ణ**

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అధికారంలోకి వచ్చి, మూడు సంవత్సరాలు కావస్తోంది. నరేంద్రమోది నేతృత్వంలోని కేంద్ర ప్రభుత్వం హిందుత్వ దాడుల నుండి నోట్ల రద్దు వరకు ప్రయాణం చేసి ఓట్లేసిన ప్రజలను దగా చేసింది. నూతన ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి నారా చంద్రబాబునాయుడు తన ప్రమాణ స్వీకారోత్సవ సమయంలోనే ఎన్‌కౌంటర్లకు తెరదీసి, ఎర్రచందనపు కూలీలు, బెజ్జంకిలో విప్లవకారుల ఎన్‌కౌంటర్ వరకూ తన రక్తం అంటిన చేతులను ప్రజలకు చూపిస్తున్నాడు. పాలకపక్షానికి వ్యతిరేకంగా ఎవరు గొంతు విప్పినా, ప్రజా ఉద్యమం రాజుకుంటున్న ఛాయలు కనబడినా, తీవ్ర నిర్బంధాన్ని ప్రయోగిస్తున్నాడు. చంద్రబాబు నాయకత్వంలోని తెలుగుదేశం శ్రేణులు ఆంధ్రప్రదేశ్ ప్రజలపై పడి స్థానిక వనరులను, భూమిని, చివరకు స్మశానాలను దోచుకుంటున్నారు. ప్రజల పక్షాన నిలవాల్సిన పత్రికలు విషపుత్రికలయినాయి. చంద్రబాబు అభివృద్ధి నమూనాను కీర్తించే పత్రికలు, ప్రజాసంఘాలపై అమలు చేస్తున్న అత్యవసర పరిస్థితిని గురించి రాయకపోవడం ఆశ్చర్యమేమీ కాదు.

బెజ్జంకి ఎన్‌కౌంటర్ తర్వాత చంద్రబాబు ప్రజల ముందు దోషిగా నిలబడ్డాడు. ఏకపక్షంగా, నిరాయుధులైన వారిని సామూహికంగా కాల్చి చంపడంపట్ల తెలుగు సమాజం స్పందించింది. ఆంధ్రప్రదేశ్ ప్రజలు చంద్రబాబు హింసోన్మాదానికి ఆవేదన చెందారు. కలతపడినారు. నూతన రాజధాని భ్రమలో ఉన్న ప్రజలు ఈ పరిణామాలను జీర్ణించుకోలేకపోయారు. సహజంగానే ప్రజల నుండి నిరసన వ్యక్తమయింది. ప్రజల భావోద్వేగాలను చంద్రబాబు గమనించాడు. బెజ్జంకి ఎన్‌కౌంటర్ మిగిల్చిన విషాదం ప్రజలకు చేరువయిందని గ్రహించాడు. బెజ్జంకి ఎన్‌కౌంటర్‌ను ప్రజల వద్దకు తీసుకుపోవడంలో విప్లవ ప్రజాసంఘాలు తమదయిన కార్యాచరణను రూపొందించుకొని అమలు చేయగలిగాయి. ఇక్కడే చంద్రబాబు అహం దెబ్బతిన్నది. విప్లవ ప్రజాసంఘాల బాధ్యులు వరవరరావు, కళ్యాణరావు, చిలకా చంద్రశేఖర్‌లపై వివిధ ప్రాంతాలలో గోడపత్రికలు, కరపత్రాల ద్వారా మానసిక దాడిని తీవ్రం చేసారు. దీనికి కొనసాగింపుగా- చైతన్య మహిళా సంఘం కార్యకర్తలు, విరసం కార్యదర్శి వరలక్ష్మి ఫొటోలతో గోడపత్రికలు గుంటూరులో అతికించారు. వీరిని మావోయిస్ట్ సానుభూతిపరులుగా చిత్రిస్తూ, కాలేజీలలో మీటింగ్‌లు పెట్టడానికి వస్తే లోపలకు రానివ్వ వద్దని, విద్యార్థులకు హితబోధ చేసారు. అంతేనా? అరుణతార, మహిళా మార్గం పత్రికలను చదవవద్దని విన్నవించుకున్నారు. రాష్ట్రంలో ఏ మూల మీటింగ్ జరిగినా కరపత్రాలతో, ఫ్లెక్సీలతో, మావోయిస్టుల సమర్థకులను దూరంగా ఉంచండి అనే ప్రచారం చేయడం ఎత్తుగడగా కొనసాగిస్తున్నారు. దిగువశ్రేణి పోలీసు ఉద్యోగస్తులను, స్థానిక కూలీలను సమీకరించి ప్రజాసంఘాల సభలు జరిగే చోట ర్యాలీ చేయిస్తున్నారు. ఈ చర్యలు ప్రొద్దుటూరు (11-12-ఫిబ్రవరి) విరసం సభలు వరకు కొనసాగాయి. బహుశా ఇక ముందు కూడా కొనసాగవచ్చు. చత్తీస్‌గఢ్‌లో జరిగిన ఎన్‌కౌంటర్‌పై నిజనిర్ధారణకు వెళ్ళిన ఏడుగురు ప్రజా సంఘాల బాధ్యులను నిర్బంధించి రెండు నెలలుగా జైలులో ఉంచారు.

బెజ్జంకి ఎన్‌కౌంటర్ తర్వాత చంద్రబాబు తన మేనేజ్‌మెంట్ రాజకీయ వ్యూహంతో ప్రజాసంఘాలను భయభ్రాంతులకు గురిచేస్తున్నాడు. సాహిత్య రంగంలో విలక్షణ మాసపత్రిక అరుణతారను, మహిళా సమస్యలపై వస్తున్న మహిళామార్గం పత్రికలను చదవ వద్దని ఎనిమిమది మంది ప్రజాసంఘాల కార్యకర్తల ఫొటోలను గోడపత్రికలపై ముద్రించి అతికించడం స్త్రీలను కించపరచడం కాదా! దళిత, ముస్లిం స్త్రీల ఫొటోలను నిస్సిగ్గుగా గోడలపై అతికించడం రోగగ్రస్త ప్రజాస్వామ్యానికి నాయకుడయిన చంద్రబాబు ఎలా సమర్థించుకుంటారు. మహిళల పట్ల గౌరవం చూపాల్సిన ముఖ్యమంత్రి మహిళల హక్కులకు పూచీ పడాల్సిన ముఖ్యమంత్రి సాహిత్య, సామాజిక పత్రికలను చదవ వద్దని చెప్పడం పరాజితుని ఆఖరి వాక్యాలుగా చూడవచ్చు. మహిళా సంఘంలో చేరి ప్రజల పక్షాన పనిచేస్తున్న వారికీ కుటుంబమున్నది. సామాజిక స్నేహాలున్నాయి. ఒక సున్నిత వాతావరణాన్ని భగ్నం చేసే అధికారం ఇచ్చిన ఈ ప్రజాస్వామ్య భావనను ఏమని పిలవాలి? చంద్రబాబు వంటి వారికీ తమ కుటుంబమున్నది. వారి వ్యక్తిగత అంశాలను నలుగురిలో చర్చకు పెడితే ఎలాంటి మానసిక ఆందోళనకు గురి అవుతారో, ఇతరుల వ్యక్తిగత వివరాలను బహిర్గతం చేస్తే వారి కుటుంబ సభ్యుల మానసిక ఆరదోళన కూడా అలానే ఉంటుంది. పాలకుడు చేయదగని పనులను చంద్రబాబు నిస్సిగ్గుగా చేస్తున్నాడు.

మహిళలను గౌరవ పథంలో చూడాలని మహిళా పార్లమెంట్‌ను అమరావతిలో నిర్వహించిన చంద్రబాబు, తల్లికి వందనమనే కార్యక్రమాల ప్రచారాలను మితిమీరి చేసే చంద్రబాబు అదే అమరావతి కేంద్రంగా మహిళలపై, ప్రజాసంఘాలపై మానసిక దాడి చేయడం ఒక ద్వంద్వ వైఖరి. ఇకనయినా చంద్రబాబు ప్రజాస్వామ్య ముసుగులో చేస్తున్న అరాచక పాలనకు స్వస్తి పలికి, స్త్రీలపై, ఉద్యమ పత్రికలపై తను చేస్తున్న అమానవీయ దాడికి క్షమాపణ చెప్పాల్సి ఉంది. తన దుర్మార్గ పాలనను ప్రశ్నిస్తున్న ప్రజాసంఘాలను కట్టడి చేయగలననుకుంటే, ప్రజల చేతిలో పరాజితుడు కాక తప్పదు. చంద్రబాబు ప్రతి చర్యను ప్రజానీకం గమనిస్తున్నారు. అంచనావేస్తున్నారు. ప్రజాపక్షం వహించే వారి పట్ల నిర్బంధాన్ని ప్రయోగిస్తే తన పతనానికి తానే చేరువవుతాడు. ఒక కాలం అది నిరూపించింది. భవిష్యత్ ఎదురు చూస్తుంటుంది.



సంచిక - 334

అరుణతార నిర్వహణ, శాశ్వత నిధుల కోసం మా ప్రకటన చూసి
గుంటూరు మిత్రుల విరాళాలు, రూ.25,000/-, మట్టయ్య - హయత్‌నగర్, రూ.2,000/-,
విప్లవ సాహిత్య అభిమాని, రూ.13,000/-
విరాళంగా ఇచ్చారు. వీరికి ఉద్యమాభినందనలు. - సం.


**ఎడిటర్**
దువ్వూరి వెంకట రామక్రిష్ణారావు

**వర్కింగ్ ఎడిటర్**
పాణి

**రచనలు పంపించాల్సిన చిరునామ:**
డోర్ నెం. 50-348-1, 19/బి2,
సెకండ్ ఫ్లోర్,
ఆరోరానగర్, బి క్యాంపు (పోస్ట్),
కర్నూలు - 518002.

* ఇ-మెయిల్ ద్వారా
virasampaani@gmail.com
arunatara1977@gmail.com కూ పంపవచ్చు

**సంపాదకవర్గం:**
ఉజ్వల్, బాసిత్

**విరసం కార్యదర్శి చిరునామా**
పి. వరలక్ష్మి
5-1820, గీతాశ్రమం వీథి,
ప్రొద్దుటూరు, కడప జిల్లా - 516 360.

**డి. టి. పి. అండ్ లే అవుట్**
ఆర్. భాగ్యలక్ష్మి, డి. వైజయంతి
కవర్ డిజైన్ : పి. వరలక్ష్మి, ఆర్. భాగ్యలక్ష్మి

**ఫొటోలు :**
విరసం, గూగుల్ సైట్

**Like Page:**
//viplava rachayitala sangham arunatara

**facebook :**
//viplava rachayitala sangham virasam

**Virasam website :** *www.virasam.org, www.virasam.in, www.arunatara.in*


విరాళాలు ఆన్‌లైన్‌లో, డ్రాఫ్టులు, చెక్‌లు పంపడానికి వివరాలు :
**ARUNATARA** పేరిట, అకౌంట్ నెం. 36323406395, స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా (ఎస్.బి.ఐ.)
ఐ.ఎఫ్.ఎస్.సి. కోడ్ నెం. ఎస్.బి.ఐ.ఎన్.0007112, లాలాగుడ, సికింద్రాబాద్.
ఎం.ఓ.లు : డి.వి. రామక్రిష్ణారావు పేరిట ఎం.ఐ.జి. - 14, ఎ.పి.ఐ.ఐ.సి. కాలనీ,
కార్బైడ్ కంపెనీ ఎదురుగా, మౌలాలి, హైదరాబాద్ - 500 040 చిరునామాకు పంపగలరు.

అరుణతార చదవండి!
చదివించండి!
చందాదారులు కండి!

విడి సంచిక వెల - రు. 20; సంవత్సర చందా - రు. 240;
రెండు సంవత్సరాల చందా - రు. 450; మూడు సంవత్సరాల చందా - రు. 680;
ఐదు సంవత్సరాల చందా - రు. 1100; దశాబ్ది చందా - రు. 2200/-

## అరుణతార చందాదారులకు విజ్ఞప్తి!

ఏ కారణం చేతనైనా మీకు అరుణతార అందకపోతే పిన్‌కోడ్‌తో సహా మీ చిరునామాను మరోసారి **8500809250** మొబైల్ నంబర్‌కు మెసేజ్ పెట్టగలరు. గమనిక : ఈ నెంబర్ కేవలం మెసేజ్‌ల కొరకు మాత్రమే! - సం.

# విషయసూచిక



**www.virasam.org అంతర్జాల పత్రికలో జనవరి సంచికల్లో వచ్చిన రచనల విషయసూచిక:**



## ప్రియమైన అరుణతార సంపాదకులకు,



అరుణతార 1997 జూన్ సంచికలో ప్రచురితమైన 'మాష్టారుతో కరుణా, నేనూ' అనే మంజీర వ్యాసంలో - "మాష్టారు ఎడ్యుకేషన్ ప్రభావంతో కరుణ తాను రాయాలని కోరుకున్న తన తల్లి 'తాయమ్మ కథ' రాసింది. (ఈ కథను మహిళామార్గం వాళ్లు నాలుగేళ్లు దాచిపెట్టి ఈమధ్యే ప్రచురించారు)." - అని రాశారు.

అరుణతార 2016 అక్టోబర్ సంచికలో 'నాకు నచ్చిన నా కథ' అనే ప్రసంగపాఠంలో తాయమ్మ కరుణ - "ఈ సందర్భంగా మరొక్క విషయం. 'తాయమ్మ కథ' నేను రాసిన తర్వాత నాలుగు సంవత్సరాలకు 'మహిళామార్గం' పత్రికలో అచ్చు అయ్యింది. అది కూడా అంత 'పేరున్న' మాసపత్రిక కాదు." - అని రాశారు.

రెండుచోట్లా మహిళామార్గం నుంచి ఆలస్యం జరిగిందనేది మీ పత్రికలో నమోదు అయ్యి ఉంది కనుక ఈ ఉత్తరం కూడా మీ పత్రికలోనే ప్రచురిస్తే బాగుంటుందని రాస్తున్నాను. ఆ కథ అప్పటి పరిస్థితుల్లో నా వద్దకే మొదటగా చేరింది. రకరకాల పరిస్థితుల్లో అది 'మహిళామార్గం' వారికి చేరడంలో ఆలస్యం జరిగింది. అలాగే ఆ కథను 'మహిళామార్గం'కి పంపాలనే నిర్ణయం కూడా చాలావరకూ నాదే. ఏ పత్రికకైనా రచన చేరాక ప్రచురించడానికి కొంత సమయం పడుతుంది కనుక ఆ మార్జిన్ కొంత ఇవ్వచ్చు. తాయమ్మ కరుణకూ అందుకు అభ్యంతరం ఉంటుందనుకోను. పోతే, ఆ పత్రిక మాసపత్రిక కాదు. (వారి 20 ఏండ్ల పత్రికల సిడిలో చూస్తే ఈ కథ ప్రచురితమైన 1996 సంవత్సరంలో రెండు సంచికలే వచ్చాయి. అంతకు ముందు రెండేళ్లు ఏడాదికి మూడు సంచికలు మాత్రమే తెచ్చారు). మంజీర వ్యాసంలో "1993 జనవరిలో కరుణ నా సహచరిగా వచ్చింది," అని రాశారు కనుక కథ ఆ తర్వాత రాసినది. అజ్ఞాతంలో నాకు చేరడానికి ఎలాగూ కొంత సమయం పట్టి ఉంటుంది. కథ ప్రచురితమైనది జూన్-డిసెంబర్ 1996 మహిళామార్గంలో. సరే, ఏదేమైనా ఈ ఉత్తరం రాయడానికి ప్రధాన కారణం పత్రిక ఏ రచన ప్రచురణకైనా తీసుకునే మార్జిన్ కాలాన్ని వదిలేస్తే మిగతా ఆలస్యానికి కానీ, 'అంత పేరులేని' పత్రికలో ప్రచురణ కావడానికి గానీ నైతిక బాధ్యత నేనే వహించాలి అని వివరణ ఇవ్వడానికే. 'మహిళామార్గం' వారికి ఏ సంబంధమూ లేదు. కరుణ, మంజీర, మాష్టార్ల తర్వాత కరుణ రచనలు ప్రచురణ కావాలని కోరుకున్న నాలుగో వ్యక్తిని నేనని తాయమ్మ కరుణకు తెలుసు కనుక జరిగినదానిలో గానీ, ఈ వివరణలో గానీ వ్యక్తిగతం ఏమీ లేదు. అవి ఆనాటి పరిస్థితులు, ఇది నైతిక బాధ్యత గురించిన వివరణ.

ఎప్పట్లాగే, అందరిలాగే కరుణ నుండి మరిన్ని మంచి రచనలు ఆశిస్తూ, ఆమె సాహిత్య కృషిని అభినందిస్తూ...

- షహీదా

## ప్రధాన న్యాయమూర్తిగారికి,

అయ్యా ... తమరి ఏలుబడిలో ఉన్న న్యాయవ్యవస్థలో చట్టంతో, న్యాయంతో ధర్మాధర్మాలతో సంబంధం లేకుండా ఇరు రాష్ట్ర ప్రభుత్వాలు కనిపించిన వాళ్ళని కనిపించినట్లుగా కాల్చి చంపిన హత్యలకి ఎన్‌కౌంటర్లనీ, హంతకులకి నక్సలైట్లని పేరు పెడుతున్నారు.

ఇదేమిటని ఎవరైనా కన్నెత్తి చూసినా, పన్నెత్తి ప్రశ్నించినా ఆశ్చర్యంతో ముక్కు మీద వేలేసుకొన్నా వాళ్ళేదో పెద్ద నేరం చేసినట్లుగా మన చిక్కుడు ప్రభాకరుణ్ణీ (తెలంగాణ ప్రజాస్వామిక వేదిక), బల్ల రవీంద్రుణ్ణీ (రాజకీయ ఖైదీల విడుదల కమిటీ), దుడ్డు ప్రభాకర్నీ (కుల నిర్మూలన పోరాట సమితి), బండి దుర్గాప్రసాద్ (పౌరహక్కుల సంఘం), రమణాల లక్ష్మయ్యనీ (తుడుం దెబ్బ - కార్యదర్శి), రాజేంద్ర ప్రసాద్‌నీ (తెలంగాణ విద్యార్థి వేదిక - రాష్ట్ర ఉపాధ్యక్షులు), నజీర్‌నీ (తెలంగాణ విద్యార్థి వేదిక - ఓయూ ప్రెసిడెంట్) పట్టుకొని (మన న్యాయపరిభాషలో పోలీసులు అరెస్ట్ అంటారు లెండి) పోలీసులూ పోలీసులూ, ప్రభువులూ ప్రభువులూ, ఒకటేనని, దుర్మార్గానికీ హద్దుల్లేవనీ, భాషాభేదాలు లేవని మనకు సవినయంగా తెలియజేసి, పొరుగు రాష్ట్రాల పోలీసులకి చంపుకొంటే చంపుకొంటారో, మానుకుంటే మానుకొంటారో అదంతా మీ ఇష్టం అని అప్పగించారు.

పోలీసులు ఎన్‌కౌంటర్లు చేస్తూ పోతూ ఉంటే చట్టాన్నీ న్యాయాన్నీ ధర్మాన్నీ అతిక్రమించుకొంటూపోతే న్యాయవ్యవస్థ ఎందుకుందన్న సందేహం కలుగుతుంది. పరాయి రాష్ట్ర పోలీసులు ఈ రాష్ట్రం నించి తీసుకువెళ్ళి అక్కడ కేసులు పెట్టి అక్కడ కోర్టులో ప్రొడ్యూజ్ చేసి, వాళ్ళ దగ్గర మావోయిస్ట్ సాహిత్యం ఉందనీ, అక్కడ శాంతి భద్రతలకీ

*(మిగతా 32వ పేజీలో)*

## పాఠకులకు మనవి

అరుణతారలో వస్తున్న రచనల మీద ఉత్తరాలు, సెల్ ఫోన్ మెసేజ్‌లు, ఎక్కువగా మెయిల్స్ వస్తున్నాయి. అయితే వాటిలో ఫలానా రచన బాగుందని మాత్రమే చాలా వరకు ఉంటున్నాయి. అప్పుడప్పుడు ఏదో ఒక రచన బాగా లేదని ముక్తసరిగా అభిప్రాయాలు వస్తున్నాయి. ఈ అభిప్రాయాలను అరుణతార తప్పక గౌరవిస్తోంది. అయితే ఒక రచన బాగున్నా, బాగలేకపోయినా ఎందుకు మీకు అలా అనిపించిందో కొంచెం వివరాలతో రాస్తే పత్రిక నిర్వహణకు, ఆ రచయితలకు కూడా ఉపయోగంగా ఉంటుంది. అరుణతారలో రావాల్సిన రచనలపై కూడా మీ సూచనలు ఇస్తే మరీ మంచిది.

సంపాదకవర్గం

## విరసం అంతర్జాల పక్ష పత్రిక

### www.virasam.org కి రచనలు పంపండి.

మిత్రులారా..

విరసం వెబ్ మాగజైన్‌ను సాహిత్య, విప్లవాభిమానులు ఆదరిస్తున్నందుకు ధన్యవాదాలు. కొన్ని రచనలను విరివిగా చదువుతున్నారు. వీడియోస్‌పట్ల చాలా ఆసక్తి చూపుతున్నారు. అయితే రచనల అవసరం చాలా ఉంది. కవిత్వం, వ్యాసాలు, అనువాదాలు, పుస్తకసమీక్షలు పంపించండి. సామాజిక సమస్యలపై ఎప్పటికప్పుడు విశ్లేషణ వ్యాసాలు రాయండి. అరుణతారకు రచనలు పంపించి సహకరించినట్లే అంతర్జాల పత్రికకు కూడా పంపించాలని మనవి. మీ రచనల కోసం ఎదురు చూస్తున్నాం.

**www.virasam.org team**

**site e-mail ID : virasam1970@gmail.com**

# ట్రంప్ అంటున్నదేమిటి? మోడీ అననిదేమిటి?

- పి.వరలక్ష్మి

కూచిభొట్ల శ్రీనివాస్ మరణాన్ని దేనితోనూ పోల్చడం లేదు. గొడ్డు మాంసం తిన్నాడని అఖ్లాక్ దారుణ హత్య గుర్తొచ్చిన మాట నిజమే. శ్రీనివాస్ తల్లిదండ్రుల గర్భశోకం చూస్తుంటే రోహిత్ వేముల తల్లి రాధిక గుర్తొచ్చిన మాట నిజమే. కాన్సాస్ వంటి జాత్యాహంకార దాడే జవహర్ లాల్ నెహ్రూ యూనివర్సిటీ విద్యార్థి నజీబ్ అనే విద్యార్థిని మాయం చేసింది. నాలుగు నెలలుగా ఉన్నాడో, లేడో తెలీని కొడుకు కోసం ఢిల్లీ వీధుల్లో ప్లకార్డు పట్టుకున్న తల్లి ఫాతిమా, మంచం పట్టిన తండ్రితో పేదరిక భారాన్ని మోస్తున్న ఆ కుటుంబం మనసులో మెదులుతున్న మాటా నిజమే. నెత్తుటి మడుగులో ధబోల్కర్, పన్సారే, కలబుర్గి, తాజాగా రేప్ బెదిరింపులు ఎదుర్కొంటున్న గుర్ మెహర్ కౌర్.. ఇంకా జాతీయతా ప్రశ్నను కత్తి అంచున ఎదుర్కొంటున్న కోట్లాది ఇండియన్ ముస్లింలు గుర్తు రాకుండా ఎలా ఉంటారు? జంతువుల్లా వేటాడబడుతున్న దళితులు, ఆదివాసులు గుర్తుకురాకుండా ఎలా ఉంటారు? ఎవరైనా సరే, మనిషి మరణం అత్యంత బాధాకరం. దుఃఖం విలువ తెలిసిన వాళ్ళం. దేన్ని దేనితో పోల్చుతాం! అయితే, సంఘంలో చావుకూ హోదా ఉంది. లెక్కలోకి రావు కొన్ని. తోటి మనుషుల సానుభూతినీ పొందవు కొన్ని. అయినా విద్వేషానికి, పీడనకు బలైన వారి ఆప్తుల దుఃఖం దుఃఖమే కదా.

మన దేశ మధ్యతరగతికి సక్సెస్ నమూనా అయిన ఓ సాఫ్ట్ వేర్ ఇంజనీర్, ఇండియాలో అతని సాంఘిక, ఆర్థిక హోదా అక్కడ పూచిక పుల్ల అయి అమెరికా జాత్యాహంకారానికి బలైనప్పుడు, అది ప్రాధాన్యతా వార్త అయినప్పుడు విద్వేషం గురించి చర్చ అన్ని చోట్లా జరుగుతోంది. శ్రీనివాస్ ఆప్తుల దుఃఖం ఇండియా దుఃఖం అయింది. అమెరికాలో పనిచేస్తున్నఇండియన్ సాఫ్ట్ వేర్ ఉద్యోగుల అభద్రత ఇండియా అభద్రత అయింది. సరే, అదొక అంశం. అసహనమా! ఏమిటది, అనే సగటు మధ్యతరగతి వర్గానికి ఇటువంటి అభద్రత ఒకటి ఉంటుంది అనైనా తెలిసిందా. కాన్సస్ హంతకుడు ఏమన్నాడు? 'మా దేశం వదిలి పోండి.. టెర్రరిస్ట్'! ఒక మనిషిని రంగు బట్టి ఎలా అంచనా వేస్తారు? ఈ దేశం కోసం మా శ్రమ, మేధస్సు ధారపోశాం. మా భద్రతకు భరోసా ఉందా? ఈ దేశంలో మేము, మా పిల్లలు జీవించగలమన్న భరోసా ఇస్తారా? చాలా న్యాయమైన ప్రశ్నలు కదా!

'ముసల్మాన్ జావో పాకిస్తాన్, యా ఖబరస్తాన్'! 'ఈ దేశంలో ఉండాలంటే వందేమాతరం పాడాల్సిందే'! 'ఇది హిందుస్తాన్, అంటే హిందువుల దేశం'. 'వాళ్ళు యాభై మందిని చంపితే మేము రెండు వేల మందిని చంపాం'. 'ముస్లింల జనాభా పెరిగిపోతోంది, హిందూ స్త్రీలు నలుగురేసి పిల్లల్ని కనాలి'. 'వేదాల ప్రకారం గోహత్య చేసే వాళ్ళను చంపొచ్చు'. 'బీఫ్ తినేవాళ్ళకు ఈ దేశంలో చోటు లేదు'. 'హిందుత్వ గురించి ఏది పడితే అది మాట్లాడితే కుక్క చావు చస్తారు'. ఈ భావనల్ని ఏమందాం? వీటికేపేరు పెడదాం?

కాన్సాస్ ఘటన తర్వాత ట్రంప్ నోరు విప్పాలి అని డిమాండ్ చేశాం. చేయవలసిందే. వారం తర్వాత ఆ హత్యను ఖండిస్తూ ఆయనన్నది సంతృప్తికరంగా లేదు సరే, మరి హిందుత్వ హత్యల గురించి మన ప్రధాని నోరు విప్పారా? నిరసన తెలుపుతూ ప్రభుత్వ అవార్డులు వాపస్ ఇచ్చిన మేధోవర్గాలను, ఆలోచనాపరులను ఇక్కడి ప్రభుత్వం వెటకారం చేసింది. ఫాసిస్టు హత్యలను నిరసించిన వాళ్ళకు వ్యతిరేకంగా ఇక్కడి ప్రభుత్వం ఊరేగింపులు తీయించింది. వీళ్ళందరిదీ ఎలెక్షన్ స్టంట్ అంది. అమెరికాలో ట్రంప్ గెలవాలని ఇండియాలో పూజలు చేసింది మోడీ బాపతు జాతీయవాదులే కదా? ఈయన గెలిస్తే ప్రపంచానికే భద్రత ఉంటుందని హోమాలు చేశారు. ముస్లింలను శత్రువులుగా చూసేవాడు, జాతుల పట్ల, మహిళల పట్ల చవకబారు ద్వేషపూరిత వ్యాఖ్యలు చేసే ట్రంప్ వీళ్ళకు ఆరాధ్యుడు. విద్వేష రాజకీయాలకు భారతదేశంలో చాలా పెద్ద ఆవరణ ఉంది. ఐరనీ ఏమిటంటే ఒక నాలికతో హిందూ జాతీయవాదం మాట్లాడే వాళ్లు ఇంకో నాలికతో అమెరికాలో జాతి వివక్షను ఖండిస్తూ విద్వేష భావాలు మంచివి కావంటున్నారు. దీన్నెంతమంది భారతీయులు గమనిస్తున్నారు?

ఇప్పుడైనా సగటు మధ్యతరగతి భారతీయులకు, వాళ్ళ చదువులకు, ఉద్యోగాలకు ఎంత భద్రత ఉంది అనే చర్చ తప్ప ట్రంప్ భావాల గురించి కాదు. అమెరికా కొత్తగా వలస విధానం మాట్లాడ్డమేమిటి? అసలు ఆ గడ్డకు సొంతదారులు ఎవరు, మెజారిటీ అంతా అప్పుడో ఇప్పుడో వలస వచ్చిన వాళ్ళే కదా అని మాట్లాడేవాళ్లున్నారు. నిజమే. మరి హిందూ జాతీయవాదం గురించి ఏమంటారు? ట్రంప్ మాట్లాడుతున్నదేమిటి? మోడీ మాట్లాడనిదేమిటి? ట్రంప్ గురించి మనం గట్టిగా మాట్లాడితే (అంత ధైర్యం ఉందా అన్నది వేరే విషయం) మన శాసనసభల్లో ఒకరినొకరు ఎత్తిపోసుకున్నట్లు ట్రంపిస్టులు ఎవరైనా మీరా జాతివిద్వేషం గురించి మాట్లాడేది అంటే? మీ ప్రధానమంత్రి ఏ రాజకీయాలు చేసి గుజరాత్ ముఖ్యమంత్రి నుండి దేశప్రధాని హోదా పొందాడు అంటే? ఎవరికిష్టమున్నా లేకపోయినా ఇది ఒక జాతికో, ఒక మతానికో, ఒక సమూహానికో, ఒక రాజకీయ అభిప్రాయానికో సంబంధించిన సమస్య కాదు. మోడీ నుండి ట్రంప్ దాకా ఫైనాన్స్ పెట్టుబడిదారీ మార్కెట్ ఫాసిస్టు రాజకీయాలను ఆలంబనగా తీసుకుంటున్నది. ఇది అన్ని సమూహాలను అంటుకుంటుంది. వీటిని ప్రతిఘటించే రాజకీయార్థిక పోరాటాలు లేకపోతే దహించివేస్తుంది.

ట్రంప్ ఎన్నికై నెలైనా కాకముందే మాకీ ప్రెసిడెంట్ వద్దు అని అమెరికన్లు వీధుల్లోకి వచ్చారు. మన మన పరిస్థితి? ప్రభుత్వ వ్యతిరేకులంతా దేశద్రోహులు, తీవ్రవాదులు. ఎవరిమీదైనా దాడిచేసి చావగొట్టే స్వేచ్ఛ ఎబివిపికి, కత్తులు, తుపాకులు ప్రదర్శించే స్వేచ్ఛ ఆరెస్సెస్ కు, మతవిద్వేషపూరిత భావాలు బహిరంగ సభలు పెట్టి మరీ ప్రచారం చేయగల స్వేచ్ఛ హిందూ పరిషత్తులకు ఉంటుంది. హిందూ జాతీయతను ప్రశ్నించే ఇతర మతస్తులైనా, కమ్యూనిస్టులైనా, బ్రాహ్మణీయ సాంస్కృతిక ఆధిపత్యాన్ని ప్రశ్నించే దళితులైనా, అభివృద్ధిని ప్రశ్నించే ఆదివాసులైనా, ఉరిశిక్షలను వ్యతిరేకించే మానవ హక్కుల కార్యకర్తలైనా, కశ్మీర్ ప్రజల ప్రజాస్వామిక హక్కుకు మద్దతు తెలిపే వాళ్లెవరైనా మూక దాడులకు గురికాదగినవారు. అని స్వయంగా మంత్రివర్యులు మాట్లాడతారు. వెంకయ్యనాయుడు వంటి వారు 'భావప్రకటనా స్వేచ్ఛ పేరుతో ఏది పడితే అది మాట్లాడితే ఊరుకుంటారా' అంటారు. విద్వేష దాడులను ఖండించడం కాదు కదా, మన పాలకులు సమర్థిస్తారు. మరి వీళ్ళనేమందాం? ఇక్కడేం ఏం చేద్దాం?



# మా ఊరి పెద్ద మసీదు

## సజ్జా వెంకటేశ్వర్లు

అర్ధ శతాబ్దం క్రితం
సాయంత్రం ఆరు తరువాత
కిరోసిన్ దీపాల పొగల మధ్యన
ఇంటింటా కళ్ళు నులుముకునే
ప్రక్రియొకటి మా ఊర్లో మొదలౌతుండేది!
ఇది నా బాల్యపు గుర్తు!!
సాయంత్రం ఆరు తరువాతే
చీకట్లు విస్తరిస్తూ ఉంటాయా,
దడుపు జ్వరాన పడ్డ సంతతిని మోస్తూ
ఊరు ఊరంతా బారులు తీరేది
మా ఊరి పెద్ద మసీదు ముందే!
ఇది మా తరం అనుభవం!!
సాయంత్రం ఆరు దాటాక
నిమ్మకాయలకు సూదులు గుచ్చి
పసుపు ముద్దలకు కుంకుమ బొట్లు పెట్టి,
ఎండి మిరపకాలతో
ఎంట్రుకల తాళ్ళతో
దెయ్యాలు పట్టిన ఊరుకు
తావీదు వైద్యమై
ఊరును ఊరడించిందీ తిక్కకుదిర్చిందీ
మా ఊరి పెద్ద మసీదే!
పేద మసీదే!!

ఇవాళ,
అర్ధ శతాబ్దం తరువాత...
ఆధ్యాత్మిక భూమిక నుండి
విశ్వాసాల కింద విధ్వంస కిరీటధారణతో
రెక్కలొచ్చిన ఊరు
ఎక్కడెక్కడికో ఎగిరిపోయింది!
వీధి లైట్లకిందనే విజ్ఞాన సముద్రాల్ని
అంది పుచ్చుకున్న మేధస్సులో
మనిషి చంద్రమండలాన వేసిన
తొలి అడుగు కింద దాగిన చరిత్రలో
నేలను సరిచూసిన వాని బాల్యంలోని
బాలారిష్టాలు దాటించిన కాలంలో
మా ఊరి పెద్ద మసీదు సింహ భాగానే నిలుస్తుంది!
నూట పదహారేళ్ల వయసు నిండిన
మా ఊరి పేద మసీదు ముంగిట్లో
ఇవాల్టికీ,
సాయంత్రం ఆరు తరువాతే
తరతరాలకు దాని జీవన ప్రస్థానంలో
చెరగని వేనవేల ఓదార్పు స్పర్శలున్నాయో!

# ప్రశ్నార్థకం

## విక్రాంత్

కొన్ని ప్రశ్నలకు
సమాధానం
ప్రశ్నార్థకం

ప్రతి కొత్త ప్రశ్న
ఒక కొత్త
ప్రశ్నార్థకమవుతుంది

ప్రతి ప్రశ్నార్థకం
ఒక మూగబోయిన
గొంతుకతో
ప్రశ్నిస్తుంది

అడుగుతున్న
ప్రశ్నలకు సమాధానంగా
రాలుతున్న తలలు
ఎదురవుతుంటే...
ప్రశ్నకు
మరో నూతన
ప్రశ్న వేసే
ప్రశ్నార్థకాలే
సమాధానాలవుతున్నాయ్!

పసిపాప
కన్నీటికి
వేలాడుతున్న
రైతు చివ్వరి
నవ్వుకు...
ఆ పాప
కన్నీళ్లొక
ప్రశ్నార్థకం!

తల్లి పేగు తెగి
రణభూమి నుదుటిని
ముద్దాడిన నేల
రగిలే రక్తపు
మరకలు చేసే
ఆఖరి నినాదం
మరో ప్రశ్నార్థకం!

వెలివాడ వీథుల్లో

విహరిస్తూ...
వెలివేసిన
స్వప్నాలు పాడే
నిశ్శబ్దపు నిషిద్ధ
సంగీతం
ఇంకో ప్రశ్నార్థకం!

చీకట్లో
కాలుతున్న
చెల్లెలి మూగ మనస్సు
చేసే ఆకలి
ఏడుపు! ఎందుకని!?

వెలుతురులో
చీకటైన
అనాథ పిల్లల
బతుకుల మెతుకులకై
నునులేతనీ రెక్కలకున్న
ఓర్పు! ఎక్కడిది!?

ఆశల
పూదోటలో
నేల రాలిన
విద్యార్థి
తంగేడు పువ్వుల
కూర్పు! ఎవరి కోసం!?

ఇలా
అనేక ప్రశ్నార్థకమైన
ప్రశ్నలే...
చివ్వరికి
సమాధుల్లో
సమాధానమవుతున్నాయ్...!

మనిషి
అస్తిత్వాన్ని సైతం
అత్యాచారం చేసే
ప్రశ్నార్థకాలను మిగిల్చి
పండుగ చేసుకునే వాళ్లూ...!
అస్తిపంజరాల మీద
విలాసంగా
విందు భోజనం
చేస్తున్నారు

ప్రశ్నార్థకాలకు
పరిష్కారంగా బతికి
మరణించి
జీవిస్తున్న వాళ్లూ...!
పచ్చని కలల కోసం
వసంత మేఘపు
వెచ్చని నెత్తుటి వర్షంలా
పరివ్యాపిస్తున్నారు

# నోట్ల గాయాలు

## *వెంకటకృష్ణ*

చెల్లని నోటులా
తెల్లారిపోయిన కొన్ని ఉదయాలు
ప్రయాసగా మిగిలిన ప్రయత్నంలా
ఫలించని కొన్ని సాయంత్రాలు
ఉదయాస్తమయాల్ని చూస్తూ
క్యూలో దేశప్రజలు

బారులు బారులు
దృశ్యంగా బ్యాంకులు
పోరులు పోరులు
విచిత్రంగా ఏటీఎంలు
చారికల చారికల
కళ్ళతో దేశ ప్రజలు

బడుగులు దాచుకున్నది చేతికి అందదు
బడాబాబులు దోచుకున్నది దొడ్డిదారిన మార్చుడు
మోడీకీ మన్‌కీ బాత్ మాయలో దేశ ప్రజలు

స్విస్ బ్యాంకులో ధనకొండలు పదిలం
దేశీయ స్వాములకో ఆర్బీఐయై అభయం
నల్లధన యజ్ఞంలో బలిపశువులు దేశ ప్రజలు

మూలిగే నక్క మీద తాటికాయలా
సన్నాబన్నా బతుకుల మీద నోట్లరద్దు

పుండుమీద కారం జల్లినట్టు
దినవారీ జీవితాల మీద క్యాషులెస్సు

మోకాలికూ బోడిగుండుకూ ముడిపెట్టినట్టు
జన కష్టార్జితంతో జలైంది నల్లడబ్బు

ఊనగాచి నక్కల పాల్జేసినట్టు
దేశీ వ్యాపారాలపై కార్పొరేట్ తోడేళ్ల కళ్ళు

చీమల పుట్టల్ని పాముల కనువుజేసినట్టు
దేశంపై పడగలెత్తుతున్న విదేశీ గుత్తస్వాములు

కూడగట్టుకున్న నమ్మకం
యిలా వమ్మువుతుందని తెలీదు కదా

నీ బొటనవేలే నీ బ్యాంకని చెప్తూ
దేశపు ఆధార్‌ను ఎలా విరిచాడో చూసారు కదా

ముద్రించి ఇచ్చిన భరోసా
ఇలా వెల వెల బోతుందని తెలీదు కదా

ప్రజలను ఏటీయం క్షతగాత్రుల్ని చేసే
డిజిటల్ వ్యూహాన్ని కనుగొన్నారు కదా

చుట్టుముట్టిన నోటుగండం
ఎప్పటికైనా తీరం దాటక తప్పదు
చుట్టుముట్టిన జనగుండం
మోడీత్వాన్ని తుదముట్టించక తప్పదు

## ఐలమ్మ వారసున్ని

### పి. దస్తగిరి

మురికి మూటల ముళ్ళతో
పుణికె పుండై మండినా
బరువుకు మెడలిరుకు పట్టినా
నడుం వంగి గూనొచ్చినా
నువ్విదిల్చే నాలుగు మెతుకుల కోసం
నీ ముట్టును మూటలు మూటలుగా
టన్నులకొద్దీ మోసే ఒంటెద్దునౌతున్నా

మకిల బట్టల్ని
ఏటిలో తేటగా జాడించి
నీ మురికినంతా నెత్తిపై
కుమ్మరించుకుంటూ
మడుగుల్లో రేవుల్లో రాతినౌతున్నా

కాళ్ళు జివ్వుమని లాగుతున్నా
పిక్కల్ని కుక్కలు పట్టి పెరికినట్టున్నా
గూడల్ని గుంజి లాగినట్టున్నా

పొద్దంతా నిట్టాడిలా నిలబడి
నీ బతుకు సాఫీగా నడవడానికి
నా బతుకును మేజాగా పరుస్తున్నా

నీ సంబరాలకు సందళ్ళకు
జాతర్లలో తిరునాళ్ళలో
యాటకొడవలి పాషాణంగా చేతబట్టి
మూగ జీవాల పాలిట
మృత్యువునవుతున్నా

ఇన్నాళ్ళూ
భయంతో భక్తితో
బండచాకిరీ చేస్తూ
పలకా బలపం పట్టాల్సిన చేత్తో
చౌడు సున్నం పిసుక్కుంటూ
చదువులేని చవటనౌతున్నా
అరేయన్నా ఒరేయన్నా
అణిగిపోయి వణికిపోయి
అయ్యా అమ్మా అంటూ
హద్దేలేని నీ అడ్డమైన పనులకు
గొడ్డునవుతున్నా

ఇంతాజేసి ఆఖరికి
జుబ్బా జేబులోనో
కోక కొంగు ముడిలోనో
నువ్వు జార్చుకొన్న చిల్లరకు
నేను దొంగగా దొరికా
నువ్ నిందలేస్తే ఆదురుతూ నుల్చోడానికి
అలాంటి ఇలాంటి సాకలోన్ని కాను

రామరాజ్యంలో రజకునిగా
ప్రశ్నించడం నేర్చుకున్నోన్ని
కంసుని ఏలుబడిలో ఎవరిసొత్తు వారిదేనని
గీతాకారుడికే ధర్మోపదేశం చేసిన మడేలోన్ని
చరిత్రను తిరగేస్తే
నిర్భయాన్ని నిండుధైర్యాన్ని
గుండెనిండా నింపుకొని
ఫ్యూడల్ వ్యవస్థ గుండెల్లో గునపాలు దింపిన
ఐలమ్మ వారసున్ని

## కాశ్మీరమా క్రాంతి రేఖ

### వంగల సంతోష్

ఓ నా ప్రియమైనా
కాశ్మీరమా...!
నిత్యం నెత్తురొడ్డుతున్న
దేహాల మధ్య/మీదా
కుంకుమ్మ పువ్వుల

వనమై పూస్తున్నావు..!

ఎన్నో నెత్తుటి మరకల ప్రవాహమై
పారుతున్న ప్రతి చోట
ప్రశ్నించే పౌరులంతా
ఎదురించిన వాళ్ళంతా
దేశద్రోహులై పోతున్నారు

కాశ్మీరియతే కాదు
అక్కడి ముస్లింలు కూడా
నేరగాళ్లయి పోతున్నారు
కాదంటే ఖబరస్తాన్
లేదంటే పాకిస్తాన్
ఇదేనా ప్రజాస్వామ్యం..!?

ప్రాణాలతో చెలగాటం
వధ్య శిలలమై పోవడం
భారత రాజ్యాంగం ఇచ్చిన వరమా..!?

కాశ్మీరమా..!
నీవు నిత్యం
ఎన్ని తూటాలను ఎదురొడ్డుతున్నావో
మతోన్మాదమై ఒకటి గుండ్లు దించుతుంటే
సామ్రాజ్యవాదమై మరోటి చావును బలిగోరుతుంది....

గుండె గొంతుకల్లోంచి నెత్తురును
స్రవింప జేస్తున్న
ఓ నా ప్రియమైనా
కాశ్మీరమా..!
నీవు కుంకుమ వనాల తోటలా
నిత్యం పారుతున్న రక్తాలను
జ్వలింపజేస్తున్న నీ త్యాగాన్ని
"బుర్హాన్" వాదీల కాంక్షను
ఎత్తిపట్టేనినాదమై నీవు
కాంతిపుంజాల రేఖవై వస్తావు....

# మక్రీ

**- కణ్ణగి (తమిళం)**

**తెలుగు అనువాదం - గోదావరి**

ఇక్కడి జీవితం
ముల్కరాజ్ ఆనంద్
'టు లీవ్స్ అనిడ్ వన్ బడ్'లా ఉండదు

ఇక్కడి జీవితం
బాలా తమిళ సినిమా
'పరదేశి'లో పట్టుకోలేని ఆర్తగీతంలా ఉంటుంది

ఇక్కడి జీవితం
అచ్చంగా పొట్టి క్యాట్ 'విషకన్య'!
ఈ నేలా, ఈ తోటలూ కాటేసి తీరతాయ్

ఇక్కడి జీవితం
కడుపు నిండక
పాలకోసం గుక్కపట్టిన పసిపిల్ల ఏడుపులా ఉంటుంది
కాస్తంత వెట్టిలానో
కాస్తంత దుఃఖం పిగలడంలానో
కాస్తంత వైరాగ్యం కూలదోయడంలానో
పెరుగుతూనే ఉన్న వడ్డీల్లానో
వడ్డీ వ్యాపారి బూతుకూతుల్లానో
సమయానికి మోగని సైరన్లానో
ఇక్కడి జీవితముంటుంది

తేయాకు దూసీ దూసీ
కదుములు కట్టి కరుకుబారిన
నుదుళ్ళ మీద పొటమరించిన
చేదు చెమటలా ఇక్కడ జీవితముంటుంది

అరికాల్లో కసక్కు'న దిగిన
మోడు మీది గడ్డకట్టిన నెత్తుర్లో
వినిపించే తరాల వలస గానంలా
ఇక్కడి జీవితముంటుంది
దేన్నయితే ఎవరైనా
జీవితమని నిర్వచించలేరో
అచ్చం అలా ఉంటుందిక్కడి జీవితం!

కొర్రిపట్టి పిగిలిన కన్నెపిల్ల పరికిణీలాగో
లోలోపల పదునుగా చీరుకుపోయిన గాయంలాగో
దుఃఖాన్ని అదిమిపట్టుకొని గింగిర్లెత్తడం లాగో
ఓ చివురుటాకు వడలిపోయి సోలిపోవడంలాగో
ఇక్కడి జీవితముంటుంది

గడగడ వణికించే మంచులాగో
పేల్చేసి ఎండలాగో
తూలిపోయే గాలిలాగో
ఏ గమ్యమూలేని పాటలో తుళ్ళిపడే పదంలాగో
ఇక్కడి జీవితముంటుంది

చిక్కగా కురుస్తోన్న నలుపులాగో
కేథలిక్ చర్చి ఫాదర్ వాక్కు లాగో
ముక్కిపోయిన రేషన్ సరుకులాగో
ఇక్కడి జీవితముంటుంది

ప్రూనింగ్ కత్తిలానో
చివుళ్ళ కోసం చెక్కేసే
మరుగుజ్జు తేయాకు చెట్టులానో
ఏమాత్రం విస్తరించని కలలానో
ఇక్కడి జీవితముంటుంది
దేన్నయితే జీవితమని పిలవలేమో
అచ్చం అలా
ఇక్కడి జీవితముంటుంది!

(మక్రీ అంటే తేయాకు కోసి వేసుకొని పెద్ద బుట్ట)

## ఇది ప్రేమలు విరియాల్సిన కాలం!

**- కణ్ణగి (తమిళం)**

*తెలుగు అనువాదం - గోదావరి*

చిక్కగా చీకటి కురుస్తోంది
మిత్రుడా!
ఇది కలలు నిషేధిత కాలం

ఉండుండీ
రాలిపడే వాన చినుకొకటి
నిశబ్దాన్ని చిట్లగొట్టేస్తుంది

చినుకు తట్టగానే
గుండె తలుపు తెరిచి
పచ్చగా పలకరించే
చిరువిత్తనం
ఈ హృదయం!

నిజం -
కలలా నువ్వు
కలలో నువ్వు
అలా వెన్నెల మాట్లాడుతూనే ఉంటుంది
పొద్దుతో మాట్లాడే పిట్టల గుంపులా
గుండె మాట్లాడుతుంది

మెరుపు మెరిసి
ఒక్క ఉరుము పిగలగానే
పచ్చని గరిక పువ్వు
వెచ్చగా విరుస్తుంది

పువ్వు విచ్చగానే
ఒళ్ళు విరుచుకొని
చెమ్మగా నవ్వే
మట్టి పరిమళం
మన స్నేహం!

నిజం -
అలలా నువ్వు
అలలో నువ్వు
అలా నది మాట్లాడుతూనే ఉంటుంది
ఒడ్డుతో మాట్లాడే కెరటాల్లా
మౌనం మాట్లాడుతుంది

అయినా
ఉండుండీ
రాలిపడే పండుటాకొకటి
మాటల సౌరభాన్ని దాచేస్తుంది

శీతగాలి గుండెను కోసేస్తుంది
లేచి పిలిచే పాట
లోలోపల దాగేస్తుంది

నీకూ నాకూ మధ్య
ఎప్పటిలా
ఈ నిశ్శబ్దమే!

యుద్ధం దట్టంగా కురుస్తోంది
ప్రియతమా!
ఇది ప్రేమలు కురిసే కాలం!

(ప్రియతమ కామ్రేడ్స్, దేవరాజ్, అజితలకు ప్రేమతో)

## ఓ దండా మా జెండా!

**- భూమి (కన్నడం)**

*తెలుగు అనువాదం - గోదావరి*

బంతీ పువ్వుల పువ్వుల దండ
ఓ దండా మా దండ
ఒక మాట చెప్పిపో ఓ దండా
ఒక పాట పాడిపో మా దండ

ఆడవిదారుల మల్లెల దండ
ఓ దండా మా దండ

చేతులు కలపవే - ఓ దండా
మాతో అడుగు కలపవే మా దండ

కారుమబ్బుల మబ్బుల దండా
ఓ దండా మా దండ
ఒక రాగమునియ్యవే ఓ దండా
నేల దాహము తీర్చవే మా దండ

ఏటి అలలతో నవ్వే దండా
ఓ దండా మా దండ
గలగల సాగవే ఓ దండా
పేద ఆకలి తీర్చవే మా దండ

వెన్నెల చినుకుల చినుకుల దండా
ఓ దండా మా దండ
ఒక గానము నియ్యవే ఓ దండా
ఒక వసంత మియ్యమే మా దండ

నెత్తుటి మడుగుల ఎగిరే జెండా
ఓ జెండా మా జెండా
బిడ్డల జాడను చెప్పవే ఓ జెండా
గుండెకోతను తీర్చవే మా జెండ

దిటవు గుండెల పిడికిట జెండా
ఓ జెండా మా జెండ
ఈ శిశిరమునాపవే ఓ జెండా
ఒక సమూహమవ్వవే మా జెండ

అడవుల గుండెల ఎగిరే జెండా
ఓ జెండా మా జెండ
ఒక స్వప్నము నియ్యవే ఓ జెండా
ఒక ప్రతిజ్ఞనియ్యవే మా జెండ!

*(ఏఓబి, నీలాంబుర్ ఎన్‌కౌంటర్ అమరుల స్మృతిలో)*

# తలొంచని గేయాలు

**- జయ (తులు)**

**తెలుగు అనువాదం - గోదావరి**

తమ దేహాల్లో చెరో పందొమ్మిది తూటాల గాయాల్ని దాచుకొని
తమ గాయాల్లో శతాబ్దాల అణచివేతల ఆగ్రహాల్ని దాచుకొని
చల్లని శవాల గదిలో అలా నిశ్చలంగా పరుండే
కోట్లాది పిడికిళ్ళుగా రూపొందడం
అనంత దేహ సమూహాలుగా విస్ఫారడం
రాజ్యం క్రూరత్వం మీదకు ధిక్కారాల్ని ఎక్కు పెట్టడం
ఎవరికి సాధ్యమవుతుంది?

దేహాల నిరాకార కాంతిలో
చీకటిని వెలిగించి నడిపించిన వాళ్ళే
తమ మృతదేహాల్ని సైతం
రణక్షేత్రాలుగా విస్తరించుకుంటారు

గాయాల అగాధాల్లోకి జీవితాల్ని వొంపి
శిశిరాల్ని చివురింపచేసిన వాళ్ళే
తమ ఛిద్రిత దేహాల్ని సైతం
ఎగసిపడే జెండాలుగా పిగిలిన క్రోధాలుగా
పెట్లిన విస్ఫోటనాలుగా ఎగరేయగలరు

అలా నిరూప విరామంలో
ఆగిపోయిన ప్రయాణాల్ని
కదం దొక్కిన జైత్రయాత్రలుగా కొనసాగించిన వాళ్ళే
తమ పిగిలిన దేహాల్ని సైతం
బంకర్లుగా, శతఘ్నులుగా
ఎక్కడికక్కడి మందుపాతర్ల మాటులుగా ఎక్కుపెట్టగలరు

చెదలు బారిన చట్టాలకు
నల్లబారిన న్యాయాలకు
చెమటలు పట్టించిన
ఆ దేహాల్లో పందొమ్మిది గాయాలు
ఆ గాయాల్లో తలొంచని గేయాలు!



● యామిని

# సీతాబాయి గెలుపు

రాత్రల్లా వెక్కి వెక్కి ఏడుస్తోంది సీతాబాయి. భర్త పంచిన ప్రేమ, ఆప్యాయతలు గుర్తుకు వచ్చి తట్టుకోలేకపోతుంది. మంచం మీద నుంచి లేచి గోడవారగా కూర్చుంది. కన్నీరు ధారలా కారుతోంది. జీవితం అంతా శూన్యంలా... ఏది చేద్దామన్నా యాంత్రికంగా... పైట చెంగుతో ముఖమంతా తుడ్చుకొని కాసిన్ని మంచినీళ్ళు గ్లాసుతో ముంచుకొంది. గ్లాస్ బిందెకు తగిలిన చప్పుడుకు పున్నావ్‌కు మెలకువ వచ్చింది. లేచి 'వదినా'! అని పిలిచాడు. 'ఆ'... అంది సీతాబాయి.

'నిద్రపట్టలేదా?'

'.....'

పున్నావ్ లేచి కూర్చున్నాడు. అరచేతులతో ముఖాన్ని కప్పుకుని తలొంచుకున్నాడు. భార్య మంగ్లీ కూడా లేచింది. తల్లి లేచేటప్పటికీ పక్కనున్న పిల్ల కూడా లేచింది. కూనిరాగాలు తీస్తున్న పిల్లను దగ్గరకు తీసుకొంది. లోపలి గదిలో లైట్ వెలుగుతోంది. ఆ లైట్ వెలుతురులో గోడవారగా కూర్చున్న తోడికోడలిని చూసింది. పిల్లను తీసుకొని లోపలికి పోయి తోడికోడలికి దగ్గరగా కూర్చుంది.

'పడుకోలేదా?' మంగ్లీ.

'ఇప్పుడే లేచాను' కన్నీళ్ళను తుడ్చుకుంటూ సీతాబాయి.

'ఎన్ని రోజులని బాధపడతావ్? గుండెను రాయి చేసుకోవాలే! మంగ్లీ.

'ఎలా మర్చిపోనే, ఒకటా, రెండా! పదమూడు సంవత్సరాలు' అంటూ కన్నీళ్ళను పైట చెంగుతో తుడుచుకుంది. మంగ్లీకి కూడా కన్నీళ్ళాగలేదు. పట పట చీరమీద పడ్డాయి. తల్లీ, పెద్దమ్మలను చూసి అర్థం కాక పిల్ల కూడా ఏడుపు అందుకొంది. సముదాయిస్తూ పిల్లను దగ్గరకు తీసుకొంది సీతాబాయి.

పున్నావ్ పంటి బిగువున బాధను అదిమి పట్టుకొన్నాడు. అక్కడ దిగులు, నిరాశలు కమ్ముకున్నాయి. కూర్చున్న వాడల్లా లేచి గాబు దగ్గరకు పోయి నీళ్ళను ముఖంపై చల్లుకున్నాడు.

ఒకరోజు కాదు, రెండు రోజులు కాదు, ప్రతిక్షణం. ప్రతిరోజు సన్నావ్‌ను తలచుకోని క్షణం లేదు సీతాబాయి. కన్నీరు పెట్టని రోజు, నిద్రపోయిన రాత్రి లేదు. ఏడ్చి, ఏడ్చి ముఖం అంతా కంది పోయింది. నిండుగా ఉన్న కళ్ళు నిప్పు కణికల్లా ఎర్రగా ఉన్నాయి. మరిచిపోదామని ఎంత ప్రయత్నించినా, జ్వరంతో మూలుగుతున్న సన్నావ్ రూపమే కళ్ళముందు కదలాడుతోంది. ఆ రోజు...

వానాకాలం కావటంతో పనులన్నీ ముగించుకొని రాత్రి 8 గంటలకే తిని పడుకొంది సీతాబాయి. బయట చప్పుడైంది.

'ఎవరా?' అని చూసింది.

భర్త సన్నావ్. బాగా జ్వరంతో ఉన్నాడు. మంచం మీద కూర్చుంటూ తన భార్యను జావ అడిగాడు. ఆ రోజు ఆమె జావ వండలేదు. సద్దిజావ తెచ్చి ఇచ్చింది. మంచి నీళ్ళడిగాడు. కాసిన్ని మంచినీళ్ళిచ్చింది. తాగి మంచంపై వాలుతూ కంబళి అడిగాడు. సీతాబాయి వేరే చోటికి పోయి పడుకుంటాడేమోననుకున్నది. అందుకే పైకి అన్నది కూడా.

'ఖాకీ లేకుండా పోలీసులు తిరిగేటప్పుడు నీవు ఇంట్లో పడుకుంటావా? వద్దు, అసలు మీ వాళ్ళ దగ్గర నుంచి ఇంత జ్వరంలో ఎందుకు వచ్చావ్? అక్కడ మంచి మందులుంటాయి కదా! అక్కడే ఉండాల్సింది.'

'అది కాదే! బాగా జ్వరంగా ఉంది. మన వాళ్ళ దగ్గర జ్వరం గోలీలు లేవు. అక్కడే ఉండమన్నారు కానీ నేనే వచ్చేశాను. మన దగ్గర నూరిన మందు తిందామని వచ్చాను' అని మూలుగు తున్నాడు.

చేయి పట్టుకు చూసింది సీతాబాయి. బాగా వేడిగా ఉంది. అవనూనే ఒళ్ళంతా పట్టించింది. కొంచెం వేడి తగ్గింది. నిదానంగా నిద్రలోకి జారుకున్నాడు. సీతాబాయికి కూడా నిద్రపట్టేసింది.

తెల్లవారు జాము 3 గంటలు అవుతోంది. బయట కుక్కలు మొరుగుతున్నాయి. ఉలిక్కిపడి లేచింది సీతాబాయి. బయటికి వచ్చి చూసింది. చిమ్మ చీకటి తప్ప ఏం కనిపించలేదు. లోపలికొచ్చి పడుకొంది. కానీ నిద్ర రావటం లేదు. 10 నిమిషాలు అయిందో లేదో? దభీమని తలుపు తన్నిన శబ్దం. ఫెళఫెళమని తలుపు రెండు ముక్కలవటం, ఇద్దరూ లేవటం రెండూ ఒకేసారి జరిగాయి. ఇద్దరూ బయటకు వచ్చారు. నల్లని ఆకారాలు. సీతాబాయికి భయమేసింది. సన్నావ్‌కైతే ఎటూ పోవడానికి దారి లేదు.

'నువ్వేనా సన్నావ్?' క్రూరమైన గొంతు.

'అవును'.

'మాతో రా!' గద్దించాడు.

ఆ క్రూరమైన ముఖం కళ్ళతో సైగలు చేసేటప్పటికీ క్రూరలైన మరో నలుగురు సన్నావ్ పెడరెక్కలు విరిచి పట్టుకున్నారు. ముందు, వెనక వాళ్ళే ఉండి మధ్యలో సన్నావ్‌ను నడిపించుకుంటూ తీసుకుపోతున్నారు. సన్నావ్ ఇల్లు దాటి ముందు ఇంటి దగ్గర ఆగారు. ఏం చేస్తారోనని వెంట వెళ్ళింది సీతాబాయి.

సీతాబాయిని చూసి 'ఎందుకు వస్తున్నావే?' అడిగారు పోలీసులు.

'పొగాకిద్దామని' సీతాబాయి.

'ఇప్పుడెందుకే?'

'తిన్న నాలుక కదా!'

సీతాబాయి పొగాకు ఇస్తుంటే, షర్టు తీసుకురమ్మని అడిగాడు సన్నావ్. ఇంటికి ఉరికొచ్చింది సీతాబాయి. దండెం మీద ఎర్రషర్టు. అప్పుడప్పుడు మీటింగులకు పోవాల్సి ఉంటుందని సంతకు పోయి

తెచ్చింది. అది తీసుకొని అంతే ఉరికి సన్నావ్‌కు ఇచ్చింది. తొడుక్కున్నాడు సన్నావ్. ఆ షర్టును చూసి ఆ క్రూరులు 'ఎర్రదే' అని వికటాట్టహాసం చేశారు. 'పద!' అంటూ పట్టుకుపోతున్నారు. సీతాబాయి కూడా వెనుకే పోయింది.

'ఎక్కడికే... వచ్చేది?' అని గదమాయించారు.

'నేను కూడా వస్తాను' అంటూ చిన్నగా చెప్పింది సీతాబాయి.

'అక్కడ వరకు నేను కూడా వస్తాను' సీతాబాయి.

'పొమ్మంటే నీక్కాదా, చెప్పేది' దబాయించారు.

చీకట్లో ఏం చేస్తారోననే భయంతో సన్నావ్ కనపడేంత వరకు చూస్తుండి పోయింది సీతాబాయి. వాళ్ళల్లో ఒకడైతే ముఖం కనిపించకుండా నల్ల గుడ్డలు చుట్టుకున్నాడు. వాడు ముందు ముందు పోతున్నాడు. వాడేవడో కానీ ఇన్‌ఫార్మర్‌లా ఉన్నాడు. లేదంటే దూరం దూరంగా ఎందుకుంటాడు? పైగా మామూలు బట్టలేనుకున్నాడు. వాడే పట్టుకొచ్చి చూపించినట్లున్నాడు. అందుకే ఏం చేస్తారోనని చాలా సేపటివరకు నిలబడి, బలవంతంగా ఇంటి కొచ్చింది సీతాబాయి. ఇంట్లో వాళ్ళు ఆందోళనతో ఎదురు చూస్తున్నారు. సీతాబాయి ఏడుస్తూ కుప్ప కూలిపోయింది. సీతాబాయిని చూసి ఇంట్లోవారు కూడా ఏడ్వటం మొదలుపెట్టారు కాసేపటికే తనే తెప్పరిల్లుకొని వారిని సముదాయించింది.

తెల్లవారింది. ఊరి పటేల్, సీతాబాయి, వార్డుమెంబర్, పున్నావ్ కలిసి తిన్నగా రావ్‌ఘాట్ స్టేషన్‌కు పోయారు. గేటు దగ్గర సెంట్రీ కాపలా ఉన్నాడు.

'ఎవరు మీరు?' అడిగాడు సెంట్రీ.

'ఠానేదారుని కలవడానికి వచ్చాం' పటేల్.

ఠానేదారు ఉన్నా కూడా లేడని అబద్ధం చెప్పాడు సెంట్రీ. అతని మాట వినకుండా గ్రామస్తులు లోపలికి పోయారు. లోపల కుర్చీలో కూర్చుని సిగరెట్ తాగుతున్నాడు ఠానేదారు. వారిని చూసి ఉరిమాడు.

'ఎవరు మీరు? ఎందుకొచ్చారు?' ఉగ్రుడై.

'మాది నిబ్రా గ్రామం. నేను ఆ ఊరి పటేల్‌ని. మా దగ్గర కుమ్మోటి కనిపించడం లేదు. మీ వాళ్ళు రాత్రనగ పట్టుకువచ్చారు. ఇంతవరకు ఇంటికి రాలేదు. అందుకే...' పటేల్.

'మా వాళ్ళెవర్ని పట్టుకురాలేదు. అసలు నాకేమీ తెలియదు. నేను కనుక్కొని తరువాత పంపిస్తాను' బుకాయించాడు ఠానేదారు.

వీడే పట్టుకు వచ్చి, మాకు చూపించకుండా ఏమి తెలియని నంగనాచిలా వాగుతున్నాడు. అసలు చేసిందంతా వీడే. ఠానేదారు కుక్క బుద్ధిని చీదరించుకుంది సీతాబాయి.

'లేదు. ఈ ఠాణావాళ్ళే పట్టుకొచ్చారు. చూపించండాయన్ని.' కన్నీళ్ళతో సీతాబాయి.

'ఏయ్... ఏంటే? ఎక్కువ మాట్లాడుతున్నావ్... ఇంకా మాట్లాడావంటే...' బూతులు లంకించుకున్నాడు ఠానేదారు.

వెంటనే వాళ్ళని నాలుగు పోలీసు కుక్కలు వెళ్లేశాయి. ఆ రోజుకు ఉత్త చేతులతో ఇంటికి వచ్చేశారు. వచ్చిన వారిని చూసి మరుదులు అడిగారు "అన్నయ్యేడని?" వారికి మౌనమే సమాధానమైంది. అందరూ దిగులుగా కూర్చున్నారు.

సన్నావ్ అంటే ఇంట్లో వారికి బాగా ప్రేమ ఎందుకంటే ఇంట్లో అందరికంటే అతనే పెద్ద. వాళ్ళు మొత్తం నలుగురు మగపిల్లలు. అందరికి



పెళ్ళిళ్ళు అయ్యాయి. వారికి ఊహ తెలియక ముందే జబ్బుల వల్ల సన్నావ్ తల్లిదండ్రులు ఒకరి తర్వాత ఒకరు చనిపోయారు. అప్పటి నుంచి సన్నావే వారిని సాకాడు. సన్నావ్‌కు పెళ్ళయ్యి సీతాబాయి ఇంట్లో అడుగుపెట్టేటప్పటికీ మరుదులు చిన్నవాళ్ళు. ఎక్కడికి పోయినా సీతాబాయి కొంగు పట్టుకు తిరిగేవారు. సీతాబాయి ఇంట్లో అడుగుపెట్టిన రెండు రోజులకు 'ఈ పిల్లల బాధ్యత కూడా మనదే' ననటంతో ఎటువంటి దాపరికాలు లేకుండా పెంచారు. అందరికన్నా చిన్నవాడైన పున్నావ్‌ను చదివించారు. ఇప్పుడతడు స్కూల్ టీచర్. చదువుకున్నాడని సీతాబాయి ఎక్కడికి పోయినా అతడినే తీసుకుపోతుంది. మిగిలిన ఇద్దరు మరుదులు పొలం పనులు చూస్తారు.

సీతాబాయికి పిల్లలు పుట్టకపోయినా ఏనాడు పల్లెత్తు మాట అనలేదు సన్నావ్. పైగా 'మనకు ముగ్గురు పిల్లలున్నారుగా' అని అంటుండేవాడు. ఇద్దరూ ఆ ముగ్గుర్ని కంటికి రెప్పలా పెంచారు. ఇంట్లో ఏ చిన్న పనైనా మరుదులు, మరదళ్ళు అడిగే చేసేవారు. అందుకే సీతాబాయిని వాళ్ళంతా అప్పుడప్పుడు నవ్వుతూ అమ్మా అంటుంటారు. అందుకే సీతాబాయి చెప్పకముందే నీరసంగా ఉన్న వారి ముఖాలను బట్టి 'అన్నయ్య' రాలేదని అర్థం చేసుకున్నారు.

ఆ రోజు వండిన అన్నం వండినట్లే ఉంది. నిద్రపట్టలేదు. ఎప్పుడు తెల్లవారుతుందా? అని ఆలోచిస్తోంది సీతాబాయి. అనుక్షణం భర్తే గుర్తుకు వస్తున్నాడు. ఎక్కడికి పట్టుకుపోయారో?... ఏం చేశారో...? అసలు ఉంచారా? లేదా? ఈ ఊహే భరించ లేకుండా ఉంది. తెల్లవారింది. ఆ రోజు కూడా ఠానాకు పోయారు.

'రేపు పంపిస్తామన్నారు. ఇంతవరకు పంపించలేదు.' ఠాణేదారునుద్దేశించి పటేల్.

'మా మనిషిని చూపించండి. జైల్లో పెడితే కనీసం అదైనా చెప్పండి' వార్డు మెంబర్.

'నిన్న పంపిస్తామన్నారు కదా! ఇక్కడి వరకే అని తెచ్చి ఇప్పుడు మనిషిని అజపజ లేకుండా చేసారు' సీతాబాయి.

'ఏయ్... ఏంటే వాగుతున్నావ్?' ఠానేదారు.

వార్డు మెంబర్‌కు, పటేల్‌కు ఠాణేదారు సైగ చేశాడు. సైగ అందుకొన్న వెంటనే వారిద్దరు లోపలికి పోయి, చాలా సేపటి తర్వాత బయటికి వచ్చారు.

'ఏమైంది?' అని ఆశ్చర్యంగా వారి ముఖాల వైపు చూసింది సీతాబాయి.

'ఏం లేదు, పదండి! అని ఇద్దరూ ఒకేసారి అన్నారు.

పిల్లల్లేకపోయినా సీతాబాయిని పల్లెత్తు మాట అనలేదు సన్నాప్. అతనికి ఊర్లో మంచి పేరుంది. మంచి నాటు వైద్యం చేస్తాడు. అడవికి పోయి రకరకాల వేర్లు ఆకులు, దుంపలు తెచ్చేవాడు. వాటిని సనికెంట్లో మంచిగా నూరేవాడు. తరువాత ఒంట్లో బాగాలేని వారికిచ్చేవాడు. ముందు ఎవరికీ అర్థం కాలేదు. తరువాత్తరువాత చుట్టుపక్కలందరికీ పాకింది. దూరం నుంచి వచ్చేవాళ్ళు ఒక నిద్ర తీయటానికి అనుకూలంగా వచ్చేవాళ్ళే అలా వచ్చిన వారికి లేదనకుండా, వాళ్ళు తినేదాంట్లోనే ఇచ్చేవాళ్ళు డబ్బులు అసలు తీసుకునేవాడు కాదు. ఒక సీసా నిండా జీలుగు కల్లు పట్టుకొని వచ్చేవారు. మందిచ్చినందుకు ప్రతిఫలంగా. సన్నాప్ చేతి చలువ ఏమోగాని, ఇచ్చిన మందులు మంచిగా పని చేసేవి. అందుకే సన్నాప్‌ను బాగా నమ్మేవారు. పార్టీ పనుల మీద రెండు, మూడు రోజులు ఇంటికి రాకుంటే, ఇంటినిండా పేషెంట్లే ఉండేవారు. మొదట్లో ఒకటి, రెండు రోజులు సన్నాప్ ఇంటికి రాకపోతే సీతాబాయి కంగారుపడేది. నిదానంగా అలవాటయ్యింది. ఒక్కోసారి 10 రోజులు కూడా ఇంటికి వెళ్ళేవాడు కాదు. లేటయినప్పుడు కారణం చెప్పేవాడు. మందుకు వచ్చే వారికి కూడా ఈ విషయం అర్థమయ్యింది. వారు కూడా సన్నాప్ ఇంట్లో ఉన్నదీ, లేనిదీ తెలుసుకొని మందు కోసం వెళ్ళేవాళ్ళు

సీతాబాయి, పున్నాప్‌లు నీరసంగా బయటకు వచ్చారు. దారిలో వారిద్దరూ ఏం మాట్లాడలేదు. సీతాబాయే కల్పించుకొని 'ఏం మాట్లాడారు?' అని అడిగింది.

'ఆ... ఏం మాట్లాడలేదు. పంపిస్తామన్నారని' శాంతంగా, పొడి, పొడిగా చెప్పాడు పటేల్.

'నీతో కాకా....?' వార్డు మెంబరు నుద్దేశించి.

'అదేనే'.

వాళ్ళు శాంతంగా చాలా తాపీగా మాట్లాడాన్ని చూస్తుంటే సీతాబాయికి కుత కుతలాడుతుంది. వారి ప్రవర్తన మీద సీతాబాయికి అనుమానం వచ్చింది. ముఖ్యంగా పటేల్ మీద. వాళ్ళు లోపలికి పోయినప్పుడు భయపెట్టినట్లున్నారు. అందుకే వారి ప్రవర్తనలో మార్పు వచ్చిందని గ్రహించింది సీతాబాయి.

ఇల్లు వచ్చింది. ఆ రోజు కూడా ఇంట్లో ఎవరూ అన్నం జోలికి పోలేదు. సీతాబాయి తినకపోయేటప్పటికీ మిగతావాళ్ళు కూడా తినలేదు. నా వల్ల అందరు ఎందుకు తిప్పలు పడాలని బలవంతంగా రెండు ముద్దలు మింగింది సీతాబాయి.

తెల్లారింది. నిన్నటి ప్రవర్తన చూస్తే పటేల్, వార్డుమెంబర్ ఆ రోజు ఠాణాకు రారనుకుంది సీతాబాయి. అయినా పిలిచి చూద్దామని, పోయింది. నాకు పొట్ట నొప్పిగా ఉందని పటేల్, 'ఇంట్లో ఎవరూ లేరే' అని వార్డు మెంబర్ తప్పించుకున్నారు.

ఒక మనిషిని అన్యాయంగా పట్టుకొని, మాయం చేస్తే? వీరికి కనీసం చీమ కుట్టినట్టైనా లేదు. ఎందుకు ఈ పటేల్ పదవి? సీతాబాయి తనలో తానే తిట్టుకొంది. 'ఛస్తే ఛస్తాను, ఉంటే ఉంటాను' అనుకొంటూ మరిదిని తీసుకొని ఠాణాకు పోయింది.

అప్పటికి పోలీసులు వేరే ఎవరినో పట్టుకువచ్చారు. అతడిని గొడ్డును బాదినట్టు బాదుతున్నారు. అతడు "అమ్మో! అమ్మో! నాకేమి తెలియదు సారూ, నీ కాల్మొక్కుతా!" అని వేడుకుంటు న్నాడు. కానీ ఆ మొర ఆలకించితే కదా!

ఠాణేదారు గొంతు వినపడుతోంది.

'ఏయ్! కుర్రకుంకా, మర్యాదగా ఒప్పుకో. ఎప్పటి నుంచి అందులో పని చేస్తున్నావ్? ఎవరెవరు తెలుసు నీకు? అని పేర్ల చిట్టా చదువుతున్నాడు.

'నాకెవరూ తెలియదు సారూ, నన్నొదిలెయ్యండి సారూ, నీకాల్మొక్కుతా' దీనంగా వేడుకుంటున్నాడు.

గదుముడు ఆపై లాఠీ ఫెళఫెళమని శబ్దం. పెద్ద పొలికేక. ఆ భవనమంతా దద్దరిల్లింది. సీతాబాయి వాళ్ళొచ్చారని లోపలికి కబురుపోయింది. ఠాణేదారు ఆగమేఘాల మీద ఉరుక్కుంటూ వచ్చాడు. లోపల ఏం చేశాడో బయటి వాళ్ళకు అర్థం కాకుండా ఉండటానికి పట్టిన చెమటను తుడుచుకుంటూ వస్తున్నాడు. కానీ వీడే ఆ ఘనకార్యం చేశాడని బయటి వారికి స్పష్టంగానే అర్థం అయింది. అంత దూరం నుండే సీతాబాయిని చూసి 'ఏంటే? మళ్ళీ వచ్చావ్?' అంటూ ముందుకు దూకి జబ్బ పట్టుకొని ఈడ్చి కొట్టాడు. పక్కనున్న పున్నాప్‌ను ఒక్క కుదుపు కుదిపాడు.

'ఏయ్! నీకు బుద్దిలేదేంటే? ఎన్నిసార్లే? నిన్ను కూడా గోతిలో పెట్టాలే ఇగో చూడు మళ్ళొచ్చావంటే నీ బట్టలూడదీసి...' అంటూ మీదికొచ్చాడు.

ఏం చేసేది లేక అక్కడి నుంచి బయటకు వచ్చేశారు. 'మనిషి గురించి ఆరా తీస్తే బెదిరిస్తున్నారు. కనీసం ఉన్నాడా? లేదా? ఆ ముక్కైనా తెలిస్తే ఇన్ని తిప్పలు ఉండవు కదా! పున్నాప్ స్కూల్‌కు వెళ్ళక వారం రోజులవుతోంది. టీచర్ అని అందరికీ తెలుసు. అతను కూడా భయపడుతున్నాడు. ఏం చేయాలో పాలు పోవటం లేదు. ఉన్న ధైర్యం కూడా సన్నగిల్లుతోంది. వాళ్ళ బెదిరింపులు చూస్తుంటే... నేను దేనికైనా సిద్ధమే. కానీ నన్నే ఆధారం చేసుకున్న ఇంటి వాళ్ళు... మరిది నౌకరీ..." ఆలోచిస్తుంది సీతాబాయి.

బిక్కుబిక్కుమంటు వారం రోజులు గడిచాయి. అనుకోకుండా ఓ రోజు ఓ చేదు వార్త సీతాబాయి చెవిన పడింది. 'సన్నాప్‌ను చంపి మడప అడవుల్లో పడవేశారని.' ఊహించని పరిణామానికి సీతాబాయి గుండె గతుక్కుమంది. ఒక్కసారిగా కుప్పకూలిపోయింది. అందరూ సీతాబాయి చుట్టూ మూగారు. ఏమైందోనని. మరి కాసేపట్లో ఏడుపులు మొదలయ్యాయి. 'ఇప్పుడేం చేద్దామనుకుంటూ' వాళ్ళల్లో ఆందోళన... ఆతృత కనిపిస్తున్నాయి.

ఊరి పరిస్థితి కూడా అదే. అందరి మొఖాల్లో ఒక రకమైన భయం. ఆ మూకలు వచ్చి కుమ్మోటిలాగా ఎవర్నన్నా మాయం చేస్తే... అందుకే మనసులో దీనిపై నిలదీయాలని ఉన్నా, 'భయమనే పెనుభూతం' వెనకడుగు వేయిస్తుంది. ధైర్యం కూడగట్టుకొని ఊరోళ్ళను బతిమాలుకుంది సీతాబాయి. మొదట వినలేదు. కన్నీళ్ళు ధారలా కారుతున్నాయి. చేతులెత్తి నమస్కరిస్తూంటే రాంబాయి కళ్ళను వత్తుకుంటూ ముందుకు వచ్చింది. ఆమె వెనుకనే సోమారి, సియాబత్తి, రాజుబత్తి... కళ్ళ నుండి కారుతున్న కన్నీరును పైటచెంగుతో తుడుచుకొంటూ సీతాబాయి దగ్గరికొచ్చారు.

నలుగురు తిన్నగా స్టేషన్‌కు పోయారు. సీతాబాయి గుంపును దూరం నుండే ఠానేదారు కంగారు పడుతున్నాడు. వీళ్ళేదో

చేస్తారనుకున్నాడేమో? గుటకలు మింగుతూ ఇద్దరు కానిస్టేబుళ్ళను సీతాబాయి గుంపు దగ్గరకు పంపించాడు, విషయం తెలుసుకోమని, ఎందుకొచ్చారో ముందే తెలిసి కూడా.

'ఆయన్ని ఒక్కసారి చూపించడయ్యా!' ఏడుస్తూ చేతులెత్తింది సీతాబాయి.

'అదిగో!' అంటూ అటువైపు చూయించాడు.

చంపి, పాతిపెట్టిన సన్నాప్ మట్టిదిబ్బ ఉందక్కడ. దాన్ని చూడగానే ఒక్కసారిగా గుండెల్ని పిండేసినంత పనయ్యింది. దిక్కులు పిక్కటిల్లేలా అరిచింది సీతాబాయి. అమాంతం అక్కడే కూలబడింది. నెత్తి, నోరు కొట్టుకుంటూ అరుస్తుంది. 'అయో! ఇప్పుడే పంపిస్తామని నిన్ను మట్టిలో కలిపారే!' అంటూ దాని మీద పడి బోరుమంది. పక్కనున్న వారు కూడా 'పాడు చేతులు. వీళ్ళకేం పోయేంకాలం వచ్చింది? బంగారం లాంటి మనిషిని మాయం చేశారే!' అంటూ శాపనార్థాలు పెట్టారు.

ఠానేదారు లోపలి నుంచి బయటికి రావడం లేదు. వాడు పంపిన పోలీసు కుక్కలే అక్కడ తిరుగుతున్నాయి. సీతాబాయి, రాజుబత్తి, సియాబత్తిల ఏడుపులు, అరుపులు విని దారిన పోయేవారు వస్తారేమోనని... పెద్ద గలాట అవుతుందేమోనని వారి ఆందోళన. అప్పటికే రోడ్డుమీద వచ్చిపోయే వారికి అర్థమై, అక్కడికి రాగానే వాహనాన్ని నిదానంగా పోనిస్తున్నారు.

మధ్యాహ్నపు ఎండ చుర్రుమంటోంది. ఠాణాదారుకు వచ్చిపోయే వాళ్ళు సీతాబాయికి సానుభూతిని చూపిస్తూ, మనసులోనే ఠాణేదారును తిట్టుకుంటున్నారు.

'ఏయ్! నడవండి బయటికి! ఇక్కడ కాదు మీ అరుపులు ఏడుపులు'' గెంటేశాడు కానిస్టేబుల్.

'మా మనిషిని పట్టుకొని చంపి బయటికి గెదుముతున్నారు. ఇంకెక్కడ ఏడవాలి?' కోపంగా అరిచింది రాజుబత్తి.

'ఏయ్... అరిచావంటే నాలుక కోస్తా. నడువు బయటికి''

పొంగి పొర్లుతున్న కన్నీళ్ళను పైట చెంగుతో అదిమి పట్టుకుంటూ బయటికి వచ్చింది సీతాబాయి. కాళ్ళకింద నేల రెండుగా చీలిపోయింది. అడుగులు పడటం లేదు. భర్త రూపమే కళ్ళు ముందు కదలాడుతోంది. పదమూడు సంవత్సరాల సహచర్యంలో పల్లెత్తు మాట అనని అతని స్వభావం. భర్తతో గడిపిన రోజులు ఒక్కొక్కటి గుర్తుకు వస్తూ...

పిల్లల్లేకపోయినా సీతాబాయిని పల్లెత్తు మాట అనలేదు సన్నాప్. అతనికి ఊర్లో మంచి పేరుంది. మంచి నాటు వైద్యం చేస్తాడు. అడవికి పోయి రకరకాల వేర్లు, ఆకులు, దుంపలు తెచ్చేవాడు. వాటిని సనికెంట్లో మంచిగా నూరేవాడు. తరువాత ఒంట్లో బాగాలేని వారికిచ్చేవాడు. ముందు ఎవరికీ అర్థం కాలేదు. తరువాత్తరువాత చుట్టుపక్కలందరికీ పాకింది. దూరం నుంచి వచ్చేవాళ్ళు ఒక నిద్ర తీయటానికి అనుకూలంగా వచ్చేవాళ్ళే. అలా వచ్చిన వారికి లేదనకుండా, వాళ్ళు తినేదాంట్లోనే ఇచ్చేవాళ్ళు. డబ్బులు అసలు తీసుకునేవాడు కాదు. ఒక సీసా నిండా జీలుగు కల్లు పట్టుకొని వచ్చేవారు. మందిచ్చినందుకు ప్రతిఫలంగా. సన్నాప్ చేతి చలువ ఏమోగాని, ఇచ్చిన మందులు మంచిగా పని చేసేవి. అందుకే సన్నాప్‌ను బాగా నమ్మేవారు. పార్టీ పనుల మీద రెండు, మూడు రోజులు ఇంటికి రాకుంటే, ఇంటినిండా పేషెంట్లే ఉండేవారు. మొదట్లో ఒకటి, రెండు రోజులు సన్నాప్ ఇంటికి రాకపోతే సీతాబాయి కంగారుపడేది. నిదానంగా అలవాటయ్యింది. ఒక్కోసారి 10 రోజులు కూడా ఇంటికి వెళ్ళేవాడు కాదు. లేటయినప్పుడు కారణం చెప్పేవాడు. మందుకు వచ్చే వారికి కూడా ఈ విషయం అర్థమయ్యింది. వారు కూడా సన్నాప్ ఇంట్లో ఉన్నదీ, లేనిదీ తెలుసుకొని మందు కోసం వెళ్ళేవాళ్ళు.

ఒకరోజు సీతాబాయికి ఊరి మహిళలను జమ చేయమని పురమాయించాడు. ఇంతెత్తున లేచింది సీతాబాయి. 'నీవు చేసేది కాక నాకెందుకని?'

'కొప్పడకే' అంటూ దాని అవసరాన్ని అర్థం చేయించాడు సన్నాప్. మహిళలను జమ చేయటం... మాట్లాడటం వెంటనే జరిగిపోయాయి. అలా సీతాబాయికి కూడా అలవాటయ్యింది. అలా అని గుర్తులన్నీ ఏడుస్తూనే ఒక్కొక్కటిగా పేర్చుకుంది సీతాబాయి.

అయినా ఆమె మదిని ఆవరించిన సన్నాప్ జ్ఞాపకాలు పొరలు పొరలుగా పైకి లేస్తూనే ఉన్నాయి.

పిల్లల్లేకపోతే భార్యే కారణమని పురుషుడు మరో పెళ్ళికి సిద్ధపడే ఆ రోజుల్లో మరోపెళ్ళి ఆలోచనే దరి చేరనీయకుండా ఒక అడుగు ముందుకే ఉన్న సన్నాప్ ఆదర్శాలు సీతాబాయిని కాసేపు వెంటాడాయి. మరుక్షణమే ఆయన విప్లవ కార్యాచరణ ఆమె కళ్ళముందు నిల్చింది.

సన్నాప్ గ్రామ డిఏకేఎమ్ఎస్ బాధ్యుడు. పేరుకు గ్రామ స్థాయి సంఘం. కానీ ఆయన పని ఏరియా స్థాయిలో ఉండేది. చుట్టుపక్కల గ్రామాలతో మంచి పరిచయాలుండేవి. పూజారిగా, సంఘ నాయకుడిగా ఆదరించేవారు ప్రజలు. ఆ ఆదరణలో నుంచి సంఘాలు, పార్టీ సెల్స్ - వీటినాధారంగా జనతన సర్కారు నిర్మాణం అయ్యింది. నాలుగు వర్గాల ఐక్యసంఘటన సర్కార్‌కు సన్నాప్ బాధ్యుడు. సర్కారుకు రక్షణగా ఉన్న మిలీషియా శత్రు కదలికలను కనిపెడుతూ క్రమం తప్పకుండా తిరుగుతుండేది. 3 క్యాంపులను కవర్ చేస్తూ, శత్రువుకు చికాకు కలిగించే చర్యలు మిలీషియా చేస్తుండగా, నిరంతరం ప్రజల సమస్యలను, వారి అవసరాలను తీర్చుతూ జనతన సర్కార్ ముందుకు పోతున్న సమయం అది. మరో వైపు ఆ ఊరికి 7 కిలోమీటర్ల దూరంలో ఉన్న రావ్‌ఘాట్ గనులను వెలికి తీయాలన్న ప్రయత్నాలు ముమ్మరంగా సాగుతున్నాయి.

నారాయణపూర్ నుండి భానుప్రతాపూర్‌కు పోయే రోడ్డుపై రావ్‌ఘాట్ ఉంది. రావ్‌ఘాట్ పేరుతో ఊరైతే లేదుగాని, ఒక భారీ పోలీసు క్యాంపు ఉంది. నిజానికది ఒక గుట్టల వరుస పేరు. ఈ గుట్టలపై ఇక్కడి ప్రజల పూజా మందిరం ఉంది. ఇక్కడ ప్రతి సంవత్సరం జాతర జరుగుతుంది. ఈ మేళాకు అన్ని తెగల ప్రజలు దూరం ప్రాంతాల నుంచి వేల సంఖ్యలో వచ్చి పూజలు చేస్తారు. ఈ గుట్టలను స్థానిక ప్రజలు తమ విశ్వాస కేంద్రంగా, సాంస్కృతిక వారసత్వ చిహ్నంగా భావిస్తారు.

ఈ గుట్టల వరుసలో మొత్తం 740 టన్నుల ఇనుప ఖనిజ నిలువలున్నాయని ఒక అంచనా. ఇక్కడ మంచి క్వాలిటీ కలిగిన ఇనుముంది. (62% ఎఫ్.ఈ. గ్రేడ్) ఈ గుట్టల్లో ఉన్న గనుల తవ్వకం ప్రారంభిస్తే 3,278 హెక్టారుల అడవులు పూర్తిగా నాశనమౌతాయి. ఈ ప్రాంతంలో ప్రవహించే మేండ్కీ నది, వాగులు కలుషితమౌతాయి. ఫలితంగా పంటపొలాలు నాశనమవుతాయి. పర్యావరణానికి కూడా పెద్ద ముప్పు వాటిల్లుతుంది. దీనికన్నా ముఖ్యంగా 23 గ్రామాల ప్రజల అస్థిత్వం ప్రమాదంలో పడుతుంది. నిజానికి రావ్‌ఘాట్ గనుల తవ్వకాల పథకం చాలాకాలం కిందటిది. 1992వ సంవత్సరంలో ప్రజల నుండి తలెత్తిన బలమైన నిరసనతో దీన్ని నిలిపివేస్తారు. అప్పట్లో అంతగఢ్ పట్టణంలో 10 వేల మంది ఆదివాసుల భారీ ఊరేగింపు నిర్వహించి ఈ గనుల తవ్వకాల ప్రతిపాదనను వ్యతిరేకించారు. ఇదీ రావ్‌ఘాట్ గనుల చరిత్ర.

గనుల తవ్వకాలను తెలుసుకున్న సన్నాప్ చుట్టుపక్కల గ్రామాలకు ఏ విధంగా గుదిబండ అవుతుందో వివరించాడు. ఈసారి ఎన్ని అడ్డంకులు వచ్చినా రాజకీయ నాయకుల అండదండలతో పని మొదలుపెట్టాలనే లక్ష్యంతో కంపెనీ ఉంది. ఒకరోజు ఎటువంటి

ఆదేశాలు లేకుండానే అంతాగఢ్ ఎమ్ఎల్ఏ, ఛత్తీస్‌గఢ్ అటవీశాఖా మంత్రి విక్రమ్ ఊసెండీ నిబ్రా గ్రామానికి ఉన్నట్టుండి ఊడిపడ్డాడు. రావ్‌ఘాట్ స్టేషన్ నుంచి పోలీసు బ్యాచీలను తీసుకొని చడీ చప్పుడు లేకుండా వచ్చాడు. ఊరు సమీపిస్తుందనగా ఆయనతో తీసుకువచ్చిన బ్యాచీలు అటూ, ఇటూ ఒకటే పరుగందుకున్నాయి. గ్రామ బొడ్డురాయి దగ్గరికి వచ్చి మంత్రి ఆగాడు. పెత్తందార్లందరూ అంత పెద్ద మనిషి ఊరికి వచ్చిండని వంగి వంగి నమస్కారాలు పెడుతూ అక్కడి జనాన్ని అటు ఇటు పనులకు పురమాయిస్తున్నారు. ఇంతలో ఊసెండి మాట్లాడతానని మైక్‌లో చెప్పాడు.

మైక్ దగ్గరికి వచ్చిన ఊసెండి ఒక్కసారి గొంతు సవరించు కొని బడా పెట్టుబడిదారీ సంస్థ నెకో కంపెనీ మన భవిష్యత్ గురించి ఆలోచించి గనుల వెలికితీతకు పూనుకుంది. ఆ గనులు మన భూముల్లోనే ఉన్నాయి. గనులు తవ్వాలంటే మనం ఆ భూములను కంపెనీకి ఇవ్వాలి. అంటే ఊరికే కాదు. భూములకు సరిపడా పైసలిస్తారు. ఆ పైసలతో మనం వ్యాపారాలు చేసుకోవచ్చు, టీ.వీలు, వాహనాలు మరేనైనా కొనుక్కోవచ్చు. 'గనులు తవ్వితే మనకే కదా ఉద్యోగాలు' అంటూ ముగించాడు.

జనంలో గందరగోళం మొదలైంది. 'ఎంతో ప్రేమతో మనోడే కదాని ఓట్లు వేసి గెలిపిస్తే, ఇప్పుడు భూములిమ్మంటాడు. మరి తన భూమి కూడా ఇస్తాడా?' ఇకరిద్దరు గుసగుసలాడుతున్నారు.

'మీరెంత తొందరగా భూమిలిస్తే అంత తొందరగా నష్టపరిహారం వస్తుంది' విక్రమం ఊసెండి.

'నిజం నిజం' పెద్ద మనుషులు వంత పలికారు. అలా అనగానే పెద్ద మనుషుల వైపు చిరునవ్వు విసిరాడు ఊసెండీ. అదే పెద్ద మనుషులకు పరమానందం అయ్యింది.

మరుసటి రోజు ఊరు బొడ్డురాయి వద్ద జనమంతా జమయ్యారు. బి.జె.పి. నాయకుడు సాలీ 'మరింకేం లేటు చేసేది? లేటు చేసిన కొద్దీ మనకే నష్టం. ఎంత తొందరగా భూములను ఇస్తే అంత తొందరగా పనులు మొదలవుతాయి. ఆ తరువాత ఉపాధి మనకేగా! ఏం సోబి?'

'అవునవును' సోబి.

జనం మాత్రం అయోమయంగా చూస్తున్నారు. ఉన్న భూమిపోతే మిగిలేదేముంది? చిప్పకూడు తప్ప అని ఆలోచిస్తున్నారు. అప్పటికే కంపెనీ ముడుపులు పెత్తందారులకు అందాయి కాబట్టి పనిని వేగవంతం చేశారు. సోబి కాగితాలను తీసుకువచ్చాడు. సాలీ వాటినందుకొని - 'ఊ... పదండిరా పదండి' పటేలు.

ఒకరిద్దరు సంతకం పెట్టారు. కొద్దిమంది పెట్టాలా? వద్దా? అని భూములు లేకుండా బతుకుడు ఎట్లా? అసలే పెట్టవద్దని మరి కొద్దిమంది.

ఏం రా! మీరూ... సాలి

'మా భూములు వదులుకోం' జనంలో నుండి.

'అది కాదురా... ఛత్' అంటూ ఇంకా మాట్లాడినా ప్రయోజనం ఉండదనుకొని అయిన కాడికి సంతకాల కాగితాలను అందుకున్న సాలి గబగబా ఇంటిదారి పట్టాడు.

సాయంత్రమయ్యింది. మేతకు పోయిన పశువులు ఇళ్ళకు చేరుతున్నాయి. చావిట్లో ఉన్న లేగదూడలు తల్లిపాలకోసం అంబా అంటూ అరుస్తున్నాయి. ఇళ్ళకు వచ్చిన పశువులకు మధ్యాహ్నం తెచ్చిన గడ్డిని రైతులు ముక్కలుగా నరికి వేస్తున్నారు. ఊళ్ళో బోరింగు సందడి. సందడిగా ఉంది. పొలం పనుల నుంచి అప్పుడే ఇంటికి రావటంతో మహిళలు అంట్ల గిన్నెలు తోముతున్నారు. ఇళ్ళకు చేరిన పిల్లలు కేరింతలు కొడుతున్నారు. సన్నావ్ అప్పుడే ఇంటికి వచ్చాడు. సన్నావ్ వచ్చాడని తెలిసి మనుకు, గుడ్డూలు ఆదరాబాదరగా వచ్చారు. ఉదయం జరిగిన మీటింగ్‌నంతా పూసగుచ్చినట్టు చెప్పారు.

'ఇంతకీ అది మాట్లాడుదామనే వచ్చారా? మీ బుద్ధి పోనిచ్చుకున్నారు కాదూ, భూములను వదిలేసి జనం ఎటుపోవాలని మీ ఉద్దేశం? వాళ్ళిచ్చి నాలుగునోట్లు చేతిలో పెట్టేటప్పటికీ నోరూరింది. మీకు జనం తిప్పలు మీకెందుకు? మీ పొట్టలు నిండితే చాలు' సన్నావ్.

'అది కాదురా మానా!' పళ్ళూడిపోయిన గొయతల్.

'ఇంకేం కాదు, పోయి జనం దగ్గర మాట్లాడు.' సన్నావ్. జనం దగ్గర అనేటప్పటికి గుటకలు మింగారు పటేలు, పూజారి. గతంలో ఒకసారి ఇందిరమ్మ ఇళ్ళ విషయంలో జనంతో మాట్లాడినప్పుడు వారి ప్రతిస్పందన గుర్తుకొచ్చింది ఇద్దరికి. సన్నావ్ అరకను, నాగలిని ఒక దగ్గరకు తెచ్చి, ఎడ్లను విప్పుతున్నాడు. తమ పన్నాగ్ పారనందుకు ముఖాలు చూసుకొని బయలుదేరారు పెత్తందారులు.

ఆ రోజు అంతగఢ్ మీటింగ్. ముందు నుంచే చుట్టుపక్కల ప్రచారం జరిగింది. అనేక ఆదివాసీ ప్రజాసంఘాలు కూడా ఈ గనుల తవ్వకాలను వ్యతిరేకిస్తున్నాయి. గనుల తవ్వకాలను వ్యతిరేకించే వారందరూ ఒక కమిటీని ఏర్పరచుకొని దాని నాయకత్వంలో అంతాగఢ్‌లో మీటింగ్ పెట్టాలని నిర్ణయించు కున్నారు. సన్నావ్ ఆ కమిటీకి బాధ్యుడు. జనం తండోప తండాలుగా సద్దిమూటలు పట్టుకొని మరీ వచ్చారు.

'మనిషి లేనిది చూసి ఇంత నాటకమాడుతున్నాడు సాలి! పేరుకు మేనమామ. కానీ మొదటి నుంచి పుల్లలు పెట్టే యవ్వారమే. వాడి మాటలు నమ్మటానికి వీలు లేదు. కష్టాల మీద పైసలు ఏరుకునేటోడు. ఓరేయ్ మనుకు! మన వారందరినీ జమ చేయి. నేనిప్పుడే వస్తాను.' మనుకు, గుడ్డూలు పిలవడం ఆలస్యం వెంటనే అందరూ జమయ్యారు పెత్తందారులు వారి తొత్తులు తప్ప వచ్చిన వారినుద్దేశించి...

'ఉదయం మీటింగ్ జరిగింది కదా! ఇప్పుడు మనం దాని మీద నోరు విప్పకపోతే రేపు మన బతుకులకే ముప్పు. మన పిల్లా, జెల్లా ఉన్న భూము నొదిలి పెట్టి ఎక్కడికని పోవాలి? కంపెనీ మనలను నిలువునా చంపేస్తుంది. దాని పైసలకు మనం ఆశపడ్డామంటే మనకు మిగిలేది ఏముండదు. మన బతుకులను నిలువునా నాశనం చేస్తున్న ఆ తవ్వకాలను ఆపాలి, ఆపించాలి. దాని కోసం మనం ఇప్పటినుంచే సిద్ధపడాలి. మనం నోరు మెదపకుండా ఉంటే మన నెత్తికి ఎక్కుతారు. గట్టిగా నిలదీస్తే తోక ముడుస్తారు'. సన్నావ్.

అంతా నిశ్శబ్దం ఆవరించింది. నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ 'సరే! ఆలోచించండి' అన్నాడు సన్నావ్.

'లేదు, మా భూములు మాకే ఉండాలి' లచ్చు.

'ఉన్న భూమి అమ్ముకుంటే రేపు కూడెట్లా? సాధు.

'ఉన్న భూమిని నేలను విడిచి ఎక్కడికని పోవాలి? దీన్నే నమ్ముకొని కలో గంజో తాగుతున్నాం, ఇప్పుడు ఇది కూడా లేకపోతే ఎలా?' సుకియారి.

'మీరు చెప్పింది మంచిదే, మరి సంతకాల మాటేమిటి?' సన్నావ్.

'మాకిష్టం లేదు. బలవంతంగా తీసుకున్నారు' పున్నాయి.

'మూశారా! పైసలకు ఆశపడ్డ పెత్తందారులు మనలను కూడా ఆ ఉచ్చులోకి లాగుతారు. అందుకే వారు చెప్పేటప్పుడు ముందు, వెనుకా ఆలోచించాలి. ఆ ఉచ్చులోకి మనలను లాగేటప్పుడు బంధుత్వాన్ని కూడా ఉపయోగిస్తారు. అందుకే ఈ రోజు నుండే మనం మన తవ్వకాల నిలిపివేత పనులను చేసుకోవాలి. గ్రామ, గ్రామన ఈ గనుల వల్ల

ఎంత నష్టమో వివరించాలి. అందరినీ కలుపుకు పోవాలి. పంచాయితీ, బ్లాక్, జిల్లాలెవల్లో మీటింగులు, అవసరముంటే ర్యాలీలు, ధర్నాలు, రాస్తారోకోలు చేయాలి. ఇక్కడ మాట్లాడుకున్న విషయాలు బయటికి పొక్కవద్దు, మరి మనం మన భూములను రక్షించుకోవాలంటే మనం రక్షణ దళాలు పెట్టుకోవాలి'

'ఎవరితో పెట్టుకుందాం?'

'దన్ను, పొగు, బాద్రాయ్, శ్యామ్‌లాల్, మంగ్లు ఐదుగురు చాలు. ఈ ఐదుగురికి మంగ్లు బాధ్యుడు' మను తక్కున చెప్పాడు.

'అవునవును వారే ఉండాలి' అందరూ.

'ఇవిగో పట్టుకోండి విల్లుకాండీలు, వడిసెలు' ఇచ్చాడు సన్నావ్.

అందరూ ఉత్సాహంతో ఎవరి ఇళ్ళకు వారు వెళ్ళిపోయారు. ఏ సమయంలో ఏం జరుగుతుందోనని సన్నావ్, రక్షణ దళం మనుకు, గుడ్డులను తీసుకొని రహస్యంగా పడుకోవటానికి పోయాడు.

కోడి కూతతో మెలుకువ వచ్చిన సన్నావ్ మనుకు, గుడ్డులను లేపి, తర్వాత కలుసుకోవాల్సిన చోటు, సమయం చెప్పి ఇంటికి చేరాడు. ఇంటి దగ్గర మందు కోసం వచ్చిన పక్క ఊరి వారి బాగోగులు తెలుసుకొని ఉలవల గంప తెచ్చి ముందు పెట్టుకున్నాడు. బయట మాటలు వినవడ్డాయి. అటువైపు చూశాడు. తనింటి గడపే ఎక్కుతున్నారు. ఎప్పుడూ రానివారు హఠాత్తుగా ఊడిపడుతుంటే రాత్రి మీటింగ్ ప్రభావేమో అనుకున్నాడు సన్నావ్. పటేల్, గయతల్, పూజారి, సర్పంచ్, వార్డుమెంబర్, మరో ఇద్దరు పెత్తందారులు వచ్చిన వారిలో ఉన్నారు. వరండాలో కుంపటి రాజుకుంటుంది. వచ్చినవారు నెగడు చుట్టూ కూర్చుని చుట్ట కాలుస్తున్నారు. మధ్య, మధ్యలో తుపుక్కుమని ఉమ్ముతున్నారు. సీతాబాయి లోపల డికాషన్ పెట్టింది. వేడి వేడి టీని వచ్చిన వారికి తెచ్చిచ్చింది సీతాబాయి. 'ఇప్పుడెందుకే?' అని మాట వరుసకు అన్నారు.

'ఇన్ని నీళ్ళియ్యవే' వార్డుమెంబర్.

'ఇవిగో' సీతాబాయి.

ఒక్కొక్కరే లేచి నోరు పుక్కిలించి, డికాషన్ తాగుతూ అవి, ఇవి పొంత నలేకుండా మాట్లాడుతున్నారు. విషయం అర్థమైంది సన్నావ్‌కు.

'ఏరా! సన్నావ్ మనోళ్ళు పైసలిస్తామంటున్నారు' పటేల్.

'దేనికి?' సన్నావ్.

'దేనికేంటిరా, అంతా తెలిసే అడుగుతున్నావు! మొన్న ఆ భూములను కొలిచిండ్రు కదా! అవన్నింటికి పైసలిస్తారంటరా! మనకేం దిగులు పడాల్సిన అవసరం లేదు. మన బాగోగులన్నీ వారే చూసుకుంటారు. నీవు ఆ భూములున్న వారికి చెప్తే...' జగదీష్

జగదీష్ రెండుసార్లు గ్రామ సర్పంచ్‌గా పనిచేసి ఊరి రోడ్డుకు వచ్చిన పైసలను తిన్నాడు.

'అయినా కంపెనీ వస్తే ముందు మనకేగా ఉపాధి వేరే వారికెందుకు ఇస్తుంది? ఇస్తే మేమంతా ఊరుకుంటామా?' హజారి.

హజారి జగదీష్ కుడిభుజం. ఊరి రోడ్డుకు వచ్చిన పైసల్లో సగం తిన్నాడు.

'ఇంతకీ అది మాట్లాడుదామనే వచ్చారా? మీ బుద్ధి పోనిచ్చుకున్నారు కాదూ, భూములను వదిలేసి జనం ఎటుపోవాలని మీ ఉద్దేశం? వాళ్ళొచ్చి నాలుగునోట్లు చేతిలో పెట్టేటప్పటికీ నోరూరింది. మీకు జనం తిప్పలు మీకెందుకు? మీ పొట్టలు నిండితే చాలు' సన్నావ్.

'అది కాదురా నూనా!' పళ్ళూడిపోయిన గాయతల్.

'ఇంకేం కాదు, పోయి జనం దగ్గర మాట్లాడు.' సన్నావ్. జనం దగ్గర అనేటప్పటికీ గుటకలు మింగారు పటేలు, పూజారి. గతంలో ఒకసారి ఇందిరమ్మ ఇళ్ళ విషయంలో జనంతో మాట్లాడినప్పుడు వారి ప్రతిస్పందన గుర్తుకొచ్చింది ఇద్దరికి. సన్నావ్ అరకను, నాగలిని ఒక దగ్గరకు తెచ్చి, ఎడ్లను విప్పుతున్నాడు. తమ పన్నాగం పారనందుకు ముఖాలు చూసుకొని బయలుదేరారు పెత్తందారులు.

ఆ రోజు అంతగఢ్ మీటింగ్. ముందు నుంచే చుట్టుపక్కల ప్రచారం జరిగింది. అనేక ఆదివాసీ ప్రజాసంఘాలు కూడా ఈ గనుల తవ్వకాలను వ్యతిరేకిస్తున్నాయి. గనుల తవ్వకాలను వ్యతిరేకించే వారందరూ ఒక కమిటీని ఏర్పరచుకొని దాని నాయకత్వంలో అంతాగఢ్‌లో మీటింగ్ పెట్టాలని నిర్ణయించుకున్నారు. సన్నావ్ ఆ కమిటీకి బాధ్యుడు. జనం తండోప తండాలుగా సద్దిమూటలు పట్టుకొని మరీ వచ్చారు.

'మా ప్రాణాలు పోయినా భూములు ఇవ్వం' అని ముక్త కంఠంతో నినదించారు. తరువాత వారం కోయిలబేడ మీటింగ్, ర్యాలీ.. మరొక 10 రోజులలో కాంకేర్‌లో బహిరంగ సభ. అన్ని సభలను సన్నావ్ ముందుండి నడిపించాడు. ప్రజల కోసం పాటు పడుతున్న సన్నావ్‌కు ప్రజల్లో అభిమానం పెరిగింది. సన్నావ్ అడుగు జాడల్లో ముందుకు కదులుతున్నారు ప్రజలు.

పైసలు తిన్న పెత్తందారులు ఒక పట్టాన ఈ తతంగాన్ని జీర్ణించుకోలేకపోతున్నారు. ఎలాగైనా కంపెనీకి భూములు సాధించాలని వెంపర్లాడుతున్నారు. కానీ రోజు రోజుకు ప్రజల నుంచి వ్యతిరేకత తీవ్రమవుతోంది. రోజు కొక మీటింగు, రాత్రివేళ పహారాలు - అందరూ ఒక కట్టుగా నినదించడం. విస్తృత ప్రజాపోరాటాల ఫలితంగా, ప్రజల నుంచి వచ్చిన తీవ్ర ప్రతిఘటనతో కంపెనీకి, వారి తొత్తులకు ఏం చేయాలో అర్థం కాక తోక ముడిచారు.

ఈ మొత్తం కార్యక్రమంలో సన్నావ్ ప్రధాన పాత్రధారుడని గ్రహించిన కంపెనీ సన్నావ్‌ను అంతమొందించడానికి ప్లాను వేసింది. మరిన్ని డబ్బులిచ్చి పెత్తందారులను కొని సన్నావ్‌కు వ్యతిరేకంగా నిలబెట్టింది. సన్నావ్‌కు కుడి భుజంగా ఉన్న సియ్యారామ్‌ను రావ్‌ఘాట్ సంతలో పట్టుకొని లాలూచీ చూపించి సన్నావ్‌ను చంపటానికి ప్లాన్ ఇచ్చారు. కంపెనీవారు, పోలీసులు దానికోసం రాయ్‌పూర్‌లో సీఆర్‌పీఎఫ్ శిక్షణ 3 నెలలు ఇచ్చి పంపారు.

శిక్షణ నుంచి వచ్చిన సియ్యారామ్ ఎవరికీ అర్థం కాకుండా ఉన్నాడు. సన్నావ్‌కు ఈ విషయం తెలియదు. ముందటిలాగా విశ్వాసంగా వ్యవహరిస్తున్నాడు. అదను కోసం చూస్తున్నాడు. మధ్యలో కంపెనీవారు, పోలీసులు పిలిపించుకొని 'ఎప్పుడురా నీ పని?' అంటూ 2 నోట్ల కట్టలను మీదికి విసిరేశారు. కోతికి కొబ్బరికాయ దొరికిన చందంగా ఆ కట్టలు అందుకొన్న సియ్యారామ్ గ్రామానికి వచ్చాడు. సన్నావ్ ఇంటికి వచ్చి చూశాడు. సన్నావ్ కనిపించలేదు. సీతాబాయిని అడిగాడు పోయి 10 రోజులయ్యింది ఇంత వరకు రాలేదన్నది. సియ్యారామ్ బాగా కంగారు పడుతున్నాడు. మళ్ళీ వారు పిలిచి అడిగితే... పైసలు వాపస్ ఇవ్వమంటే... అమ్మో... పైసలు వాపస్ ఇవ్వమనరు గానీ, సన్నావ్ పని నేను చూడాలి. అది కాకపోతే నా పని వారు చూస్తారు. ఊహించటమే కష్టంగా ఉంది.

అది 2010 సంవత్సరం అక్టోబరు 22వ తేదీ. రాత్రి 8 గంటలవుతోంది. చిన్నగా వాన మొదలైంది. ఏడుగురితో కూడిన దళం. కొద్దిమంది మిలీషియా, సర్కార్ కామ్రేడ్స్ కూడా ఉన్నారు. దళానికి కమాండర్ కామ్రేడ్ కమల. అందరూ అన్నం తిని బయలుదేరటానికి సిద్ధమయ్యారు. 10 రోజుల నుంచి పనుల వలన దళంతోనే ఉన్న సన్నావ్‌కు జ్వరం వచ్చింది. మాత్రలు తిన్నాడు, కానీ తగ్గలేదు. అందుకే ఇంటి దగ్గర నాటు మందు తిందామనుకొని కమలను అడిగాడు.

'చీకటి, వర్షం, పైగా బాగా జ్వరం ఎలా పోతావ్?' ప్రశ్నించింది కమల.

'నిదానంగా పోతాను' సన్నావ్.

ఊరంచువరకు సన్నావ్‌కు తోడుగా ఇద్దరు కామ్రేడ్స్‌ను పంపించింది. కమల.

దారిలో వర్షం జోరందుకుంది. అసలే జ్వరం. తడిస్తే ఇంకా పెరుగుతుందని పెద్ద పెద్ద అంగలేసుకుంటూ నడుస్తున్నాడు. అదిగో, అప్పుడే చూశాడు సియ్యారామ్. సన్నావ్‌ను గొడ్డలితో చంపమని ప్లాను ఇచ్చారు గానీ ధైర్యం చాలలేదు. అందుకే అటు నుంచి అటే పోలీసుల వద్దకు పరుగెత్తాడు.

రక్తం రుచి మరిగిన పులులు కదా! లేడి పిల్లను నోట కరుచుకొని ఈడ్చుకుపోయారు. అంతా నిమిషాల్లో జరిగిపోయింది.

కోట్లకు పడగలెత్తిన విషనాగు సన్నావ్‌ను అడ్డు తప్పిస్తే కుప్పలు తెప్పలుగా మణులే, మణులు, రాశులే రాశులు చేతికి అందిన వచ్చినవి చేజారిపోతాయనే భయం. ఆ భయంతో తెల్లవారక ముందే చంపేసి ఎన్‌కౌంటర్ కట్టు కథ అల్లారు. నెత్తురు పారించైనా గనుల తవ్వకాలు మొదలెట్టాలనుకున్నారు. కానీ కథ అడ్డం తిరిగింది.

సన్నావ్ విప్లవకార్యాచరణను, ఆదర్శాలను ప్రజలు ముందుకు తీసుకుపోతున్నారు. కంపెనీలు, వాటికి కీలుగుర్రాలుగా ఉన్న పెత్తందారుల మాటలను ప్రజలు పెడచెవిన పెట్టారు. మన భూములు మనకు దక్కాలంటే తిరగబడాలనే సత్యాన్ని తెలుసుకున్నారు. గనుల తవ్వకాలను వ్యతిరేకించినందుకే సన్నావ్‌ను 'హత్య' చేశారని భయపడకుండా ఊరూరా అతని లక్ష్యాలను చాటి చెప్పారు. ప్రతి గ్రామంలో వాలంటీర్ దళాలు పెట్టుకొని గ్రామాలకు వచ్చే అధికారులను తరిమికొడుతున్నారు. రాత్రి 'పహారా' మామూలయ్యింది. గనుల దగ్గర కూడా చెకింగ్ చేస్తున్నారు. పిల్లలు, పెద్దలు, ముసలి, ముతక అందరిదీ ఒకేమాట, ఒకే కట్టు. వారి పోరాట పట్టుదలకు చలించిన కమల వారిని కలవడానికి పోయినప్పుడు...

ఒక పెద్ద వయస్సతను 3 కాళ్ళతో వచ్చి 'ఈ కర్రనే నా ఆయుధం మా తాత, ముత్తాతల నుంచి ఈ నేలనే నమ్ముకొని బతుకున్నాం. ఇప్పుడు వీళ్ళొచ్చి మాకు ఏం ఒరగబెడుతారు? ఇన్ని సంవత్సరాలు మేం తింటున్నామా? లేదా? అని చూసిన పురుగు లేదు. ఇప్పుడు కావాల్నా మా బతుకులు? మాకు నౌకరి ఇస్తారట. నా భూమి లాక్కుని నాకు ఏమి నౌకరి ఇస్తారో? ఆవేశంతో ఊగిపోతూ మాట్లాడుతున్నాడు.

నిజమే. తరతరాలుగా ఈ నేలను నమ్ముకుని బతుకున్న వారు ఇప్పుడు ఉన్న పళంగా ఊర్లు ఖాళీ చేసి పోవాలంటే ఎక్కడికని పోవాలి? ఏం చేసుకుని బతకాలి? రోడ్ల మీద బికారులయ్యి బతకాల్సిందే. అంతకుమించి మరో మార్గం లేదు. జీవితంలో అన్ని కష్టనష్టాలను ఓర్చాడు కాబట్టి ఆ పెద్దాయన అంత ఆవేశంగా జీవితసత్యాన్ని చెప్పాడు.

మరోపక్క సీతాబాయి 'భర్తది ఎన్‌కౌంటర్ కాదని, హత్యేనని' నినదించి ఆదివాసీ ప్రజాసంఘాల అండతో సన్నావ్ ఎన్‌కౌంటర్‌పై నిజనిర్ధారణ జరపాలని బ్లాక్ ఆఫీస్‌కు పోయి తహసీల్దారుకు, జిల్లా కలెక్టర్‌కు విన్నపం ఇచ్చింది. బహిరంగ సభలలో గట్టిగా మాట్లాడింది. అనేకులు ఆమెకు మద్దతిచ్చారు. అందరి వాదనలు విని తప్పనిసరి పరిస్థితుల్లో జిల్లా కలెక్టరు నిజనిర్ధారణకు ఆదేశాలిచ్చాడు. వెంటనే ఠానేదారు సస్పెన్షన్ ఆర్డరు వచ్చింది. ఇక చూడాలి ఠానేదారు పరిస్థితి.

ఒకరోజు ఠానేదారు అగ్గిమీద గుగ్గిలం అవుతూ సీతాబాయి ఇంటికి వచ్చాడు. వస్తూనే... "ఏయ్ ఎక్కడే, నన్నే సస్పెన్షన్ చేయిస్తావే. నీ అంతు చూస్తానుండు. కిక్కురుమనకుండా జైళ్ళో పడేస్తానే ఏ మీటింగ్‌లో మాట్లాడుతావో చూస్తా! ఊరుకుంటుంటే మరీ రెచ్చిపోతున్నావే!" అంటూ వీరంగం సృష్టిస్తూ గెంతులు వేశాడు.

ఠానేదారు చేసిన వీరంగాన్ని కలెక్టరుకు విన్నవించుకుందామని బయలుదేరింది సీతాబాయి. కానీ ఠాణా ముందునుంచే జీబులు పోవాలి. తటపటాయిస్తూనే బయలుదేరింది. ఠాణా వచ్చింది. అందరిని చెకింగ్ చేస్తున్నారు. పోలీసులు వారి పక్కనే ఠాణేదారు నిలబడి అందర్నీ గమనిస్తున్నాడు. సీతాబాయి ఉన్న జీబు వంతు వచ్చింది. జీబులోంచి అందరిని దింపారు. చెకింగ్ మొదలైంది. సీతాబాయి వంతు వచ్చింది. ఒక అడుగు ముందుకు దూకాడు. ఠాణేదారు అసభ్య పదజాలంతో... 'ఏయ్ ఎక్కడికే!' చేయిపైకి ఎత్తాడు. అందరూ ఉన్నారని ఎత్తిన చేయిని దించేశాడు. పక్కనున్న కానిస్టేబుల్‌కు సైగ చేశాడు. వెంటనే పెన్ను, పేపర్ తీశాడు కానిస్టేబుల్. తెలిసిందే అయినప్పటికీ బెదిరింపులు.

'ఎక్కడికే?' ఠాణేదారు

'బంధుకులింటికి' సీతాబాయి.

'ఎక్కడ?' ఠాణేదారు

'ధినేలి' సీతాబాయి

పైనుంచి కింది వరకు ఎగాదిగా చూశాడు ఠాణేదారు. డ్రైవర్‌కు సైగ చేయడంతో జీబు ముందుకు కదిలింది.

సాయంత్రం 5 గంటలు కావస్తోంది. తిరుగు ప్రయాణంలో మళ్ళీ చెకింగ్ సీతాబాయి గుండెల్లో గుబులు పుట్టింది.

నేనెక్కడికి వెళ్ళింది తెలిస్తే కనుక వీడు వదలడు. మొన్ననే ఇంటికి వచ్చి అదరకొట్టాడు. ఉదయం కూడా నానా హంగామా చేశాడు. ఇప్పటికీ వాడి మాటలు చెవుల్లో తిరుగుతూనే ఉన్నాయి. ఏం చేయాలా? అని ఆలోచిస్తోంది సీతాబాయి.

ఆమె ఆలోచనల నుండి బయట పడకముందే అనుకున్నంత అయ్యింది. సీతాబాయి అరెస్ట్. 'ఠాణాకు వచ్చి నానాయాగి చేసిందని' కేసు పెట్టి జగదల్‌పూర్ జైలుకు పంపారు. ఒక్కరినే అరెస్ట్ చేస్తే పసరాదనుకున్నాడేమో... డొక్కే అనే మరిదిని కూడా అరెస్ట్ చేసి అతన్ని కాంకేర్ జైలుకు పంపారు.

ఈ విషయం చుట్టుపక్కల ఊర్లకు పాకింది సీతాబాయి అరెస్ట్ వార్త విన్న ప్రజలు ఠాణేదారు మీద మండిపడ్డారు. ఎలాగైనా సీతాబాయిని విడిపించుకోవాలని గట్టి పట్టుపట్టారు. గుంపుగా ప్రజలంతా బయలుదేరి ఠాణేదారున్ని నిలదీశారు. తాడోకి, అంతగఢ్, కాంకేర్‌లలో సీతాబాయి అక్రమ అరెస్ట్‌కు వ్యతిరేకంగా మీటింగులు పెట్టారు. ఆ మీటింగులకు వివిధ రకాల పార్టీలు ప్రజాసంఘాలు వచ్చాయి. సీతాబాయికి తమ మద్దతునిచ్చాయి. ఆ మీటింగుల్లో 'సీతాబాయి అక్రమ అరెస్ట్‌ను ఖండించండి. బేషరతుగా సీతాబాయిని, డొక్కేను విడుదల చేయాలి' అని నినదించారు. అక్కడి నుంచి రాష్ట్ర హైకోర్టుకు పోయింది వేలాది మంది ప్రజలు సీతాబాయికి మద్దతు పలకటంతో తప్పనిసరి పరిస్థితుల్లో హైకోర్టు సీతాబాయిని, డొక్కేను విడుదల చేయక తప్పలేదు. మద్దతు పలికిన ప్రజలు సంతోషం పట్టలేకపోయారు. సీతాబాయి అంతు చూస్తానన్న ఠాణేదారు సిగ్గుతో తల దించుకున్నాడు.

ఠాణేదారు అరెస్టు చేయడమేమిటి? హైకోర్టు విడుదల చేయడమేమిటి? ఇద్దరూ ఒకే తానులో గుడ్డముక్కలే కదా! ఇద్దరూ దోపిడీ వర్గాన్ని పెంచి పోషించే వాళ్ళే కదా! ఒక పక్క ప్రేమ కురిపించటం, మరోపక్క లాఠీ ఝుళిపించటం, ఈ వ్యవస్థ స్వభావమే కదా!

ఈ వ్యవస్థ మారితేనే ప్రజల బతుకుల్లో మార్పు వస్తోంది. ఆ మార్పుకు నా వంతు బాధ్యతగా పనిచేస్తాను. ఆ కర్తవ్యంలో పాలు పంచుకుంటాను. గట్టిగా నిశ్చయించుకుంది సీతాబాయి.

*(2010 అక్టోబరు 22న నిర్రా గ్రామస్తుడు సన్నావ్ కుమ్మెటిని పోలీసులు బూటకపు ఎన్‌కౌంటర్‌లో చంపి మడప అడవుల్లో పడేశారు. నిర్వాసిత సమస్యకు వ్యతిరేకంగా ప్రజలను ఐక్యం చేసిన సన్నావ్‌కు అంకితం)*



# అందరికీ తల్లి

● శృతి

"పంతులమ్మా" పరీక్ష పేపర్లు దిద్దుతున్న రమ తలెత్తి గుమ్మ వైపు చూసింది.

ఆమె కళ్ళల్లో చేస్తున్న పనికి ఆటంకం కల్గినందుకు విసుగూ అసహనమూ కన్పించింది.

ఎదురుగా గుమ్మం ముందు ఒక్కతే నిలబడి ఉంది.

రమ ఆమెను ఇంతకు ముందెప్పుడూ చూడలేదు.

లోపలికి రమ్మన్నట్లు చేయి ఊపుతూ "ఎవరమ్మా, ఏం గావాలే?" అని అడిగింది. రమ సందేహిస్తున్నట్లుగా మరో మెట్టు ఎక్కి, "నీకాడికి పేపరొస్తదట గదమ్మ" అంది.

"ఆ వొస్తది పాత పేపర్లు గావాల్నా" వచ్చిన పని తొందరగా తేల్చమన్నట్టుంది రమ ధోరణి.

"పేపర్ నేనేం జేస్కుంట పంతులమ్మ" కొన్ని క్షణాలు మాట ఆగింది.

"మరేం గావాలె?" అన్నట్లు చూసింది రమ.

"పేపర్ల ఏమన్న బడ్డదా పంతులమ్మ" ఆమె గొంతులో సన్నని వణుకు రమ గుర్తించలేదు.

'ఏమన్న బడ్డదా అంటే ఏదో ఒకటి పడతనే ఉంటది. నీకేం గావాలే' మెల్లగా నవ్వుతూ, అడిగింది రమ.

శక్తి లేనట్లు మెట్లమీద కూర్చొని గడపమీద చేయి వేసింది. వంగి 'అమ్మా ఎక్కన్నో పోలీసోల్లు నచ్చులేట్లను సానమందిని కాల్చేసింద్రని అనుకుంటుండ్రమ్మా. పేపర్లేసింద్రేమ్మా" ఆమె గొంతులో ఆందోళనను రమ గుర్తించింది.

ప్రశ్నార్థకంగా చూసింది రమ.

"ఆళ్ళ పేర్లు ఏసింద్రమ్మా?" అడిగిందామె.

"ఏసింద్రు" రమ మొహంలో ప్రశ్నార్థకం వీడలేదు.

"జెర గాపేర్లు జెప్తవమ్మా" ఆమె గొంతులో ఆందోళనతో కూడిన అర్థింపు.

"నీకేం పనమ్మ పేర్లతో" అంటూ పక్కనున్న పేపర్ చేతిలోకి తీసుకుంది రమ.

కొన్ని క్షణాలు తటపటాయించి మాటలను కూడదీసుకుంటూ చెప్పిందామె "నా కొడుకు... నా కొడుకు... అండ్ల గలిసిండమ్మా," దిగులు నిండిన గొంతుతో చెప్పిందామె. కొన్ని క్షణాలు ఏమీ అర్థం కాలేదు రమకు. అలాంటి మాటలు ఆ ప్రాంతంలో అంతకు ముందెన్నడూ వినలేదు. మెల్లగా విషయం అర్థమైంది. ఈ పేపర్లో ఈమె కొడుకు పేరు ఉన్నదేమో చూసి చెప్పాలి. ఈమె కొడుకు సచ్చిపోయిండో లేదో నేనిప్పుడు చెప్పాలి. ఈమె కడుపు కాలిందో లేదో ఇప్పుడీ వార్త తేలుస్తది అనుకుంది రమ.

ఉన్నట్లుండి పేపర్ బరువెక్కినట్టనిపించిదామెకు. ఆ బరువును మోయలేనట్టు ఆమె చేతులు వణకసాగాయి. పేపర్లో అక్షరాలన్ని అల్లుకు పోయినట్టుగా కనబడుతున్నాయామెకు. నాకే ఇట్లుంటే ఆ తల్లికెట్లుందో అనుకుంటూ రెండు క్షణాలు కళ్ళు మూసుకొని మనసు కుదటపరుచుకుంది. రమ అప్పటికే పేపర్లో చదివిన వార్త మొదటి పేజిలోనే వచ్చిన వార్తకేసీ దృష్టి సారించింది. "ఎన్‌కౌంటర్లో ఏడుగురు నక్సల్స్ హతం," పెద్ద పెద్ద అక్షరాలతో ఫొటోలతో కూడిన వార్త. వార్తంత వదిలేసి పేర్ల వైపు చూపుని పరిగెత్తించింది. రమ ఏడుగురి పేర్లను మళ్లీ మళ్లీ చదివింది. ఆమె కొడుకు పేరు తెలియదన్న విషయం అప్పుడు స్ఫురించి " ఏం పేరమ్మా నీ కొడుకు పేరు" అడిగింది రమ.

రమ గొంతు రమకే అపరిచితంగా అనిపించింది. ఆమె మొహంలోకి చూడలేకపోయింది.

"యాదయ్య... యాద్గిరి" తడబడుతూ చెప్పిందామె. ఆ పేరు లేదు. మనసులో అనుకుంది. ఏదో బరువు దిగినట్టు అనిపించింది.

"ఈళ్లందరు వేరే వాళ్లమ్మా" ఆమె వైపు చూస్తు చెప్పింది రమ.

ఆమె మొహంలో ఆందోళన తొలగిపోయింది. కాని మరుక్షణమే దిగులు కమ్ముకుంది. "ఎవ్వరైతే ఏందమ్మా. ఏ తల్లులో కన్న బిడ్డలో కదా, ఆ తల్లులు ఎంత కొట్టుకుంటుండ్రో. ఎంత తల్లడిల్లిపోతుండ్రో, కడుపు తీపి ఎవరికైనా ఒకటే గద పంతులమ్మా" ఆమె గొంతు జీరబోయింది. రమ కళ్లు చెమ్మగిల్లాయి, ఆమె చూడకుండా కళ్లు దించుకుంది రమ.

ఓ తల్లి బాధను మరో తల్లి అర్థం చేసుకుంటుందేమో అనుకుంది. ఆమె కళ్ల తుడుచుకుంటున్నప్పుడు ఆమె చూడకుండా రమ కళ్లు తుడుచుకుంది.

ఆమె అలాగే కూర్చుండి పోయింది.

ఇద్దరూ ఏమి మాట్లాడకుండా కాసేపు కూర్చుండిపోయారు.

రమ తేరుకొని, "ఏం పేరమ్మా నీ పేరు" అడిగింది.

"అడవి" అని చెప్పిందామె.

"అడివా?" ఆశ్చర్యంగా అడిగింది రమ.

"ఇదేం పేరు వింతగా ఉందే" అనుకుంది.

ఈమెను లోపలికి రమ్మంటే బయటనే కూర్చుందే అనుకొని తనే వెళ్లి తలుపుకు వీపు ఆనించి కూర్చుంది రమ.

ఆమె కొంచెం ఇబ్బందిగా కదల బోయింది.

"కూర్చోమ్మా ఫర్వాలేదు" అంది రమ.

"ఎక్కడ మీ ఇల్లు" మళ్లీ ప్రశ్నించింది.

చెప్పిందామె.

అప్పుడర్థమైంది రమకు. ఆమె ఇంట్లోకి రాకుండా బయటే ఎందుకుండి పోయిందో.

"పిల్లలెంతమందమ్మా."

"ఒక్కడేనమ్మా ఆడొక్కడే, పుట్టుకల్నే నలుగురు సచ్చిపోయిండ్రు. అయిదోవాడు ఆడొక్కడు మిగిలిండు. ఆడట్ల బోయిండు." మళ్లీ దిగులు కమ్ముకుందామె మొహంలో.

రమ పరీక్షగా చూసిందామెను. యాభై దాటిన వయసు. కాయకష్టం చేస్తుందనిపించే

శరీరం. అక్కడక్కడా తెల్లబడి నూనె లేక రేగిన జుట్టూ, వంటి మీద మాసిన ముతక బట్టలు, భర్త చనిపోయాడని చెప్పే చిహ్నాలు..



"నువ్వొక్కదానివే ఉంటవా ఇంట్ల" అడిగింది రమ.

"ఔ. ఇంకెవలున్నరు పంతులమ్మా నాకు."

"ఏం పని చేస్తవ్."

"కూలికి బోత."

"ఏం కూలికి బోతవ్."

"నాట్లు, కలుపులు అన్ని పనులకు బోత."

కాసేపు అదీ ఇదీ మాట్లాడేటప్పటికి అడవమ్మకు ధైర్యం వచ్చింది.

ఈ పంతులమ్మ సాన మంచిది అనుకుంది.

రమను అడవమ్మ అంత కుముందు రెండు మూడుసార్లు చూసింది. భుజానికి బ్యాగు తగిలించుకొని ఎవరివైపు చూడకుండా వీధిలో చకచకా నడిచి వెళ్తుంటే తిరిగి తిరిగి చూసింది.

"ఈ పంతులమ్మకు సాన గర్వం. ఎవరితోటి మాట్లాడదు" అని ఒకరిద్దరు అంటుండగా వింది. కాని ఈ రోజు పంతులమ్మ మంచిదనే అభిప్రాయానికి వచ్చింది.

మెల్లగా ధైర్యం తెచ్చుకుని రమకు సంబంధించిన వివరాలను అడిగింది అడవమ్మ.

అడిగిన వివరాలకు ఓపిగ్గా సమాధానం చెప్పింది రమ.

"పేపర్ల ఈ వార్తొచ్చిందని నీకెట్ల తెల్సు" మెల్లగా అడిగింది రమ.

"మా యాద్గిరితోని సిన్నప్పుడు సదువుకున్న పిలగాడున్నాడు. ఆ పిలగాని దగ్గర రేడియుంది, గా పిలగాడే నాకెపుడన్న గాడ గిట్ల జరిగింది.. గీడ గిట్ల జరిగింది అని జెప్పుతడు. ఇయ్యాల కూలికిపోయి వొస్తుంటే ఆ పిలగాడు గూడ గడ్డిమోపు ఎత్తుకొని ఊళ్ళకు రాబట్టిండు. ఆ మాట, ఈ మాట జెప్పి, మెల్లగా గీ మాట జెప్పిండు, గిట్లేదన్న ఇంటే నాకు భయమవుతుంది. నా కొడుకెట్లుండో అని పానం మెరమెర అనబట్టే. ఆ పిలగాడె జెప్పిండు. పేపర్లయితే పేర్లేస్తరని, ఈ ఊర్లె పేపర్ తెప్పించేటోళ్ళు ఎవ్వర్లేరు, పంతులమ్మకు పేపరొస్తదని జెప్పిండు. అందుకే గిట్లొచ్చిన".

అడవమ్మతో మాట్లాడుతున్నంత సేపూ యాదగిరి గురించి వివరాలడగాలని తహతహలాడింది రమ. కానీ మళ్లీ ఆమెను మరింత బాధపెట్టడమెందుకని మానుకుంది. ఇంకోసారి అడగొచ్చులే అనుకుంది.

వాళ్ల మాటల్లో గంటకు పైగా కాలం దొర్లిపోయింది.

"ఇంకబోత పంతులమ్మ సీకటైంది. కూలి నుండి సక్కగా ఇటే వచ్చిన. అయినా నా కోసం ఇంటికాడ సూసేటోళ్లు ఎవరుగని, ఎట్లాయిన గూటికి పోవాల్సిందే గదా" అని నిట్టూర్చి పైకి లేచింది అడవమ్మ.

"సరేనమ్మా. అప్పుడప్పుడు రా. నేను గూడ వొక్కదాన్నే గదా. నువ్వొస్తే నాగ్గూడ పొద్దుపోతుంది" అంది రమ.

ఉక్కిరిబిక్కిరయింది అడవమ్మ. ఆ ఆహ్వానం ఊహించనిది. చదువుకున్న తెల్లగా నాజుగ్గా, అందంగా ఉన్న పంతులమ్మ తననలా ఆహ్వానిస్తుందని ఆమె ఊహించలేదు.

"అట్లనే పంతులమ్మా"... ఇంకా ఏదో అనబోయింది, కానీ మాటలు రాలేదు. మెల్లగా అడుగులు వేస్తూ వెళ్లిపోయింది.

ఆమె వెళ్తున్నంత సేపూ ఆమె వైపు చూస్తూ ఉండిపోయింది రమ.

ఆ రాత్రి పడకమీద చేరిన రమకు ఎంతకూ నిద్ర రావటం లేదు. 'మానుతుంది' అని తను భ్రమపడుతున్న గాయం ఇంకా పచ్చిగానే ఉన్నట్లు అర్థమవుతుందామెకు. ఇన్నాళ్లు గుండెల్లో ఇంకించుకున్న బాధను కెలికి బయటకు లాగి ఎదురుగా పేర్చినట్లుగా ఉంది. జ్ఞాపకాల తుట్టే కదిలి ఆమెను ముసురుకొని ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి. ఒక్కప్పుడు హృదయాన్ని దూదిపింజగా చేసిన సంఘటనలు పిల్ల తెమ్మెరలా హాయిగొల్పిన అనుభవాలు ఇప్పుడు బాధిస్తున్నాయి. ఆ జ్ఞాపకాలను వదిలేస్తే వేగంగా రూపం పోసుకుంటాయి. అది 'వేణూది'... ఆ జ్ఞాపకాలను చెల్లాచెదురు చెయ్యాలనుకుంటుంది. తరచూ ఓడిపోతుంది. ఆ రోజు ఓడిపోయింది. ఫలితంగా వేణూ రూపం కళ్లముందు తిష్ట వేసింది. ఆ రూపాన్ని చూడొద్దు అన్నట్లుగా కళ్లు మూసుకుంది. మరుక్షణం కనురెప్పల వెనుక ప్రత్యక్షం, వేణూని చూడకపోయినా అనుక్షణం మర్చిపోవాలనుకుంటూ గుర్తు తెచ్చుకుంటూనే ఉందామె, నిజానికి వేణూని మర్చిపోవడం అంత సులువు కాదామెకు. అంతగా ప్రేమించింది.

"నువ్వే నా సర్వస్వం నువ్వు తప్ప నాకు లోకం లేదంటే" గర్వపడింది. వేణూతో జీవితాన్ని పంచుకోవడానికి ఆత్రుత పడింది. కానీ అతను "ప్రపంచమంటే నాకు నువ్వు నీకు నేనూ మాత్రమే కాదు. ఈ ప్రపంచం విశాలమైంది. ఇందులో కష్టాలున్నాయి, కన్నీళ్లున్నాయి. ఇద్దరం కల్సి తెల్సుకుందాం" రమ్మన్నాడు.

కానీ అప్పటికే బిజినెస్‌లో రమ తండ్రి నష్టపోయాడు.

కుటుంబంలోని కష్టాలను కన్నీళ్లను తుడిచెయ్యటానికి ఆమె ఉద్యోగం వెతుక్కునే ప్రయత్నంలో ఉంది. ఇంటికి పెద్ద కూతురిగా అది తన బాధ్యతనుకుంది. "నీ బాధలను ప్రపంచపు బాధల్లోంచి చూడమన్నాడు," వేణు.

"నా బాధలు తీరిన తర్వాతే పట్టించుకుంటా" అంది రమ. రమ ఇద్దరి దారులు వేరయ్యాయి. విశాల ప్రపంచంలోకి సాగిపోతున్న వేణూని తప్పుపట్టలేకపోయింది. రమ కన్నీటితో వీడ్కోలు చెప్పింది. కుటుంబం కోసం తన ప్రపంచాన్ని కుదించుకొని ఈ పల్లెటూరికి ఆరు నెల్ల క్రితం టీచర్‌గా వచ్చింది. మనసులో రగులుతున్న అశాంతితో రోజులు గడుపుతూ, నెల నెల ఇంటికి డబ్బులు పంపిస్తోంది.

"ఛ! ఎన్ని రోజులు వేణునిట్ల తల్చుకోవడం, మరిచిపోవాలే" అట్ల అనుకుంటే మరింత బాధేసింది. కనుకొలుకుల నుండి కన్నీళ్లు జారాయి.

ఎప్పటికో మగతగా నిద్రలోకి జారిపోయింది.

"ఏం జేస్తున్నవ్ పంతులమ్మా."

అడవమ్మ గొంతును వెంటనే పోల్చుకొని వంట గదిలో నుంచి ముందు గదిలోకి వస్తూ "రామ్మా లోపలికి రా" అంది నవ్వుతూ.

తటపటాయిస్తూ బయటే నిలబడిన అడవమ్మతో గట్టిగా "రా లోపలికి పర్వాలేదు" అంది.

గుమ్మంలోంచి లోపలికి వచ్చి గుమ్మం దగ్గరే బెరుగ్గా ఆగిపోయింది అడవమ్మ.

"పొయ్యిమీద పాలు పెట్టిన" అంటూ లోపలికి పరిగెత్తింది రమ.

పాలు దించి టీ పెడుతూ "రామ్మా ఈడికి" అని పిలిచింది.

ఆశ్చర్యపోతూ అక్కడే నిలబడింది అడవమ్మ.

"చెప్తుంటే నీక్కాదూ. రా నాకేం పట్టింపులు లేవు" అని కసిరినట్టుగా పిలిచింది రమ.

అడుగులో అడుగేస్తూ మెల్లగా వంటింట్లో అడుగుపెట్టింది అడవమ్మ.

రమ స్టౌ ముందు నిలబడి టీ చేయడంలో నిమగ్నమైంది.

పొంగుతున్న 'టీ' దించి రెండు గ్లాసుల్లో పోసి రెండు చేతుల్లో పట్టుకుని "రామ్మా ముందట కూచుందాం," అంటూ ముందు రూంలోకి దారి తీసింది రమ.

"చాపలో తనూ కూర్చుంటూ కూచ్చోమ్మా" అంది.

కింద కూర్చోబోతున్న అడవమ్మను చూసి "అరె చాపలో కూర్చో" అంది.

"ఎందుకు తియ్ పంతులమ్మ ఈడ కూసుంట" అంటు కింద కూలబడింది.

"చెప్తే వినవు గద" అంటూ ఆమె ముందు టీ గ్లాసు పెట్టి "తాగు" అంది.

బెదిరినట్లుగా చూసింది, "నాకెందుకు పంతులమ్మ" అంది కంగారుగా.

"ఎందుకేంది. తాగేటందుకు" విషం కాదు గద తాగు.

"నాకెందుకు పంతులమ్మ నువ్వు తాగు" అంది అడవమ్మ అమాయకంగా.

ఇదేమన్నా మంచి నీళ్లా రెండు గ్లాసులు తాగేటందుకు. చాయ్ ఒక్క గ్లాసు తాగితే సరిపోతుంది. ఏం కాదులే తీసుకొని తాగు" అంది అనునయంగా.

ఇక తప్పనిసరై తాగడానికి సిద్ధపడింది అడవమ్మ.

టీ తాగుతూ మాటల్లోకి దిగింది రమ. "కూలికి పోయొచ్చినవా ఇయ్యాల" అడిగింది.

"పోయొచ్చిన పంతులమ్మ. నాకు పోకుంటే తెల్లార్తదా. ఇంట్ల ఉల్లిగడ్డల్లేవు, మిర్చకాయల్లేవు, ఏదో ఒక్కదానికైన ఇంత ఉడకేసుకోవాలే గద. దుకాన్లకుపోయి ఉల్లిగడ్డలు, మిర్చకాయలు తీసుకొస్తున్న. తోవల్నే నిన్ను మందలించి పోదమని ఇటొచ్చిన" అంది.

అడవమ్మ కొంగులో కట్టుకున్న మూట వైపు చూసింది రమ.

అదీ ఇదీ మాట్లాడి మెల్లగా యాదగిరి ప్రస్తావన తెచ్చింది.

"నీ కొడుకు అండ్లకు పోయి ఎన్ని రోజులయిందమ్మా."

"దగ్గర దగ్గర ఎనిమిదేళ్లు అయింది పంతులమ్మ."

"ఎట్ల బోయిండు ఈ ఊళ్లె ఇంకెవరన్నా పోయింర్రా."

"ఎవరు పోలే పంతులమ్మా. ఈ ఊళ్లెవరకి గట్లాంటియి తెల్వది."

"మరి నీ కొడుకెట్ల బోయిండు."

అంత రాత పంతులమ్మ పిలగాడుగున్నప్పుడు వాళ్ళ నాయిన సచ్చిపోయిండు. ఇగెవలున్నరు నాకు ఈడొక్కడే గద, కండ్లల్ల బెట్టుకుని సాదుకున్న. సదువుకుంటే బాగుపడ్తడని బడికి తోలిచ్చిన. ఈ ఊర్లెనే అయిదు దాక సదివిండు. సాన తెలివికల్లోడు. అమ్మా ఇంకా సదువుకుంట అన్నడు. వాళ్లు వీళ్లు గూడ మీదాంట్ల తొందరగ నౌకర్లొస్తయ్ సదివియ్యరాదు అన్నరు. వాడు సదువుకని నౌకరు చేస్తే నాకింకేం గావాలే అనుకున్న. ఈ పక్కూళ్ల పద్దాక సదివిండు. ఆండ్ల మంచిగొచ్చిండట. పట్నంల సదువుకుంటనన్నడు. సర్కారు పైసలిస్తదన్నడు. నేను సరేనన్న. మరేమిచ్చిందో సర్కారు. నేను కూలినాలి చేసిన పైసలు పంపించేదాన్ని. వాడు ఎక్కువ కర్సుజేసే మనిషి కాదు. పట్నంల నాలుగేండ్లు సదివిండు గప్పుడే ఎవల సోపతి బట్టిండో గియ్యన్ని నేర్సుకున్నడు" మాటలాపింది అడవమ్మ.

"నీకు ముందుగాల్నె తెల్సా అట్ల పోతడని?"

"ఆ" అడె జెప్పిండు. పండగ పండగకు ఇంటికొచ్చేటోడు. ఓ యేడాది అస్సలింటికే రాలేదు. నేను కారటు మీద కారటు రాయిస్తే వచ్చిండు.. అప్పటికే సదువు బందు బెట్టిండంట, ఇంక మీదట నేను ఇంటికి రాను, అని జెప్పిండు.

అదేందిరా అంటే ఏందేందో జెప్పిండు.

నన్ను దిక్కులేని దాన్ని జేసి పోతవ కొడుకా అంటే నీలెక్క ఇంక సానమందున్నరు ఆళ్లందరి కోసం కొట్లాడాలన్నాడు.

ఏడ్సిన. బతిమిలాడినా అయినా వానిపట్టు వాడె పట్టిండు. ఎట్లయినా పోకుండా ఆపాలనుకున్న, ఆ రోజు కూలిగ్గూడ పోలేదు.

వాగుల బట్టలుతుక్కొని తానం జేసివస్తానని పోయిండు. అంతే మల్లి రాలే అటే బోయిండు" కళ్లు తుడుచుకుంది అడవమ్మ.

దుఃఖంతో మాటరాక ఆగిపోయింది.

రమ గోడ కానుకొని అడవమ్మనే చూస్తూ ఉండిపోయింది.

ఆ తల్లి కన్నీటితో రమ హృదయం కరిగిపోయింది.

మళ్లీ అడవమ్మ అందుకుంది. "సక్కదనాల కొడుకమ్మా ఆడు, మా ఆడకట్టంత గూడ మురిసిపోదురు అన్ని జూసి. మగ దిక్కు లేకున్న గాని నా కొడుకు బుద్ధిమంతుడే అయ్యిండు. ఎన్నడు నన్ను బాధపెట్టినోడు కాదు. ఒక్కసారే ఇంత పెద్ద బాధ పెట్టిండు." గొంతులో జీరవస్తుంటే ఆగిపోయింది. ముక్కును కొంగుకు తుడుచుకుంది.

రమకేం మాట్లాడాలో అర్థం కాలేదు. ఓదార్చాలని కూడా తోచలేదు.

అడవమ్మ దుఃఖాన్ని వెళ్లగక్కుకుంది.

రమ దుఃఖాన్ని దిగమింగుతుంది.

మళ్లీ అడవమ్మే మాట్లాడింది, "ఏం బతుకు పంతులమ్మా నాది గుడ్డి బతుకైపోయే. కడుపుకింత తింటున్న. ఇప్పుడు రెక్కలున్నయ్ కష్టం జేసుకుంటున్న. ఆ తరువాత నా రాతెట్లుందో భగవంతునికెరుక."

కాసేపటికి తేరుకొని "సీకటైంది పంతులమ్మా. లేసి లైటేసుకో ఇగనేనుబోత" అంటూ పైకి లేచింది అడవమ్మ.

స్పృహలోకి వచ్చింది రమ. "సరేనమ్మ" అంది గదిలో మసక చీకటి ఉండడం వల్ల. రమ మొహంలోని భావాలను అడవమ్మ చదవలేకపోయింది.

మెల్లగా అడుగులు వేస్తూ వెళ్లిపోయింది అడవమ్మ.

రమ లేచి తలుపులు వేసుకొని లైటు వేసుకోకుండా చాపమీద వాలిపోయింది.

అడవమ్మ మాట్లాడుతుంటే నా బాధను నాతో నేను చెప్పుకున్నట్లుందే అనుకుంది.

అడవమ్మ నేను ఒకటేనా, యాదగిరి వేణూ ఒకటేనా?

యాదగిరి లేని అడవమ్మ జీవితం చీకటే గద.

వేణూ లేని నా జీవితం గూడ అంతే గద.

కాని పాపం అడవమ్మ ఒక్కగానొక్క కొడుకు. తన కడుపు తీపిని ఎలా మర్చిపోతుంది. గుండె దిటవు చేసుకొని బతికినా రేపు ఆమె ముసలిదైతే తనకు దిక్కెవరు.

ఇలా రకరకాలుగా ఆలోచిస్తూ ఎప్పటికో నిద్రపోయింది రమ.

రోజులు గడుస్తున్నకొద్దీ అడవమ్మ రమ ఒకరికొకరు చాలా దగ్గరయ్యారు.

అడవమ్మ దాదాపు ప్రతిరోజూ రమ దగ్గరకు వస్తోంది. వాళ్ళప్పుడు సంతోషంగా నవ్వుకునే సందర్భాలేన్నో.. బడి కబుర్లు వాళ్ల ఇంటి కబుర్లు పేపర్లో చదివిన విషయాలు చెబుతుంది రమ. తను కూలికి పోయేచోట జరిగే విశేషాలు ఇరుగు పొరుగు ముచ్చట్లు, ఆ ఊరి మనుషుల గురించి, ఆ ఊరి గత చరిత్ర గురించి చెప్తుంది అడవమ్మ. ఇప్పుడు అడవమ్మ ఆ ఇంట్లో స్వేచ్ఛగా తిరుగుతుంది. వేణూని తలుచుకొని మునుపటిలా

**'అయ్యో అడవమ్మ నీకెట్ల చెప్పనీ వార్త, నీ కొడుకింక లేడని ఎలా చెప్పను? ఈ వార్త వింటే ఆ కన్న తల్లి గుండె తట్టుకుంటుందా. ఆమె గుండె కోత చూసి నేనెట్ల తట్టుకోను. అడవమ్మ వచ్చే టైమయింది. బురదలో బురదై మట్టిలో మట్టై అలసినా మెరిసే కళ్లతోటి ఈ పంతులమ్మా దగ్గరికొస్తుంది, ఏమని చెప్పను. నీ కంటి దీపం ఆరిపోయిందని చెప్పనా?'**

బాధపడట్లేదు రమ. యాదగిరి గురించి ఏడవకుండా మామూలుగానే చెప్తుంది అడవమ్మ.

"ఏడేండ్ల నుంచి నీ కొడుకును సూడనే లేదామ్మ" అడిగిందో రోజు రమ.

మెల్లగ గొంతు తగ్గించి "రెండుసార్లు కల్సిండమ్మా, ఎవరికి సెప్పొద్దన్నడు. ఎవరికి జెప్పలే ఇప్పుడు నీకు జెప్తున్న" అంది. ఆమె కళ్లల్లో నువ్వెవరికి జెప్పవులే అన్న ధీమా కనబడింది రమకు.

"ఎప్పుడు కల్సిండు."

"కల్సి రెండేడ్లయింది. మల్ల కలుస్తనన్నడు ఎప్పుడు కలుస్తడో" అంది.

"కల్సినప్పుడు ఏం మాట్లాడ్తడు."

"ఏందేందో జెప్తడమ్మా, బాధలు లేని రాజ్జెమొస్తదంటడు. ఆడు జెప్పేవన్నీ బాగానే ఉంటయమ్మా. నా కొడుకేం జేసిన మంచే జేస్తాడు. కానీ ఈ జనం ఏదేదో అనుకుంటరు".

"ఈ ఊళ్లె ఆ వాసనలే లేవెందుకో."

"మా యదయ్యన్నడు. అన్ని ఊర్లల్లకు వొస్తం. మన ఊరికి గూడ వొస్తం అన్నడు. ఎప్పుడొస్తరో మరి" ఆమె గొంతులో వస్తే బాగుండునన్న ధ్వని.

"పోలీసులొచ్చి అడగలేదమ్మా నిన్ను."

"ఆ వచ్చింద్రమ్మా, రెండు సార్లొచ్చింద్రు, నీ కొడుకేడని అడిగింద్రు. నాకు తెల్వదన్న. ఇంటికొస్తె పట్టియ్యమని బెదిరిచ్చిపోయింద్రు. మూడేండ్లు దాటిపోయింది. ఆళ్లొచ్చిపోయి మల్లరాలే"

ఆ రోజు స్కూల్ ఆఖరి పీరియడ్ పిల్లల్ని ఆటకు వదిలి రూంలోనే పుస్తకం చదువుకుంటుంది రమ.

ఇంతలోనే పోస్టుమాన్ వచ్చి రోజూ ఇచ్చే వార్తపత్రికతో పాటు ఓ ఉత్తరమూ ఇచ్చి వెళ్లాడు. ఇంటి నుండి తప్ప ఇంకెక్కడి నుండి ఉత్తరాలు రావామెకు. పేపర్ టేబుల్ మీద పెట్టి ముందు లెటర్ చదవాలనే ఉద్దేశంతో కవర్ చించబోతూ అడ్రస్ చూసింది. కవర్ మీదున్న చేతిరాతను చూసి చూచి గుండె దడదడలాడింది. కవర్ పట్టుకున్న చేయి సన్నగా వణకసాగింది. కవర్ చింపబోయి వేళ్లు ఆగిపోయాయి. అది వేణు చేతిరాత అనుకుందే తడవుగా బ్యాగులో లెటర్ పేపర్ పెట్టుకొని కుర్చీలోంచి గభాలున లేచి బ్యాగ్ భుజాన వేసుకొని హెడ్ మాస్టర్ రూంవైపు తడబడుతూ అడుగులు వేసింది.

"సర్ పనుంది ఇంటికి పోత"' అని అడిగింది.

ఎన్నడూ పర్మిషన్ అడగని రమ అడిగేసరికి "సరే పోమ్మా" అన్నారాయన.

థాంక్స్ చెప్పాలనే విషయం కూడా మరచిపోయి గబుక్కున వెనక్కి తిరిగి ఇంటివైపు వడివడిగా అడుగులు వేసింది.

ఆమెను ఆలోచనలు తరుముతున్నాయి.

ఇన్నాళ్లకి లెటర్ రాసిండే. నేను గుర్తున్నానా, నన్ను మర్చిపోలేదా. అయినా అంత తొందరగా మర్చిపోయే అనుబంధమా మాది. ఏమని రాసిండో. ఎట్లున్నాడో, నా అడ్రస్ తనకెట్ల తెలిసిందో. అయినా తను తెలుసుకోవాలంటే పెద్ద కష్టమేం కాదు కదా. ఆలోచనలతోనే తాళం తీసి ఇంట్లోకడుగుబెట్టి తలుపులు వేసుకొని గోడకు చేరగిలబడి ఉత్తరం చేతిలోకి తీసుకుంది. కవర్ చింపుతుంటే ఉద్వేగంతో ఉక్కిరిబిక్కిరయింది. గతంలో వేణు ఎన్ని ఉత్తరాలు రాసాడో లెక్కలేదు, కానీ, ఎన్నడూ ఇలాంటి అవస్థకు గురికాలేదామె.

కవర్ చించి మడతపెట్టి ఉన్న కాగితాన్ని బయటకు లాగి విప్పింది. కాగితాల నిండా పరుచుక్ను అక్షరాలు. ఆమె ఎంతో ఇష్టపడే అక్షరాలు ఎన్నోసార్లు ఆమెను ప్రేమతో తడిపేసిన అక్షరాలు. కొన్ని క్షణాలు ఆ అక్షరాలను తదేకంగా చూసి మెల్లగా చదవడం మొదలెట్టింది.

చెలిమలవుతున్న కళ్లను ఎన్నిసార్లు తుడుచుకుందో. ఉత్తరాన్ని నాలుగైదుసార్లు చదువుకొని చేతిలో పట్టుకొని అలాగే కూర్చుండిపోయింది. తన గురించి, తను నడుస్తున్న బాట గురించి ఎన్నో విషయాలందులో రాసాడు.

వేణు ఏమైనా మారిండా. వేణు మారిండు. విప్లవకారుడిగా మరింత పరిణతి చెందిండు. తనను తాను ప్రజలతో మరింత మమేకం చేసుకునిండు.

తన ప్రేమ హస్తాన్ని నా కోసం సాచే ఉంచిండు. కానీ ఆ చేయిని నేనందుకోగలనా; లేదు. నేనందుకోలేదు. ఆ చేయి నేనందుకోలేనంత దూరంలో ఉంది. అందుకోలేనంత ఎత్తులో ఉంది. తన చేయిని మరింత ముడుచుకుంది రమ. కానీ అతని కోసం తెరిచిన హృదయాన్ని మూసుకోలేకపోయింది.

ఎంతసేపు అలా ఆలోచనల్లో ఉండిపోయిందో, తలుపు చప్పుడవడంతో ఉలికిపడి వెళ్లి తలుపు లేసింది. ఉత్తరం ఆమె చేతిలోనే ఉంది.

తలుపు తీసే ముందర కళ్లు తుడుచుకోవాలనిగానీ, ఉత్తరం దాచుకోవాలని గానీ తోచలేదామెకు. ఎదురుగా రోజు వచ్చే అడవమ్మ.

"అయ్యో ఏందమ్మా గట్లున్నవ్ ఏమయింది" అడవమ్మ మొహంలో ఆందోళన.

"ఏం లేదు. తలకాయ నొప్పి బడి నుండి గూడ తొందరగానే వచ్చిన."

రమ ఆడిన అబద్ధం అతికినట్టుగా లేకపోయిన, అబద్ధం ఆడాల్సిన అవసరం రమకుంటుందని ఊహించని అడవమ్మ నమ్మేసింది.

"అయ్యో ఎట్ల మరి వెంకటయ్య నడిగి ఏమన్న మందుగోలి తేనా..."

"ఆహ ఒద్దు. ఇప్పుడే ఏసుకున్నగని. కొంచెం చాయ్ పెట్టిస్తావా."

"సరే"నంటూ వంటగది వైపు వడివడిగా అడుగులేసింది అడవమ్మా.

అడవమ్మా రెండు టీ గ్లాసులతో ముందు గదిలోకి వచ్చేలోగా రమ బట్టలు మార్చుకొని ఇంటి వెనక్కి వెళ్ళి చన్నీటితో మొహం కడుక్కొని శుభ్రంగా తుడుచుకొని, రేగిన జుట్టును నున్నగా దువ్వుకుంది. టీ గ్లాసు చేతికందిస్తున్న అడవమ్మ వైపు ప్రేమగా చూస్తూ నవ్వింది రమ.

"ఇప్పుడు సూడబుద్దయితుంది. నీ మొహం, ఎట్లున్నవ్ తలుపు తీసేసరికి".

"జెర తక్కువైంది నొప్పి. నీ చేతి చాయ్ తాగితే మొత్తం తగ్గుతుంది." హాయిగా నవ్వుతూ అంది రమ.

"ఏం తగ్గుతదో నా చేతి చాయకు. నువ్వెంత నేర్పినగాని నీలెక్క చేయొస్తదా".

"ఎందుకు రాదు నాకంటే నువ్వే బాగా జేస్తవ్" అంది రమ.

మెల్లగా మాటల్లో పడ్డారిద్దరూ కావాలనే. యాదగిరి ప్రస్తావన తీసుకువచ్చింది రమ.

"నీ కొడుకు చాలా గొప్పోడమ్మా. అట్లాంటి కొడుకును గన్నందుకు

నువ్వు గర్వపడాలే" అంది రమ.

అడవమ్మ తబ్బిబ్బయిపోయింది.

యాదగిరి గురించే చాలాసేపు మాట్లాడింది, మాట్లాడించింది. రమ తన మాటలతో అడవమ్మను యాదగిరి దగ్గరకి తీసుకెళ్లింది.

అడవమ్మను యాదగిరి దగ్గరికి తీసుకెళ్లిందో. తనే వేణూ దగ్గరకు వెళ్లిందో. యాదగిరి గురించి ప్రశంసంతా యాదగిరి కోసమో, వేణు కోసమో ఇద్దరి కోసమో. వేణూ ప్రస్తావన అడవమ్మ దగ్గర తేలేక యాదగిరి ప్రస్తావన తెచ్చిందేమో.

యాదగిరి కబుర్లు అడవమ్మ చెప్తుంటే రమ చెవులకి వేణూ కబుర్లలాగా వినిపించాయి. ఇద్దరి గుండెలు సంతోషంతో నిండిపోయాయి.

* * *

రమకు మనసు మొద్దుబారినట్టయింది, గుండెల్లో దుఃఖం గడ్డ కట్టుకుపోయింది.

ఈ గదిలోంచి ఆ గదిలోకి, ఆ గదిలోంచి ఈ గదిలోకి తిరుగుతూనే ఉంది.

'ఎట్ల ఎట్ల ఎదుర్కోవాలే ఈ పరిస్థితిని' ఎన్ని సార్లనుకుందో.

'ఇంకాసేపయితే అడవమ్మ వస్తుంది. ఏం చెప్పాలె ఆమెకు ఎట్ల జెప్పాలె' ఇట్లా అనుకోవడం గూడ ఎన్నోసారో.

చాపమీద ఉన్న పేపర్ తీసి మరోసారి చదివింది. ఆ వార్త అబద్ధమైతే బావుండునని మళ్లీ మళ్లీ అనుకుంది. మరోసారి నిజమై తాకిందా వార్త.

పేరు, ఇంటిపేరు, ఊరిపేరు, వయసు అన్నీ సరిగ్గా సరిపోయినాయి. అబద్ధం కాదీ వార్త.

'అయ్యో అడవమ్మ నీకెట్ల చెప్పనీ వార్త, నీ కొడుకింక లేడని ఎలా చెప్పను? ఈ వార్త వింటే ఆ కన్న తల్లి గుండె తట్టుకుంటుందా. ఆమె గుండె కోత చూసి నేనెట్ల తట్టుకోను. అడవమ్మ వచ్చే టైమయింది. బురదలో బురదై మట్టిలో మట్టై అలసినా మెరిసే కళ్లతోటి ఈ పంతులమ్మా దగ్గరికొస్తుంది, ఏమని చెప్పను. నీ కంటి దీపం ఆరిపోయిందని చెప్పనా?'

ఆలోచనలతో ఉక్కిరిబిక్కిరవుతుంది రమ. చిరు అలికిడికి కూడా బెదిరిపోయి గుమ్మం వైపు చూస్తుంది.

రోజూ అడవమ్మ వచ్చే వేళ దాటిపోయింది కాని అడవమ్మ రాలేదు. అడవమ్మ వచ్చి తిరిగెళ్ళే వేళ కూడ దాటిపోయింది. కాని అడవమ్మ రాలేదు. దిక్కు తోచడం లేదు రమకు. లైటు వేసి గడప మీద కూర్చుంది. ఏమయి ఉంటుంది? ఎవరన్న చెప్పుంటరా ఈ వార్త. ఎవరు జెప్పుంటరు. ఇంకెవరికి పేపర్ రాదే మరెట్ల తెలుస్తది.

తన కడుపు కాలిన సంగతి తెల్వడానికి పేపర్ వార్త కావాల్నా. ఆ కొడుకు ప్రాణాలు వదిలే ముందు 'అమ్మా' అని వేసిన కేకలు తల్లి గుండెల్ని తాకుతాయేమో. ఆ కొడుకు చిందించిన రక్తం తల్లి ఒడిని తడుపుతుందేమో. ఎట్లుందో ఇంటికి పోయి చూస్తే, నాకు ఇల్లు తెల్వదే. ఏం చూసేటందుకు పోవాలే. గుండెల నిండా నిలువెత్తు శోకాన్ని చూసేటందుకా...

'పంతులమ్మా..' అనే పిలుపుతో ఆలోచనల దారం పుటుక్కున తేగిపోయింది. ఎదురుగా కొండమ్మ ఏదో పనిమీద అలా వెళ్తూ పలకరించినట్టుంది.

"అడవికి రాతిరి నుంచి జెరం పంతులమ్మ."

"అరె అట్లానా. డాక్టరుకు సూయించలేదా."

"ఆయన కాడికి పోతే ఆయన రాలే... తర్వాతొస్తాపో అన్నడు. రెండు గోలీలిచ్చిండు అవ్వేసిన గని తక్కువ కాలె" అంది కొండమ్మ.

పైసలు చేతిల బెడ్తేనే వొస్తడు. పద్దినాల్నుంచి అడవికి కూలియ్యలే నేనన్న ఇద్దమంటే నాగ్గూడ కూలియ్యలే. నేనిప్పుడు కూలి పైసలు అడుక్కొద్దామని పోతున్న"

"సరే నువ్వు పో అంది" రమ.

రమ లేచి చెప్పులు తొడుక్కుని ఇంటికి తాళం వేసి చకచక అడుగులు వేసింది. మూడో నిముషంలో ఊరి చివర ఉన్న ఇండ్ల వద్దకు చేరుకుంది. వీధి మొదట్లోనే ఉన్న ఇండ్ల దగ్గర సందేహంగా నిలబడింది. అక్కడ నలుగురైదుగురు ఆడవాళ్లు కూర్చొని ఉన్నారు. వాళ్లవైపు రెండడుగులు వేసేటప్పటికి వాళ్లలో ఒకామె "ఏంది పంతులమ్మ గిట్లొచ్చినవ్" అంది ఆశ్చర్యంగా, కూర్చున్నవాళ్లు చటుక్కున లేచి నిలబడ్డారు.

"అడవమ్మ ఇల్లెక్కడమ్మా" అడిగింది రమ.

"అడవిల్లా, నేను జూపిస్తరా పంతులమ్మా" అంటూ ఓ ముసలమ్మ దారి తీసింది. ఆమె వెనుకే రమ నడవసాగింది. రమ వెనుక అక్కడ నిలబడి ఉన్న వాళ్లలో మరొకామె నడవసాగింది.

రమ అడవమ్మల స్నేహం దాదాపు వాళ్లందరికి తెలుసు.

ముసలమ్మ వెనకాలే అడవమ్మ ఇంట్లోకి అడుగుపెట్టింది రమ. ఆమె వెనకాలే ఒక చిన్న గుంపు తయారైంది. కొందరు బయటే ఆగిపోతే కొందరు లోపలికొచ్చారు. రెండు గదుల చిన్న మట్టి ఇల్లది. పైన తాటాకుల కప్పు. ముందు గదిల నులక మంచంలో అడవమ్మ.

అడవమ్మ మంచం దగ్గరకు వెళ్లి వంగి నుదుటి మీద చేయి వేసింది రమ. చురుక్కుమని తగిలింది చేయి వెనక్కి తీసుకుంది.

ఆ స్పర్శకు అడవమ్మ మెల్లగా కదిలిందే కాని కళ్లు తెరవలేదు.

వెనక్కి తిరిగి అక్కడున్న వాళ్లవైపు చూస్తూ, "ఎవరన్నా డాక్టరును పిలుచుకొస్తారా" అనడిగింది రమ. "ఆయన రాడు పంతులమ్మా" నిస్పృహగా అనిందొకామె.

"నేను రమ్మన్నానని చెప్పండి వస్తడు" అంది రమ.

"రావే మనం పోదాం" ఓ ఇద్దరు వెళ్లారు.

చేతిలో మందుల సంచితో పది నిముషాల్లో డాక్టర్ అక్కడున్నాడు.

పంతులమ్మ అడవమ్మింట్లో ఉందని చెప్తే ఏమీ అర్థం కాలేదు. అయోమయంగా వచ్చాడు.

డాక్టర్ వైపు చూస్తూ "రాత్రి నుంచి బాగా జ్వరమట. మీరిచ్చిన మందులతో తగ్గలేదు. మంచి మందులివ్వండి" చెప్పింది రమ.

అడవమ్మకు జ్వరమొస్తే రమ శ్రద్ధగా పట్టించుకోవడం ఆశ్చర్యంగా ఉందాయనకు. ఆశ్చర్యంతోనే ఇంజక్షన్ వేసి కొన్ని మాత్రలు ఇచ్చి రమకు వివరాలు చెప్పిండు.

"రేపు డబ్బులు పంపిస్తానండి" చెప్పింది రమ.

సరేనన్నట్టుగా తలూపుతూ మరింత ఆశ్చర్యంగా వెళ్లిపోయాడా డాక్టర్.

డాక్టర్ వెళ్లిపోయాక అక్కడి వాళ్లవైపు చూస్తూ, "మంచి నీళ్లున్నాయమ్మా" అని అడిగింది.

"ఆ ఉన్నయ్ పంతులమ్మా పొద్దుగల తెచ్చిన" అందొకామె.

సరే గోలీలు వేయడానికి అవసరమైతయని అడిగిన. ఓ గంట తరువాత వేయమన్నడు. అందరూ రమకేసి ఆశ్చర్యంగా చూస్తున్నారు. ఆమె వచ్చినప్పటి నుంచి నిలబడే ఉంది. అప్పుడప్పుడు వంగి అడవమ్మను తాకి చూస్తోంది. అట్లా తాకి చూడడాన్ని వాళ్లొక అపురూప దృశ్యంలా చూస్తున్నారు.

"పంతులమ్మా సాన రాత్రయింది, ఇంటికి పోరాదు" అంది కొండమ్మ. ఆలోచనల నుండి బయట పడ్తూ "లేదమ్మా నేనిక్కడే ఉంటా" అంది రమ.

"అయ్యో పంతులమ్మా నువ్వెట్ల ఉంటవు ఈడ" మరొకామె అంది.

"ఎందుకుండలేను" చిరునవ్వుతో అంది రమ.

"నువ్వు పో పంతులమ్మా. నేను జూస్కుంట తియ్" అంది కొండమ్మ.

"నేను పోను గంట గంటకు గోలీలెయ్యాలే, నేనైతే టైం జూస్కుంట ఏస్త" ఆ మాటకు వాళ్లేం మాట్లాడలేదు.

"అన్నం తిన్నవో లేదో."

"తినే వచ్చిన" అన్నం తినే కోరిక లేనందువల్ల అబద్ధమాడింది.

"పొద్దుపోయింది ఇగ మీరు ఇండ్లకు పోండమ్మా" అంది రమ.

వెంటనే ఎవరు కదలలేకపోయారు, "పోండమ్మా! మీరు బోతే జర గాలి తలుగుతుంది" మళ్లీ రెట్టించే సరికి ఒక్కొక్కరు మెల్లగ కదిలారు, కొండమ్మ మాత్రం "నేనిక్కడ పడుకుంట పంతులమ్మా" అంది.

"నీ ఇష్టం" అంది రమ.

ఇంట్ల జెప్పి బొంత తీస్కోని వొస్త అంటూ వెళ్లిపోయింది కొండమ్మ. ఆమె వచ్చేసరికి మూలనున్న చినిగిన చాపను మంచం పక్కనే వేసుకొని మంచం కోడుకు వీపు పెట్టి కూర్చోనుంది రమ. ఓ అరగంట ఇద్దరూ అదీ ఇదీ మాట్లాడుకున్నారు. కొండమ్మ అడిగిందానికి రమ ముభావంగా సమాధానాలు చెప్పసాగింది. నిజానికామెకు ఎవరితోనూ మాట్లాడాలని లేదు.

"నిద్రొస్తుంది పంతులమ్మా ఇంగ పండుకుంటా" అంది కొండమ్మ.

"సరే పండుకోమ్మ" అంది రమ.

"ఏమన్న అవసరమైతే లేపు పంతులమ్మా" అందామె. మూలనున్న గోనెసంచి పరుచుకుంటూ, కొద్ది సేపటికి ఆమె సన్నని గురక వినబడింది. పాపం పగలంతా రెక్కలు ముక్కలు జేసుకుంటారు. నిద్ర బోకుంట ఉండాలంటే వీళ్లకు కష్టమే కదా అనుకుంది రమ.

రాత్రి పదయింది. మెల్లగా అడవమ్మ వంటిమీద చేయి వేసి చూసి 'జ్వరం తక్కువైనట్టుంది' అనుకుంది. ఆ స్పర్శకి మెల్లగా కళ్లు తెరిచింది అడవమ్మ.

రమవైపు పిచ్చిగా చూసింది. కొద్ది సేపటికి నీరసంగా...

"అమ్మా నువ్వా" అంది రమ చేయిని తడుముతూ.

"ఆ నీకు జ్వరమొచ్చిందంటే చూద్దామని వచ్చినగాని, జెరలేసి కూసో గోలేసుకొని మళ్ల పడుకుందువుగాని" అంటూ మెల్లగా ఆమె భుజాలు పట్టుకొని లేపి కూర్చోబెట్టింది. మాత్ర వేసుకొని కూర్చునే ఓపిక లేనట్టు మళ్లీ రమ చేయి ఆసరాతో మంచం మీద వాలిపోయి ఏదో మాట్లాడాలని ప్రయత్నం చేసి సాధ్యం గాక మగతగా కళ్లు మూసుకుంది. క్రమంగా నిద్రలోకి జారిపోయింది. కొద్దిసేపు ఆమె మొహంలోకి చూస్తూ అలాగే నిలబడిపోయింది. రమ ఆమె కళ్లలో నీళ్లు తిరిగాయి. అడవమ్మ మొహం మసకబారింది. కళ్లు తుడుచుకొని మంచం దగ్గర నుండి కదిలి ఆ చిన్న గదిలోనే అటు ఇటు తిరగసాగింది. తిరుగుతూ ఆ గది నాలుగు మూలలు పరీక్షగా చూడసాగింది. గోడకు గొట్టిన మేకుకు వేలాడదీసిన ఫొటో ఆకర్షించిందామెను. ఫొటో ముందుకువెళ్లి నుంచుని పరీక్షగా చూసింది. పాతకాలం నాటి ఫొటో అది. ఆ ఫోటోలో అడవమ్మను పోల్చుకోగలిగింది. పక్కన కూర్చున్నది ఆమె భర్తని అర్థమైంది. ఆమె చూపులు వేగంగా అడవమ్మ ఒడిలో కూర్చున్న పిల్లోడి వైపు కదిలాయి.

ఈ అబ్బాయి... ఈ అబ్బాయేనా యాదగిరంటే... ఖచ్చితంగా యాదగిరే... అయిదారేళ్ల వయసుంటుందేమో. ఎంత అమాయకంగా ఉన్నడు. అమ్మ ఒడిలో.. అడవమ్మ ఒడిలో ఎంత నిశ్చింతగా కూర్చున్నడు.

ఈ అబ్బాయి ఇప్పుడు లేడు కదా... అడవమ్మ వొడి బోసిపోయిందా... ఒక్క అడవమ్మ వొడెనా... ఎంత మంది అమ్మల వొడి బోసిగా జేసిపోయిండో. ఈ అబ్బాయి కోసం... ఎంత మంది అమ్మలు గుండెలు బాదుకుంటుండ్రో ఈ రోజు. ఈ అమ్మ... ఈ అడవమ్మ మాత్రం నిశ్చింతగా నిద్రబోతుంది.

ఈ అడవమ్మ కొడుకు అడవి తల్లి ఒడిలో శాశ్వతంగా నిద్రబోతున్నాడు.

తన చూపుడు వేలుతో ఫొటోలోని అబ్బాయిని మెల్లగా తడిమింది.

కన్నీళ్లు రమ గుండెల్ని తడుపుతున్నాయి. తడుచుకోవాలనే స్పృహ కూడ లేనట్టు ఫొటో వైపు చూస్తూ నిలబడింది.

ఇంకా ఎంతసేపు ఆలోచనల్లో కొట్టుకుపోయిందో కానీ, అడవమ్మ ఏదో గొణినట్టు వినిపించింది. గబగబా కొంగుతో కళ్లు తుడుచుకొని మంచం వైపు నడిచింది.

అడవమ్మ కలవరిస్తోంది "యాదయ్యా... యాదయ్యా..." అంటూ రమ గుండెను తాకింది పిలుపు. ఓ చేయిని అడవమ్మ తల మీద మరో చేయిని అడవమ్మ పొట్టమీద వేసి "అమ్మా" అని పిలిచింది రమ.

"కొడుకా వచ్చినవ కొడుకా".

"అమ్మా."

"కొడుకా... నేను యాదికొచ్చినా కొడుకా" అంటూ రమ చేయిని గట్టిగా పట్టుకుంది. కొడుకెక్కడ మళ్లీ వదిలి వెళ్తాడో అన్నట్లు నెమ్మదిగా కళ్లు తెరిచింది. అడవమ్మ రమ వైపు పిచ్చిగా చూసింది. మళ్లీ ఆమె కళ్లు మగతగా మూతబడ్డయ్. ఆమె చేతిలోని తన చేతిని తీసుకుంటే అడవమ్మకు మెలకువ వస్తుందేమోనని అలాగే కూర్చుండిపోయింది. రమ ఆమె దీనమైన మొహం చూస్తూ ఆలోచించసాగింది.

ఈ పిచ్చి తల్లి ఎట్ల తట్టుకుంటుంది. విషయం తెలిస్తే ఈ ఒంటరి బతుక్కి ఇంక ఆధారమేంది. ఈ అమ్మ జీవితం ఒంటరిగా ఉండవలసిందేనా. జ్వరమొస్తే నొప్పొస్తే ఈమెనెవరు జూసుకుంటారు, రేపు వయసు మీద పడ్డంక అప్పుడెవరు జూసుకుంటరు, ఈమె బతుకేమయితది. అతను తల్లికి దూరమైండు... కానీ మరెందరికో, కొడుకై దగ్గరయిండు. ఈమెను దిక్కులేని దాన్ని జేసిండు, కానీ ఎందరికో దిక్కయిండు.

తనెందరికో కొడుకైనపుడు... ఈమె కూడా ఎందరికో తల్లి కావాలి గదా!...ఎంత మంది కోసం అతను తల్లికి దూరమైండో... ఎంత మంది కోసం ప్రాణాలిచ్చిండో..అంత మంది ఈమెను తల్లిగా చూసుకోవాల్సిన బాధ్యతుంటది గద. అతను ప్రజల కోసం ప్రాణాలిచ్చిండని నమ్ముతున్న. మరి నేనీమెను చూసుకోవచ్చు గదా... రమ ఆలోచన ఆగిపోయింది.

ఆ ఊహకే ఉక్కిరిబిక్కిరయింది. ఇంకా అడవమ్మ చేతిలో రమ చేయి బిగుసుకునే ఉంది.

మళ్లీ ప్రశాంతంగా ఆలోచించడం మొదలుపెట్టింది.

అవును ఈమెను నేనెందుకు చూసుకోగూడదు. జీవితంలో నేనీమెకు తోడుగా ఎందుకు ఉండగూడదు. ఈమెను నాతోటి ఉంచుకుంటే ఎవరూ ఏమీ అనరా. ఎవరంటారు ఎవరికి నష్టం. అమ్మా నాన్న ఏమంటారు. వాళ్లకర్థం చేయించొచ్చు. అర్థం చేస్కోకపోతే ఎవరి దారి వాళ్లది. అయినా నేను నెల నెల డబ్బులు పంపినంత కాలం వాళ్లు నన్ను గట్టిగా ఏమన్లేరు. వేణుకు తెలిస్తే ఎలా ఫీలవుతాడు. సంతోష పడ్తాడు... నన్ను ప్రేమించినందుకు గర్వపడక పోయినా కనీసం సిగ్గు పడడు. అవును సిగ్గుపడడు. వేణు తీరుగ బతికే ధైర్యం, యాదగిరి తీరుగ మరణించే ధైర్యం నాకు లేకపోవచ్చు కానీ కనీసం ఇలా బతకొచ్చు... ఇట్లనన్న బతుకుత నేను.

'ఈ అమ్మకు నేను బిడ్డనైత' దృఢంగా అనుకుందామె.

రమ చేయిని పట్టుకున్న అడవమ్మ చేయి మెల్లగా సడలింది.

ఇప్పుడు అడవమ్మ చేయిని రమ గట్టిగా పట్టుకుంది.



● షహీదా

# అమూల్యం

**డివిజన్ కమిటీ సమావేశం పూర్తయ్యి ఎవరి ఏరియాలకు వాళ్లు వెళ్లే సమయం. మిగతా కమిటీ సభ్యులందరిలాగే పూసు కూడా ఊపిరాడకుండా ఉన్నాడు.**

**కొరియర్ ఏపిటిలు పెట్టుకుంటున్నాడు. ఇచ్చి పుచ్చుకోవల్సిన వస్తువుల జాబితాలు సరి చూసుకుంటున్నాడు. చివరి నిమిషంలో రాయాల్సిన కొన్ని ముఖ్యమైన ఉత్తరాలు రాస్తున్నాడు. వేర్వేరు ఏరియాల నుండి మీటింగు రక్షణ కోసం వచ్చినవాళ్లలో తెలిసిన కామ్రేడ్స్ తో కనీసంగా కొద్దిసేపైనా మాట్లాడాలనే ప్రయత్నాలు చేస్తున్నాడు.**

'మళ్లీ ఎవరు ఎప్పుడు కలుస్తారో లేక అమరులే అవుతారో?!'

తనతో ప్రయాణించే టీముతో ప్రయాణం వివరాలు అనుకుని లోపాలు లేకుండా ప్రయాణాన్ని ప్లాన్ చేసుకుంటున్నాడు. అందులోనూ ఈసారి పైకమిటీ బాధ్యురాలు రైమతి కూడా వారితో వస్తోంది కనుక మరిన్ని జాగ్రత్తలు తీసుకోవడం గురించి అందరికీ అర్థం చేయిస్తున్నాడు. ఇలా కనిపించే, కనిపించని ఎన్నో పనులతో క్షణం తీరిక లేకుండా ఉన్నాడు.

ఈ ప్రపంచంలో అన్నిటికంటే అర్థం చేసుకోవడం కష్టమైనది మానవ మస్తిష్కం ఎలా పని చేస్తుందనేదేనేమో. ఎందుకంటే ఈ అన్నిటి మధ్యా కూడా పూసు బుర్ర వేరే పని చేస్తోంది! ఇక రెండు మూడ్రోజుల్లో సోమారు దాదా కలుస్తాడనేది నిర్ధారణ అయ్యాక ఒకే ఒక్క ప్రశ్నతో కుస్తీ పడుతోంది.

'ఆయన్ని ఎలా ఎదుర్కోవడం?'

పూసు వాళ్ల ప్రయాణానికి ఎన్నుకున్న దారిలోనే ఉంది సోమారు దాదా వాళ్ల ఊరు. అక్కడ కచ్చితంగా ఒక రోజు ఆగాల్సిందే కొన్ని పనులు పూర్తి చేసుకోవడం కోసం. ఆగారంటే సోమారు దాదా కలవాల్సిందే. అనివార్యత వల్లే కాదు, ఆయన్ను తప్పక కలిసి మాట్లాడాల్సిన అవసరం కూడా ఉంది పూసుకు. ఆరు నెలలుగా ఎదురు చూస్తున్నాడు ఇందుకోసం. అయినా అది కలవరపాటునే కలిగిస్తోంది పూసులో.

సోమారు దాదాను కలవడానికి పూసుకి కలవరంగా వుంది అంటే బహుశా ఆ ఏరియాలో పని చేసిన, చేస్తున్న ఏ కామ్రేడూ నమ్మరు. ఎందుకంటే ఆయన్ని కలవడం ఎవరికైనా గానీ చాలా సంతోషాన్ని కలిగించే విషయం. అంత ప్రేమగా ఉంటాడు పార్టీ అంటే. కామ్రేడ్సంటే ప్రాణం పెడతాడు.

ఒకసారి పోలీసులతో ఎన్‌కౌంటర్లో పూసు చేతికి గాయమైంది. గాయం మానాక పూసుకు కూచున్నా, నుంచున్నా, మాట్లాడుతున్నా మోచేతి కింద ఆ గాయపు మచ్చను తడుముకుంటూ వుండడం అలవాటైంది. ఎంత అసంకల్పితంగా దాన్ని తడుముతూ ఉంటాడంటే ఆ పని చేస్తున్నానని అతనికి తెలీనే తెలీదు. సోమారు దాదా విషయాన్ని కూడా ఇప్పుడు అతని మనసు అలాగే తడుముతోంది. కానీ ఎవరైనా అడిగితే మాత్రం, 'ఆయన గురించి నేనెక్కడ ఆలోచిస్తున్నాను?' అని ఎదురు అడిగేవాడే. అది అబద్ధం కాదు.

"పూసు దాదా, లాల్‌సలాం విజిల్ వేశారు," అతని గార్డు సుక్కు గుర్తు చేయడంతో రాయడం పూర్తి చేసిన ఉత్తరాన్ని గబగబా ప్యాక్ చేసి సుక్కు చేతికిచ్చి, "బీర్సా దాదాకు ఇవ్వాలి," అన్నాడు. సుక్కు, "ఇంగో," అని దాన్ని చొక్కా పైజేబులో పెట్టుకున్నాడు. పూసు లేచి తను కూచున్న చిన్న జిల్లీని మడత పెట్టి, కిట్టు, తుపాకి తీసుకుని చుట్టూ ఓసారి కాయితం ముక్కల్లాంటివి ఏమీ పారేయలేదు కదా అన్నట్టు చూసి, ఏమీ లేవని సంతృప్తిపడి, సుక్కు వెనకే నడిచాడు.

అందరితో చేతులు కలిపి లాల్‌సలాములు చెప్పడం పూర్తయ్యాక డివిజన్ కమిటీ కార్యదర్శి సుకియారి పూసు దగ్గరకొచ్చింది.

"రోడ్డు దాటే దగ్గర మరింత జాగ్రత్త, గ్రీన్‌హంట్ దాడులు...రైమతి దీదీ..."

"ఫికర్ చేయకు, అన్ని జాగ్రత్తలు తీసుకుంటాం."

"అదొకటే కాదు, తన ఆరోగ్యం..."

ఆమెను పూర్తి చేయనీయకుండా పూసు సుకియారి కుడిచేతిని తన చేతుల్లోకి తీసుకుని నవ్వాడు.

'అవసరం లేని మాటలు ఎందుకు మాట్లాడుతుంటామో కదా' అన్నట్టు చూస్తూ సుకియారి కూడా నవ్వింది. కానీ ఎందుకో ఇద్దరికీ తెలుసు. వీడ్కోలు క్షణాల ఉద్వేగాల ప్రభావం అది.

అందుకేనేమో వరుసల్లో నుంచున్నప్పుడు లాల్‌సలాం చెప్పుకున్నా ఇలా విడిగా కూడా ఆఖరి నిమిషంలో మళ్లీ చేతులు కలుపుకుంటూనే ఉంటారు కొందరు కామ్రేడ్స్. ఆ చిన్న చర్య ద్వారా మాటలకందని ఎన్నో విషయాలు ఒకరి నుంచి ఒకరికి చేరిపోతూనే ఉంటాయి.

అతని బలమైన చేతుల్లో ఒద్దిగ్గా ఇమిడిపోయిన తన చిన్న చేతిని వెనక్కి తీసుకోకుండా సుకియారి, "సోమారు దాదాను కలిసేటప్పుడు రైమతి దీదీ కూడా ఉంటదిలే," అన్నది అతనికి సాంత్వన కలిగించాలన్నట్టుగా.

ఆ సమయంలో ఎవరైనా తనతో వుంటే మంచిదనే ఆలోచన అతనికేమీ లేకుండింది. దాదాతో మాట్లాడ్డం పెద్ద విషయం అని అతను పైకి ఏమీ అనుకోవడం లేదు కూడా. తెలీకుండానే లోపల సలుపుతోంది అంతే. నిజానికి అలా కోరుకునేదంటూ వుంటే అతను సుకియారిని కోరుకునేవాడు. పదేళ్ల నుండి కలిసి పని చేస్తున్నారు, రెండేళ్ల క్రితం అతను డివిజను కమిటీలోకి ఎన్నికైనప్పటి నుండి మరింత సన్నిహితంగా ఆమె అతన్ని ఎరుగును. సోమారు దాదాకు కూడా సుకియారి మంచి పరిచయం. రైమతి ఈమధ్యే వారి డివిజన్ బాధ్యతలు స్వీకరించింది.

మొదటిసారి అతనితో ఆ ఏరియాకు వస్తోంది.

ఏమనకుండా సుకియారి చేతిని కరచాలనంగా దృఢంగా ఊపాడు. ఆమె అతనికేసి రెండు క్షణాలు తదేకంగా చూసి 'వెళుతున్నా' అని కళ్లతోనే చెప్పి వెనుతిరిగింది.

'పుస్తకంలా చదువుతుంది మా కార్యదర్శి నన్ను,' అనుకున్నాడు పూసు దూరమౌతున్న ఆమె రూపాన్ని కళ్లలో నింపుకుంటూ.

* * *

మూడు రోజులు ఆగకుండా మూడేసి పూటలూ నడిచాక ఒక ఊరి దగ్గర ఒక రోజు కోసం ఆగారు పూసు, రైమతి, వారి టీమూ. అక్కడ కొన్ని డంపులకు సంబంధించిన పనులు పూర్తి చేసుకుని మరో నాలుగు రోజులు ప్రయాణం చేస్తేగానీ తాము అనుకున్న గమ్యానికి చేరరు. ఉదయాన్నే జావ తాగి వెళ్లారంటే రోజంతా డంపు పనుల్లో తీరిక లేకుండా వుండినారు పూసు, అతనితోపాటు వెళ్లినవాళ్లూ. మధ్యాహ్నం డబ్బాల్లో తెచ్చుకున్న అన్నం తిన్నారు. రైమతి డేరాలోనే ఉన్నా స్నానాలు, బట్టలుతుక్కోవడం, చదవాల్సిన కొన్ని డాక్యుమెంట్లు చదువుకోవడం, రాయాల్సిన కొన్ని రిపోర్టులు రాయడం లాంటి పనులతో ఆమె కూడా తీరిక లేకుండానే గడిపింది.

రైమతివాళ్లు సాయంత్రం ఆరున్నరకల్లా తినేసి, డేరా మార్చి, కవర్లు చూసుకుని జిల్లీలు వేసుకునేవరకూ పూసు వాళ్ల రానే వచ్చారు. టీం కమాండరు వాళ్ల కవర్లు కూడా చూపి వెళ్లాడు. పూసుతో వెళ్లినవాళ్లంతా తమకోసం ఉంచిన అన్నాన్ని తిని తమ, తమ జాగాలకు వెళ్లారు. ఊర్లో మిలీషియా సెంట్రీ కూడా నడుస్తోంది, కొంత రక్షణ ఉన్న ప్రాంతమే కనుక సోలార్ లైట్లు వెలిగించి చదువుకుంటున్నారు అందరూ.

పూసుకు కూడా నడుం వాల్చాలనే ఉంది. కానీ ముందు రైమతి దగ్గరకెళ్లాలి.

సోలార్ కాంతిలో చదువుకుంటున్న రైమతి పూసును చూడగానే నవ్వుతూ అతనికి జాగా కల్పిస్తూ పుస్తకాల్నీ, సోలార్ దీపాన్నీ పక్కకు జరిపింది. ఆ రోజు పూర్తయిన పనుల గురించి చెప్పాడు ఆమెకు.



"అయితే రేపు అనుకున్నట్టుగానే బైల్దేరచ్చు కదా?"

పూసు తలూపాడు. "రేపు ఉదయాన్నే నాలుగింటికల్లా లేచి వెళ్దాం. అక్కడ డంపుల పని సాయంత్రం వరకూ పూర్తి కావాలి లెక్క ప్రకారం. పూర్తి చేసుకుని రాత్రికి ఆగకుండా నడిస్తే మర్నాడు తేలిగ్గా వుంటుంది మనకు. ఉదయం చిన్న టీమును ముందుగా పంపి, ఆ రాత్రికి మనం రోడ్డు దాటుదాం," అనుకున్న విషయమే అయినా మళ్లొకసారి మార్పు లేదనడం కోసం చెప్పాడు పూసు.

రైమతి తలూపింది.

"నీకోసం వుంచాను," అంటూ రైమతి ఒక పత్రికను తీసి యిచ్చింది పూసుకు ఒక కవర్ లోంచి.

"హిందీనా?" అని నవ్వాడు పూసు. తెలంగాణవాడే అయినా హిందీ తెలియగల ప్రాంతాల నుండి రాలేదు పూసు. బస్తర్ లో పని చేయబట్టి చాలా ఏండ్లే అయినా హిందీ మీద అంత పట్టు సంపాదించుకోలేదు. వార్తలు వింటాడు, వార్తాపత్రికలూ, పార్టీ పత్రికలు కొంత చదువుతాడు, అంతే.

"హిందీ కనుకనే," అంది రైమతి నవ్వుతూ. "లేదు పూసూ, హిందీ మీద పట్టు సంపాదించాలి. ఉత్తర భారతంలో మన పార్టీ ప్రజాసంఘాలు తెస్తున్న పత్రిక ఇది. సులభంగా ఉంటుంది, అందుకనే నీకోసం ఇది ఎంపిక చేశాను," అని జోడించింది.

నిజానికి పూసు కోయ భాషను అతి త్వరగా నేర్చుకున్నవారిలో ఒకడు. దండకారణ్యానికి వచ్చిన కొత్తల్లో సోమారు దాదా లాంటి పెద్ద వయసువాళ్లతో ప్రత్యేకించి సమయం కేటాయించుకుని హిందీ, తెలుగు, మరాఠీ పదాలతో సంకరం కాని నికార్సయిన కోయ పదాలను నేర్చుకోవడానికి కూడా ప్రయత్నించాడు. కొత్త తరం కోయ కామ్రేడ్స్‌ను బనాయించేవాడు కూడా - మీదేం కోయ? అన్నీ కలిపేసి సంకరం చేస్తున్నారు, అసలు కోయంతా ముసలివాళ్ల దగ్గరే ఉందంటూ.

తనలా అన్నప్పుడు సోమారు దాదా కళ్లు ఎంత సంతోషంతో వెలిగిపోయేవో గుర్తొచ్చి పూసు పెదవుల మీద చిన్న నవ్వు విరిసింది.

'కానీ అదేంటో హిందీ విషయంలో శ్రద్ధ కుదరడం లేదు. బహుశా వేగంగా పెరిగిన బాధ్యతల్లో సమయం దొరకకనేమో...' అని తనకు తను సర్దిపుచ్చుకోవడం అలవాటయ్యింది. దాన్నే రైమతి ముందూ అనాలోచితంగా,

"అనుకుంటూనే వుంటాను, కానీ ఏదో ఒక పని...," అనే అసంపూర్ణ వాక్యంలో వ్యక్తం చేసేశాడు.

"చదువుకున్న నువ్వే వెనకా ముందూ ఆడితే ఎలా, బాధ్యతలు పెరుగుతున్నాయి. మనం పని చేస్తున్న ప్రాంతంలో అన్ని వర్గాల్లోకీ వెళ్లాలంటే హిందీ మీద పట్టు తప్పనిసరి. నీకు అర్థం కానివి వుంటే అడుగు, కనీసం నేను ఉన్నప్పుడు," అంది రైమతి ఏ సాకులకూ ఇక తావు లేదన్నట్టుగా.

'దొరికిపోయాను' అన్నట్టుగా పూసు కొద్దిగా సిగ్గుపడుతూ నవ్వి, కొద్దిదూరంలో కూచుని రైమతి గార్డు సియాబత్తితో మాట్లాడుతున్న సుక్కును పిలిచి పత్రికను అందించాడు.

"ఊర్లోకి వెళ్లిన సుక్కి వాళ్లు వచ్చారా కనుక్కో సుక్కూ," అంటూనే ఉన్నాడు ఇంతలో సుక్కి రానే వచ్చింది.

పెద్ద రుమాలు మూటను అందించింది పూసుకు. విప్పి చూశాడు. ఆకుకూర.

"చూశావా, ఎక్కడ దొరుకుతది దాదా అన్నావు, వెతికితే అన్నీ దొరుకుతాయి ఎక్కడైనా గానీ," అంటూ సియాబత్తిని పిలిచాడు. ఆమెకు ఆ మూటను అందిస్తూ,

"నీకూ, సుక్కికీ రోజూ డ్యూటీ, ఏ ఊరికి వెళ్లినా ఆకుకూర వెతికి

తెచ్చి రైమతి దీదీకి కారం లేకుండా ఉప్పు తక్కువగా వేసి కూర చేసి పెట్టాలి. ఎక్కడ దాదా ఏం దొరుకుతాయి అనకూడదు, అన్నారో నేను వచ్చి చూపించాల్సి వస్తుంది, అందరూ నవ్వుతారు మరి," అన్నాడు పూసు నవ్వుతూ.

అడవిలో పుట్టి పెరిగిన తమకు అన్న ఇలా సవాల్ విసరడం సుక్కికీ, సియాబత్తికీ కొంచెం సిగ్గుగా, కొంచెం నవ్వు తెప్పించేదిగా తోచి ఇద్దరూ కిలకిలా నవ్వారు.

"రేపు సుక్కి వాళ్ల ఊరుకే మనం పోయేది," అని గుర్తు చేశాడు సుక్కు.

"ఇంకేం? ఎక్కడ ఏం దొరుకుతాయో అన్నీ తెలిసే వుంటాయి కదా, కాకరకాయలు కూడా వుంటే చూడండి, ఎండబెట్టి వుంచుకోవచ్చు, చేదు తింటే పొట్టకు మంచిదంటారు," అన్నాడు పూసు.

తలలూపి ముగ్గురూ ఆ మూటను తీసుకుని వెళ్లారు మర్నాటి కూర కోసం బాగు చేసి వుంచడానికి. రైమతి కొంత ఇబ్బందిగా చూస్తోంది ఇదంతా. ఆమె పేగుల్లో ఇన్‌ఫెక్షన్ అయ్యి ఆరోగ్యం బాగా దెబ్బ తిన్నది. ఏం తిన్నా పడడం లేదు. దాంతో ఆహారం విషయంలో కొన్ని జాగ్రత్తలు తప్పడం లేదు.

"సుకియారి చెప్పిందా?"

"చెప్పింది, చెప్పకపోయినా నాకూ...."

తన ఆరోగ్యం విషయం ఎక్కువ చర్చ కావడం ఇష్టం లేని రైమతి అతన్ని పూర్తి చేయనీయకుండా విషయాన్ని మారుస్తూ, "సుక్కి వాళ్ల ఊరంటే రైను వాళ్ల ఊరేగా?" అనడిగింది.

"ఊ, అదే, రైను వాళ్ల నాయన సోమారు దాదా కూడా కలుస్తాడు రేపు..."

రెండు క్షణాలు ఆగి, రైమతి సందేహిస్తున్నట్టుగా, "అలిసిపోయావా?" అనడిగింది.

ఆశ్చర్యంగా చూశాడు పూసు. రైమతికి అర్థమైంది. పనులు వుంటే అలసట లెక్కకు రాదు కదా అనే ఆశ్చర్యం అది.

"ఆహా, నువ్వు రైనును కొట్టిన విషయంలో ఏం జరిగిందో వివరంగా తెలీదు. చాలా ముఖ్యమైన విషయాలు మాట్లాడుకోవడంలో సమావేశం ఒత్తిడిలో అడిగే అవకాశమూ దొరకలేదు, కాసేపు కూచోగలిగితే అడుగుదామని..."

పూసు చూపులు కిందకు వాల్చాడు. ఎక్కడ మొదలుపెట్టాలి అన్నట్టు కొన్ని క్షణాలు ఆగాడు.

"రైను, సుక్కి ఒకే ఊరివాళ్లు. ఇద్దరూ మిలీషియాలో కలిసి పని చేశారు. వయసు తేడాలు కూడా పెద్దగా లేవు. ఒకరకంగా కలిసి పెరిగినట్టు. ఇద్దరూ పూర్తికాలం కార్యకర్తలయ్యారు. వరస కూడా కలుస్తుంది. రైనుకు సుక్కి అంటే ఇష్టం ఏర్పడింది. ఒకటే దళంలో పని చేస్తుండినారు. రైను సుక్కిని అడిగాడు గానీ ఆమె తనకిష్టం లేదనీ, అతన్ని చిన్నప్పటి నుండి అన్నలాగ చూస్తున్నానని చెప్పేసింది. ఇదంతా అందరికీ తెలిసిన విషయమే. అక్కడితో వదిలేస్తాడని అందరూ అనుకున్నారు."

కొద్దిసేపు పూసు అలాగే వుండిపోయాడు. తను చెప్పడం ఆపాననే స్పృహ లేదు.

చూసి చూసి రైమతే ఇక, "ఆ రోజు...?" అనడిగింది.

పూసు స్పృహలోకి వచ్చి, "ఆఁ, ఆ రోజు నేను కూడా వాళ్ల దళంతోనే ఉండినాను. సుక్కి, రైనులకు కలిపి సెంట్రీ పడింది. సుక్కిని తన అభిప్రాయం మార్చుకోమని అడుగుతూ ఆమె చేయి పట్టుకున్నాడు. సుక్కి విదిలించుకుని అందరికీ చెప్తానని బెదిరించి మాకేసి వస్తోంది. అప్పటికి తనేం చేశాడో అర్థమై భయపడ్డట్టున్నాడు. తుపాకి అక్కడే పెట్టి పరుగు పెట్టాడు. రాత్రిపూట అందరూ నిద్రపోయారప్పటికే. నేనూ, కమాండరూ మెలకువగానే వున్నాం ఏదో మాట్లాడుకుంటూ. సుక్కి వచ్చి చెప్పగానే ముగ్గురం పరుగెట్టాం పట్టుకోవడానికి. రైను ఉరికే చప్పుడు వినిపిస్తోంది, టార్చి వెలుతురులో కనిపిస్తున్నాడు కూడా కానీ మేం ఎంత పిలిచినా ఆగడం లేదు. సుక్కి చెప్పిన విషయం, ఈ నిర్బంధ సమయంలో మేమలా అతన్ని లైటు వేసి తరమాల్సి రావడం అన్నీ కలిసి నాకు చాలా టెన్షన్‌గా, కోపంగా ఉండింది. చివరకు ఎలాగో నా చేతికే అందాడు. అయినా గింజుకుని మళ్లీ పారిపోవాలని చూస్తుండినాడు. ఎంతకీ అదుపులోకి రావడం లేదు. దాంతో ఇక ఆపుకోలేక ఒక్క దెబ్బ వేశాను....అప్పటికి ఆగాడు. అప్పటికి కమాండర్ కూడా వచ్చాడు. ఇద్దరం రైనును డేరాకు పట్టుకొచ్చాం. కింది నుండి పైదాకా ఆత్మవిమర్శ చేసుకుంటూ వస్తున్నది ఆ దెబ్బ కోసమే."

ఇద్దరూ కాస్సేపు ఏం మాట్లాడలేదు.

"ఆ తర్వాత ఎన్ని రోజులకు ఇంటికి వెళిపోయాడు?"

"తప్పు ఒప్పుకున్నాడు. సుక్కికీ, పార్టీకీ క్షమాపణ చెప్పాడు. మారతానన్నాడు. అయితే మాకు అప్పటికి అర్థం కాని విషయం ఏంటంటే అతను ఇంటికి వెళ్లాలనే నిర్ణయానికి ముందే వచ్చాడనేది. సుక్కి వస్తుందేమోననే ఆశతో ఆగాడు. ఇలా కావడంతో ఇక ఎక్కువకాలం నిలవలేదు, నెలలోపే ఇంటికి పోతానని చెప్పి వెళిపోయాడు. చిన్నప్పటి నుంచి నాకు పరిచయం, సన్నిహిత కుటుంబం కూడా కనుక నేనూ అతనికి చాలా సమయమే వెచ్చించి అర్థం చేయించాను. కొట్టినందుకు ముందే ఆత్మవిమర్శ చేసుకున్నాను. ఊర్లో వుండి పని చేస్తానన్నాడు. రేపు వెళితే నేరుగా తెలుస్తుంది ఎంతవరకూ చేస్తున్నాడో. నాకూ ఈమధ్య రిపోర్టు లేదు."

"ఎందుకు వెళిపోవాలనుకున్నాడో?"

"అదే నాకు ఇప్పటికీ పూర్తిగా అర్థం కానిది. మిలీషియాలో కంటే ఇక్కడ ఎక్కువ క్రమశిక్షణగా వుండాల్సి రావడం వల్ల అంటారు మన కామ్రేడ్స్. అక్కడా క్రమశిక్షణ సమస్యలు వుండేవట. దళంలోకి వచ్చేటప్పటికి చాలా మారాడు అంటారు."

"చాలాసార్లు ఒక్క కారణం ఏం వుండదులే పూసూ. అనేక అంశాలు పని చేస్తాయి. అయినా నీకు చెప్తున్నానేంటి?"

"ఏం కాదులే. చెప్పు, కొన్నేళ్లు పని చేసినంత మాత్రాన అన్నీ అర్థమైపోతాయని కాదు కదా. కొద్ది రోజుల తర్వాత ఏదో ఒక కొత్త కోణం బైటికొస్తూనే వుంటుంది."

"సరే, కమిటీల్లో సమీక్ష అయిపోయిన విషయాన్ని మనం కొత్తగా చర్చించేదేముంటుంది? అన్ని కోణాల్లో ఆలోచించే వుంటారు కదా. నేను అడగడానికి తెలుసుకోవాలనేదొక్కటే కారణం కాదు..."

పూసుకి అర్థమైంది.

"లేదు దీదీ. నేను కొట్టడం వల్లే వెళిపోయాడని నేనేమీ అనుకోవడం లేదు ఇప్పుడు. మొదట్లో అలా అనుకుని చాలానే ఇబ్బంది పడ్డాను. సమీక్షించుకున్నాం..."

అనుకోకపోతే మరెందుకు సోమారు దాదాను కలవడానికి అంత కలవరపడ్తున్నావు అనే ప్రశ్న రైమతి వేయలేదు. కానీ ఆమె చూస్తున్న చూపులో రైనుకు ఆ ప్రశ్న కనిపించింది.

'అంత అర్థమయ్యేలా వున్నాయా తన ముఖంలో భావాలు? మొన్న సుకియారి, ఇవాళ రైమతి. లేదా సుకియారి చెప్పి ఉండాలి దీదీకి, అంతే అయ్యి వుంటుంది,' అనుకున్నాడు.

కానీ అతను మాట్లాడే స్థితిలో లేడు. అతనికే ఆశ్చర్యంగా వుంది తనమీద తనకు. ఇక ఆమెకేం వివరిస్తాడు?

"సరే దీదీ, వెళతాను, ఎక్కువసేపు మేలుకోకు, రేపు చాలా నడవాలి," అంటూ లేచాడు పూసు.

కొద్దిసేపు అతనితో ఆ విషయం మాట్లాడాలని అనిపించినా ఆ

నిరాశను కనిపించనివ్వకుండా రైమతి, "ఇంగో," అన్నది.

* * *

జిల్లీ మీద పడుకున్నాడే గానీ పూసుకు నిద్ర రావడం లేదు.

గత కొన్ని సంవత్సరాలుగా గ్రామం నుండి పూర్తికాలం కార్యకర్తలుగా వచ్చేవారందరినీ ఊరి ప్రజల ముందే సమావేశపరిచి వాళ్లకు చెప్పి, వాళ్లు చెప్పేదేమన్నా వుంటే కూడా విని మరీ వారిని భర్తీ చేసుకోవడం ఒక ఆనవాయితీగానే అమలు చేస్తూ వస్తుండినారు. రైను, సుక్కి వాళ్ల భర్తీ అయినప్పుడూ అలాగే చేశారు. ఆ రోజు చూడాలి సోమారు దాదా ముఖంలో ఉత్సాహం.

పార్టీ కార్యకలాపాలు ఆ ఏరియాలో ప్రారంభమైనప్పటి నుండీ పార్టీతో గట్టిగా నిలబడిన కామ్రేడ్ ఆయన. మొదట్లో డిఎకెఎంఎస్ లో చురుగ్గా పాల్గొన్నవాడే, తర్వాత వయసు మీద పడడంతో బాధ్యతల నుండి తప్పుకున్నాడు. ఇప్పుడు జనతన సర్కారుకు మంచి అండదండ. పార్టీకి అత్యంత నమ్మకస్తుడు.

ఇవన్నీ ఒకెత్తు అయితే ఆ ఏరియాలో కమాండరుగా, ఇప్పుడు డివిజన్ కమిటీ సభ్యుడిగా పని చేస్తున్న పూసుకూ, ఆయనకూ వుండే అనుబంధం మరో ఎత్తు. కమ్యూనిస్టులకు స్వంతాస్తులూ, కుటుంబాలూ వుండవు నిజమే గానీ మొదటగా పని చేసే ఏరియాల్లో, కమాండరుగా పని చేసిన ఏరియాల్లో కొన్ని కుటుంబాలతో, కొందరు వ్యక్తులతో ఏర్పడే అనుబంధాలు చాలా లోతుగా వుంటై. అనుభవించినవారికి గానీ వాటి లోతు అర్థం కాదేమో అనిపించేటంత. ఎందుకంటే అవి ఆ కామ్రేడ్స్ ఎదుగుదలతో కూడా విడదీయరాని విధంగా ముడిపడి వుంటై.

పూసుకూ, సోమారు దాదాకూ వుండే అనుబంధం అలాంటిదే. ఆ రోజు పూసు కూడా ఉండడంతో రైను పూర్తికాలం కార్యకర్తగా మారుతున్నందుకు తనకు కలుగుతున్న గర్వాన్నీ, సంతోషాన్నీ ఆయన పూసుతో కూడా చాలానే పంచుకున్నాడు. గ్రామసభలో కూడా పదేపదే పార్టీ తల్లి వంటిదనీ, మన రాజ్యం వచ్చేదాకా ఎన్నడూ లడాయిని విడవకూడదనీ ఇలా చాలానే బుద్ధులు చెప్పాడు రైనుకూ, మిగతా రిక్రూట్లకూ. రైనుకు క్రమశిక్షణ విషయంలో గల లోపాన్నీ గుర్తు చేశారు గ్రామస్తులు. మీటింగ్ చాలా బాగా జరిగిందని అందరూ సంతోషపడ్డారు కూడా.

చివర్లో విడిపోయే ముందు సోమారు దాదా పూసు దగ్గరకు వచ్చాడు.

"రైను పని ఎక్కడ ఏమైనా అనుకున్నారా?"

"లేదు దాదా, సమావేశంలో అనుకుంటారు."

"మరీ దూరం పంపుతారా?"

పూసుకు కొంచెం సానుభూతిగా, కొంత నవ్వుగా కూడా తోచింది. వాతావరణాన్ని తేలిక చేయడానికన్నట్టు చనువుగా బనాయిస్తూ,

"ఇందాకేమో అక్కడ అంతగా ప్రోత్సహించావు, ఇప్పుడేమో దూరం పంపుతారేమోనని ఆదయితున్నావు, లడాయి విస్తరించకుండా గెలుసుడెట్ల దాదా మరి?" అన్నాడు పూసు.

"ఏహె, నేనడిగింది అందుకు కాదు. పార్టీ ఎటు పంపుతే అటు పోవల్సిందే. నాకేం లేదు, కొద్ది రోజులైనా నీ దగ్గర్లో, నీ నిగరానిలో వుంటే కొంత మంచిగైతడని..."

"మన కామ్రేడ్స్ ఎవరైనాగానీ మంచిగానే ప్రయత్నం చేస్తరు దాదా కొత్తవాళ్లకు నేర్పనీకి..."

"అహ, అట్ల గాదు నేననేది. చిన్న పోరగానిగా వున్నప్పటి సంది నీకు రైను తెలుసు. అంతా మంచిగనే వుంటడు గానీ మద్దెలో ఎక్కడ్నో వానికి పురుగు తొలుస్తుంటది, అందుకే ఊరోల్లు కూడా క్రమశిచ్చణ గురించి చెప్పిన్రు."

"నాకు తెలిసి అయితే యిప్పట్లో ఎటూ పంపేది వుండదు. పార్టీ అవసరాలు నీకు తెలవన్ది కాదు, అలా అయితే ఎవ్వరమైనా ఎటైనా పోవాల్సిందే. ఏమాత్రం వీలైనా ఒకటి, రెండేళ్లు పని చేశాక మంచి, చెడూ చూసినంకనే వేరే దిక్కు పంపాల్ననే ఆలోచన చేస్తుంది పార్టీ."

సోమారు దాదా ముఖం పూర్తిగా విప్పారకపోవడం చూసి ఇక పూసు,

"అరే దాదా, రైను ఎటూ పోయేది లేదు, నేనూ ఎటూ పోయేది లేదు. ఒక్క కన్ను కాదు రెండు కండ్లతోని చూస్తుంటాను కదా. ఏం ఫికర్ చేయకు, మంచిగనే అయితడు. అయితే వ్యక్తుల కృషితో కాదు అంతా సమిష్టి కృషితోనే అయితది అనేది గుర్తించాలి నువ్వు కూడా మరి, అంతకంటే ముఖ్యంగా మంచిగా మారాలి, ప్రజలకు సేవ చేయాలనేది రైనులో అంతర్గతంగా వుండాలి. తత్వశాస్త్రం క్లాసు విన్నావు కదా, గుర్తుంది కదా రాయిని పొదుగుతే పిల్ల కాదని..."

అప్పటికి వికసించింది సోమారు దాదా ముఖం. రాయిని పొదగడం అనే ఊహకు నవ్వాడు కూడా.

"ఇంగో, అర్థం అయ్యిందిలే, నీ లెక్క గావాలె వాడు కూడా అని, అంతే," అంటూ సంతోషంగా చేయి కలిపి వెళ్లాడు.

రైను విషయాలు ఆలోచించినప్పుడల్లా పూసుకు పై విషయాలన్నీ గజిబిజిగా బుర్రలో తిరుగుతూనే ఉన్నాయి. సమిష్టి బాధ్యత, అంతర్గత కారణాలు అంటూ సోమారు దాదాకు వివరించినప్పటికీ తెలీకుండానే రైను విషయంలో పూసు మనసులో ఒక బాధ్యతను వహిస్తూనే ఉండినాడు. నిజానికి అది అందరి విషయంలోనూ వహించే బాధ్యతే. కానీ రైనును తను కొట్టడం వల్ల అది ఎంత కాదనుకున్నా ఒక వ్యక్తిగత అంశంగా మారిపోతోంది తనలో. సమీక్షలూ, అంచనాలూ, సుకియారితో విడిగా కూడా చర్చించడం అన్నీ అయినా ఎక్కడో లోపల 'తను సోమారు దాదా నమ్మకాన్ని నిలబెట్టలేదు, రైనును అవతలకు తోయడంలో తనూ పాత్ర వహించాడు' అనే భావన పూర్తిగా తొలగిపోవడం లేదు.

'ఒకవేళ సోమారు దాదా కూడా తను కొట్టడం అనేది రైనును ఇంటికి పోయే వైపుగా కొంతైనా గానీ తోసింది అనుకుంటే ఎలా?' పూసును ప్రధానంగా తొలుస్తున్నది ఇదే.

'ఆయన అలా అనుకుంటే తనేం చెప్పగలడు?' పార్టీ కామ్రేడ్స్ తో సమీక్షలు చేసుకోవడం వేరు, ఆయనకు వివరించడం వేరు అనిపిస్తోంది అతనికి. 'చెప్పడానికి ఏమైనా వుందా తన దగ్గర? రైను పార్టీలో మంచిగా ఎదగాలని ఎంతగా కోరుకున్నాడు ఆయన! అందుకు సహాయం చేస్తాడని తన మీద ఎంత నమ్మకం పెట్టుకున్నాడు!' ఎటు తిరిగి ఎలా ఆలోచించినా ఇక్కడికే వచ్చి ఆగుతున్నాడు పూసు.

దండకారణ్యానికి వచ్చిన తొలి రోజుల్లోనే పూసుకు ఒక విషయం చెప్పారు కామ్రేడ్స్. ఇక్కడి ఆదివాసీలు ఆడా, మగా కూడా పిల్లల్ని చాలా ప్రేమగా పెంచుతారనీ, కొట్టరనీ. ఎప్పుడైనా తల్లులు పిల్లల్ని ఎత్తుకుని పనులు చేసుకున్నట్టే దాదలూ పిల్లల్ని ఎత్తుకుని కనిపిస్తే పూసు అబ్బురంగా చూసేవాడు. రైను విషయం పూర్తిగా వేరే అయినా కూడా పూసుకు ఈ విషయం కూడా గుర్తుకొచ్చేది. ఇదంతా వ్యక్తిగతంగా ఆలోచించడమేననీ, అది తప్పనీ అనిపించపోలేదు పూసుకు. కానీ అధిగమించలేకపోతున్నాడు.

ఆ ఘటనల క్రమం తర్వాత ఇదే సోమారు దాదాను కలవడం.

'అందువల్ల కూడా ఎక్కువ ఆలోచిస్తున్నానేమో, ఒకసారి కలిసి మాట్లాడేస్తే, ఆయన ముందు కూడా తన ఆత్మవిమర్శ చెప్పేస్తే ఈ బరువు తగ్గుతుందేమో,' అని కూడా అనిపించింది అతనికి. అలా ఆలోచిస్తూ, దొర్లి దొర్లి చివరికి ఏ రెండింటికో కునికాడు పూసు.

* * *

మర్నాడు పూసు వాళ్లు డంపు పనుల నుండి తిరిగి వచ్చేటప్పటికి సాయంత్రం అవుతోంది. డేరాను సమీపిస్తుండగా ఎండేసిన కాకరకాయ ముక్కల్ని తీసుకెళ్లడానికి వచ్చిన సుక్కి ఎదురైంది.

"సాధించారా? ఇంకేమేం దొరికాయి?" సుక్కితోపాటే నడుస్తూ

అడిగాడు పూసు.

"ఆకుకూర."

"దీదీ తిన్నదా?"

"జావతో తిన్నది."

"మంచిదే. సాయంత్రానికి?"

"చాలానే అయ్యింది కూర. మిగిలింది. నీక్కూడా తీసి ఉంచాం."

"నాకేం వద్దులే గానీ, మాతో వచ్చిన రాజేష్ కి జ్వరం వచ్చింది. తనకి పంపించు. ఆఁ, అక్క, కూరలో కారం వుండదు కదా, అవసరం అయితే రెండు మిరపకాయలు వేసి వేడి చేయి."

సుక్కి తలూపి వెళిపోయింది. డేరా దగ్గర కొద్దిమంది ఊరు నుండి వచ్చిన ప్రజలు కనిపించడంతో వారితో చేతులు కలిపి పలకరింపు మాటలు మాట్లాడాక కాళ్ళు, చేతులూ కడుక్కోవడానికి వంట చేస్తున్న కేసి వెళ్లారు పూసు, సుక్కు. అక్కడ సోమారు దాదా కనిపించాడు పొయ్యి దగ్గరే వెచ్చగా కాళ్ల మీద కూచుని నల్లచాయ్ తాగుతూ. పూసును చూడగానే ముఖం అంతా విప్పారుతుండగా లేచి నుంచున్నాడు. ఇద్దరూ ఆప్యాయంగా చేతులు కలుపుకున్నారు. ఎప్పట్లాగే ఆయనను చూడడంతోనే పూసు హృదయమంతా ఒక వెచ్చని భావన పాకింది.

'ఇంత లోతుల నుండి ఎలా ప్రేమిస్తాడో ఈయన కామ్రేడ్సందరినీ! సగం అలసట పోయింది ఈయన నవ్వుతో,' అనుకోకుండా వుండలేకపోయాడు పూసు.

"పూసు దాదా వాళ్లకు నల్లచాయ్ చేయండి," తనకంటే పదులకొద్దీ ఏండ్లు చిన్నవాళ్లయిన పిఎల్‌జిఎ కామ్రేడ్స్‌ను ఉత్సాహపరుస్తున్నాడు సోమారు దాదా. ఇటు తిరిగి, "ఎంతమంది దాదా మీరు?" అని అడుగుతున్నాడు.

అది దళం డేరాలా, ఆయన ఊరి నుండి వచ్చిన మనిషిలా లేదు, అది ఆయన ఇల్లు, వాళ్లు ఆయన అతిథులన్నట్టుగా వుంది. తాత మనవళ్లకో, తండ్రి పిల్లలకో పని చెప్తున్నట్టుగా ఉంది. దండకారణ్యంలోని ఎన్నో గ్రామాల్లో అత్యంత సహజంగా కనిపించే దృశ్యాల్లో ఇదొకటి. పార్టీ, పిఎల్‌జిఎ అంటే ఒకటే కుటుంబం అన్నట్టే భావిస్తారు చాలామంది ప్రజలు.

"పన్నెండుమంది," సమాధానం చెప్పాడు సుక్కు.

"ఆహా, ఒకరు తక్కువ. రాజేష్ కి జ్వరం వచ్చింది, డాక్టర్ పాలు విడిగా కలుపుతున్నది," అన్నాడు పూసు.

వంట డ్యూటీ చేస్తున్న మంగ్లి, "ఇంగో," అని డికాషన్ కోసం గిన్నెలో నీళ్లు పోసింది.

కాళ్లు, చేతులు కడుక్కుని వచ్చేవరకూ గరం, గరం డికాషన్ తయారుగా వుండడంతో మగ్గుల్లో నింపుకున్నారు పూసు, సుక్కు. చాయ్ మిగలడంతో తన మగ్గులో పోసి సోమారు దాదాకి అందించింది మంగ్లి, ఆయన వద్దంటున్నా వినకుండా. "ఏం కాదులే, చలికాలం కదా తాగు," అంటూ.

"దాదా, రా మా డేరాకు పోదాం," అని సోమారు దాదాను లేవదీశాడు పూసు.

"సుక్కూ! దాదా తాగాక నా మగ్గు మర్చిపోకు, తెచ్చివ్వు," అని కేకేసింది మంగ్లి.

"ఇంగో." సుక్కూ, పూసూ ఇద్దరూ ఒకేసారి అన్నారు.

డేరా అంటే తమకు కవర్ చూపిన జాగానే. ఆ దగ్గర్లో జిల్లీ పరుచుకున్నారు. ఎలాగూ తిని రాత్రికి నడిచేదే కనుక పడుకునే జాగా చేసుకునేది లేదు.

"బుద్రి దీదీ ఎట్లుంది? నువ్వెట్ల వున్నవు? ఆరోగ్యం ఎట్లుంది?" కుశల ప్రశ్నలు వేశాడు పూసు.

"మంచిగనే ఉన్నం. నాకు రాత్రి కండ్లు మంచిగా అవుపడుతలేవు."

"అరే, అట్లనా. మన డాక్టర్ ఈమధ్య కండ్లు పరీక్ష చేసి అద్దాలు రాస్తున్నాడు. కానీ ఆయన ఈ ఏరియాలో లేడిప్పుడు. ఎప్పుడు వస్తడో కనుక్కుంటాను. నీ గురించి చెప్తాను, చూపించుకుని అద్దాలు రాసిస్తే వాడు. కానీ ఎన్నడు ఇటు వస్తడో, చాలా ఆలస్యం కావచ్చేమో..."

"ఏం లేనిదానికంటే మంచిదే కదా."

"ఆయన వస్తే దీదీకి కూడా చూపించు ఒకటేసారి."

సోమారు తలూపాడు. ఇలాగే కొన్ని పలకరింపు మాటలు అయ్యాక కొద్దిక్షణాలు మౌనం. అసలు విషయానికి రావడానికి ఆ క్షణాలు అవసరమయ్యాయి ఇద్దరికీ.

"రైను ఏం చేస్తున్నడు దాదా? ఎట్లున్నడు?" చివరకు అడిగాడు పూసు మౌనాన్ని వీడుతూ.

"మనోల్లు చెప్పినట్టే మళ్లీ మిలీషియాలో చేస్తున్నడు. ఇంట్లో కూడా మంచిగనే ఉంటున్నడు, పనులు చేస్తున్నడు. కొద్దిగా ముందు వచ్చి వుంటే కలుస్తుంటివి. ఇందాకే ఊరు బయట సెంట్రీ కోసం వెళిపోయారు వాళ్ల టీం అంతా."

ఆయన మాటల భావానికీ, ఆయన గొంతులో పలుకుతున్న భావానికీ వున్న తేడా స్పష్టంగా కనిపిస్తూనే ఉంది. ఆయన గొంతు నిండా నిరాశ. నిరాశ ఒక్కటే అయితే పూసుకు ఆశ్చర్యం కలుగకపోవు, ఒకలాంటి అపరాధ భావన కూడా కనిపిస్తోంది అందులో.

ఆయన తనను ఏమన్నా వివరణ అడుగుతాడేమో, తన మీద నిష్టూరంగా మాట్లాడతాడేమో, తనను ప్రశ్నిస్తాడేమో లేదా కోపగించుకుంటాడేమో అనుకుంటూ వుండిన పూసు ఊహకు ఇది అందరాకుండా వుంది.

ఇంతలో రైమతి అక్కడకు రావడంతో ఇద్దరినీ పరిచయం చేశాడు పూసు. మామూలుగా అయితే ఏరియాకు కొత్తగా ఏ పైకమిటీ కామ్రేడ్ వచ్చినా అత్యంత ఉత్సాహంగా వారిని పరిచయం చేసుకునేవాడు సోమారు దాదా. ఆయన అనుభవం రీత్యా వాళ్లూ ఆయనతో కాసేపు కూచుని ఆయన కాలంనాటి పోరాట, ఉద్యమ వివరాలు అడిగితే చాలా సంతోషంగా అవన్నీ చెప్పేవాడు. కానీ ఇవాళ ఆయనలో ఆ ఉత్సాహం కనిపించడం లేదు. ఇది పూసు మనసును మెలి తిప్పుతోంది.

"దాదా, రైను విషయం ఎట్ల అయ్యింది అంతా..."

"ఆ, మనోల్లు అంతా చెప్పిన్రు. ఎంతో ఎదుగుతడని అనుకున్న. తప్పు ఒప్పుకున్నాక అయినా పార్టీలోనే వుంటే బాగుండేది. ఇంటికే వచ్చేసిండు."

ఆయన నిరాశ తనకూ భరింపశక్యం కాకుండా తోచిందేమో రైమతి కలిగించుకుని, "మిలీషియాలో పని చేస్తూ మళ్లీ రావద్దనేదేం లేదు దాదా, అట్ల వచ్చినోల్లూ వున్నరు," అన్నది ఊరట ఇవ్వాలన్నట్టుగా.

సోమారు దాదా చిన్నగా తలూపాడు, మర్యాదకు ఊపినట్టుగా. కానీ ఆయనకు అలా జరుగుతుందని అంత నమ్మకమేం లేదనేది స్పష్టమే. అదో సుదూర అవకాశం, అంతే. వెంటనే జరిగేదీ తను చూడబొయ్యేదీ ఏం కాదు. అలా చూడగలిగేది ఏంటనేది ఆయన ఆలోచన.

తను కొట్టిన విషయం దాదా ఎత్తకుండా తనెలా ఎత్తాలో పూసుకు అర్థం కావడం లేదు. ఆయన ఆ విషయాన్ని పెద్దగా పట్టించుకోవడం లేదనేది స్పష్టమే. తనూ వదిలేస్తే మంచిదా లేక ప్రస్తావించాలా అనే సందేహంలో పడ్డాడు పూసు.

'ఊహు, ఎలా వదిలేస్తాడు, తన ఆత్మవిమర్శ ఆయనకు నేరుగా చెప్తేగానీ తనకు ఊరట కలగదు.'

రైను విషయం వారి మధ్య నుండి తొలగకుండా తను వేరే విషయాలు ఏం మాట్లాడే స్థితి లేదు కనుక రైమతీ సంభాషణను ఎటూ తిప్పలేక ఊరుకుంది. చివరకు సోమారు దాదే,

"రైను వచ్చి ఆరు నెలలవుతుంది, నువ్వు వస్తవనే చూస్తుండిన..." అన్నాడు పూసుతో.

"నీకు తెలుసు కదా దాదా మన పనులు, నాకూ నిన్ను కలవాలనే వుండె..." గొంతులో ఏదో ఉండలా అడ్డు పడ్డట్టయ్యింది పూసుకు.

"నాకు వయసు అయిపోయింది, రైను వున్నాడు పార్టీలో పని చేయడానికి అనే ఆలోచన చేసిన ఇన్ని రోజులూ. కానీ రైను తిరిగి వచ్చిన కాన్నుంచి నేను తప్పు చేసిన్ననిపిస్తుంది. ముందు అసలు నేనే భర్తీ కావల్సింది అనిపిస్తుంది. పూసూ, నేను భర్తీ అయిత, నన్ను తీసుకుంటరా? నా పార్టీ సభ్యత్వం ఎలాగూ ఉన్నది. నేను చేయగలిగిన పని ఏదున్నా చెప్పండి, చేస్త. బుద్రితో కూడా మాట్లాడిన."

ఏమాత్రం ఊహించకుండా ఆకాశం నుండి ఊడిపడ్డట్టుగా వచ్చిన ఆ ప్రతిపాదన పూసునూ, రైమతినీ నిర్ఘాంతపోయేలా చేసింది. 'బుద్రి దీదీతో కూడా మాట్లాడా? అంటే అంత సీరియస్ ప్రతిపాదనా ఇది?' ఇద్దరి మనసుల్లోనూ ఇవే ప్రశ్నలు పొడసూపాయి.

సోమారు దాదా మాత్రం ఆత్రుతగా చూస్తున్నడు. అంతసేపూ తన ఆత్మవిమర్శను ఎలా మాటల్లోకి తీసుకొచ్చి చెప్పాలా అనేదే ఆలోచిస్తున్న పూసుకు నిజానికి ఈ విషయం ఇంకడానికే సమయం పట్టింది. ఉలుకూ, పలుకూ లేకుండా చూస్తున్నాడు. అతని పరిస్థితి గమనించి చివరకు రైమతే,

"దాదా, నువ్వు ఊర్లో వుండి జనతన సర్కారుకు అండగా వుండడం కూడా తక్కువ పనేం కాదు. నీ తరం వాళ్ల అనుభవం తర్వాతి వాళ్లకు చాలా అవసరం. దళంలోకే రావాలని ఏం లేదు. నీ కాలంలో చేసే పనులన్నీ చేసినవ్. అదేం తక్కువ కాదు. రైను ఒక్కడే కాదు కదా, చూడు ఇక్కడున్న దళ కామ్రేడ్స్, మన సర్కారు, ప్రజాసంఘాల కార్యకర్తలందరూ నీ పిల్లల్లాంటివాళ్లే, వాళ్లకు నీ అనుభవం అంతా చెప్పాలి, పార్టీని, లడాయిని ఎలా, ఎందుకు గట్టిగా పట్టుకుని వుండాలో వాళ్లకు నీలాంటి వాళ్లు నేర్పాలి, చాలా పెద్ద పని అది," అంది అనునయంగా.

రైమతి ఒప్పుకోదని అర్థమైనట్టుగా పూర్తిగా పూసుకేసి తిరిగాడు సోమారు దాదా.

"పూసూ, మనోళ్లకు చెప్పు నన్ను భర్తీ చేసుకోమని. ఏ పనైనా చేస్త, ఎక్కడకు పోవాల్నన్నా పోత. నారన్న ఎక్కడున్నడు? ఆయనకు చెప్పు, ఆయన నన్ను మొదట్నుండి చూస్తుండు, ఒప్పుకుంటడు," ప్రాధేయపడుతున్నాడు సోమారు దాదా.

అప్పటికి చలనం కలిగి పూసు, "కాదు దాదా, రైను అట్ల చేసిండని నువ్వు వ్యక్తిగతంగా తీసుకోకు..." అని కొనసాగించేలోగానే పూసును పూర్తి చేయనీయకుండా సోమారు దాదా, "లేదు, లేదు, అట్ల కాదు, దానితో సంబంధం లేకుండానే ఆలోసించిన. మీలాగ ఉరికురికి పనులు చేయలేకుంటే మానె, నేను చేయగలిగే పని ఏదో ఒకటి ఉంటది కదా, మీరు నాయకులు, ఆలోసించి చెప్పుని. రీనా దీదీ ఎక్కడుంది? ఆమెకు కూడా నేను బాగా తెలుసు, ఆమెకు చెప్తే తప్పక తీసుకుంటది నన్ను...."

సోమారు గొంతు వణుకుతోంది. చూస్తూండగానే ఆయన కండ్ల నుండి కన్నీళ్లు ఉబికి వచ్చి చెంపల మీదుగా కారాయి.

అన్ని రోజులుగా పూసు దేన్ని ఎదుర్కోవడానికి మానసికంగా సిద్ధపడుతుండినాడో ఆ తయారీ అంతా క్షణాల్లో ఎందుకూ కొరగానిదిగా మారిపోయింది. వివరణగా చెప్పాలనుకున్నవన్నీ? మాటలు. ఉత్త మాటలు తప్ప ఏం కావు. వాటికి ఇప్పుడు ఒక్క పైసా కూడా విలువ లేదు. సోమారు దాదా అంతా తలకిందులు చేసేశాడు. సోమారు దాదా అంతా అల్లకల్లోలం చేసేస్తున్నాడు.

పూసు మెల్లగా లేచి దాదా పక్కనే కూచుని ఆయన్ని దగ్గరగా పొదువుకున్నాడు. ఓదార్పు ఎప్పుడూ చేసేలాగే మరిన్ని కన్నీళ్లకు దారి తీస్తోంది. అవి పూసు అంతరంగంలోని ఎక్కడెక్కడి మూలల్నో తడిమి అక్కడ మిగిలిపోయిన కల్మషాలన్నిటినీ వెతికి వెతికి కడిగేస్తున్నాయి.

పూసు కళ్లూ చెమరుస్తున్నాయి. నిండుతున్న కళ్లలోంచే రైమతికేసి చూశాడు. ఆమె తనలా ఆపుకునే ప్రయత్నం చేస్తున్న దాఖలాలు అతనికేం అవుపడలేదు.

---

(6వ పేజీ తరువాత...)

ప్రమాదం కలిగించే అవకాశం ఉందని అందుచేత వాళ్ళని మూసెయ్యండి. బయట ఉంటే కలుషితమైన గాలి, అధికారమూ భ్రష్టుపడతాయి అని గుండెలు బాదుకొని మొరపెట్టుకొంటే, అక్కడి కోర్టువారు కడుపు నిండా విషమూ, నోటి నిండా బూతులూ, చేతిలో తుపాకీ, ఒళ్ళంతా అహంకారం నిండిన వాళ్ళే. నిస్సహాయులుగా, నిర్వీర్యులుగా నిలబడి వేడుకొంటుంటే, ఉపేక్షించి లాభం లేదు అనుకొని మన వాళ్ళని జైల్లోకి తోసేసారు. సత్యం అనేది హృదయానికి తెలుస్తుంది. కళ్ళకి కనిపించకపోవచ్చు, చెవులకి వినిపించకపోవచ్చు. అక్కడి కోర్టు చట్టబద్ధులై, న్యాయాన్యాయాల సంగతి తరువాత తేలుద్దాం. ముందు తమ ముందున్న నిందితుల్ని లోపలికి తొయ్యడం తక్షణ కర్తవ్యం అనుకొని ఉండవచ్చు కానీ ప్రతినిత్యం మన కళ్ళముందు కనిపిస్తూ న్యాయదేవత ముందు న్యాయం కోసం వాదిస్తున్న మన చిక్కుడు ప్రభాకర్, బల్ల రవీందర్లు పొరుగు రాష్ట్ర పోలీసులకి ప్రమాదకరంగా కనిపిస్తే కనిపించవచ్చు. కానీ ఈ రాష్ట్ర పోలీసులు వాళ్ళని ఎక్కడ పట్టుకొని ఆ రాష్ట్ర పోలీసులకి అప్పగించడం అక్కడి పోలీసులు వాళ్ళని నేరస్తులనడం పచ్చి అబద్ధం అనిపించడం లేదా. న్యాయదేవత కళ్ళకి గంతలు కట్టవచ్చును. కానీ సత్యాన్ని గ్రహించే హృదయానికి గంతలు కట్టడానికి వీల్లేదు.

సత్యాన్ని చూడ్డానికి తమరు నిరాకరిస్తే ప్రజాస్వామ్యం మీద విశ్వాసం ఉన్న వాళ్ళంతా అంధకారంలో మునిగిపోతారు.

అయినా నాకు తెలవక నన్ను నేనొక ప్రశ్న అడుగుతున్నాను.

మావోయిస్టులు కావడం, వారికి అనుయాయులు కావడం, వారికి సానుభూతి తెలపడం నేరం అంటున్న చట్టాలు, అసలు మావోయిజం అంటే ఏమిటన్నది ఎక్కడా నిర్వచించలేదు. దెయ్యమంటే ఏమిటో చెప్పకుండా దెయ్యాన్ని చూసి జడుసుకోమన్నట్టుగా ఉన్నాయి మన చట్టాలు.

మావోయిస్టుల మీద జరిగిన ఘాతుకాన్ని తెల్సుకోవడానికి సత్యశోధకులుగా వెళ్ళాలనుకోవడం నేరమైతే సత్యాన్వేషణలో భాగంగా మనని కూడా అరెస్ట్ చేసి కేసులు పెట్టి దోషులుగా నిలబెట్టొచ్చు.

అందుచేత మనని మనం కాపాడుకోవడానికైనా, ఈ రాష్ట్ర పోలీసులు మన బల్ల రవీందర్నీ, మన చిక్కుడు ప్రభాకర్నీ, దుడ్డు ప్రభాకర్నీ, దుర్గా ప్రసాద్నీ, మన విద్యార్థులనీ అరెస్ట్ చెయ్యడం చట్ట విరుద్ధమని ప్రకటించండి. అప్పుడు పరాయి రాష్ట్ర పోలీసులు వాళ్ళ మీద పెట్టిన కేసులు కూడా నిలవవు. అలా జరిగినప్పుడు వాళ్ళకి న్యాయం చేయడమే కాక మనని మనం ఉచ్చులోంచి బయట పడేసుకొన్న వాళ్ళమౌతాం. లేని పక్షంలో హత్యలకి ఎన్‌కౌంటర్లని పేరు పెట్టి నేరస్తులే న్యాయ నిర్ణేతలైనట్లుగా తమిళనాడు పోలీసులు నక్సలైట్లని డిఫెండ్ చేస్తున్న న్యాయవాదుల్ని అరెస్ట్ చేసి, న్యాయవాదులు కూడా వాళ్ళే అయినట్లుగా, ఇక్కడ కూడా న్యాయవాదులూ, న్యాయనిర్ణేతలూ వాళ్ళే అవుతారన్న భయం మాకుంది.

**- నందిగం కృష్ణారావ్, న్యాయవాది**

# ప్రజలపై యుద్ధం

● దుడ్డు ప్రభాకర్

2016 అక్టోబర్ 24 నుండి మూడు రోజుల పాటు ఒడిషాలోని మల్కాన్‌గిరి జిల్లా రామగూడ, బెజ్జంకి అటవీ ప్రాంతాలలో జరిగిన నరమేధంలో 31 మంది (9 మంది ఆదివాసీ పౌరులతో సహా) మావోయిస్టులు మరణించారు. అందుకు నిరసనగా వివిధ వామపక్షాలు, ప్రజాసంఘాలు, హక్కుల సంఘాలు ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని జిల్లా కేంద్రాలలో ధర్నాలు, నిరసన సభలు నిర్వహించాయి.

ఆ మాత్రం నిరసనను కూడా సహించలేని ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు పోలీసుల ద్వారా "మావోయిస్టు బాధితుల సంఘం" పేరుతో కౌంటర్ ధర్నాలు, ర్యాలీలు చేయించి తీవ్ర ఉద్రిక్తతలు సృష్టించారు. ఆ ధర్నా, ర్యాలీలలో మావోలవే ప్రాణాలా? మావి కాదా? అని బ్యానర్లు రాయించి నినాదాలిస్తూ ప్రజాసంఘాల ధర్నాలపై దాడి చేసేంతగా ఆగ్రహాన్ని ప్రదర్శించారు. మీడియా సాక్షిగా ఆయా జిల్లాలలో జిల్లా స్థాయి అధికారులు దగ్గరుండి ఆ కార్యక్రమాల్ని నడిపించారు.

గతంలో నక్సలైట్లు పోలీసు అధికారులనో, రాజకీయ నాయకులనో చంపితే అందుకు ప్రతీకారంగా పోలీసులు, ప్రభుత్వంచే ఏర్పాటు చేయబడిన ప్రైవేట్ హంతక ముఠాలు పౌరహక్కుల సంఘాల నాయకులను, ప్రజా సంఘాల నాయకులను హత్యలు చేసేవి. వారిపై భౌతిక దాడులు చేసేవారు. వారి ఇళ్ళపై బాంబులు వేశారు. వారిని త్వరలో చంపుతాయని కుటుంబ సభ్యులకు ఫోన్‌లు చేసి తీవ్ర భయాందోళనకు గురిచేసేవారు. కానీ ఇప్పుడు సందర్భం అందుకు భిన్నంగా ఉంది. పోలీసులే 31 మంది నక్సలైట్లను చంపారు. చంపి కూడా ఆందోళనలు, ధర్నాలు చేస్తున్నారు. ఈ హత్యలకు సంబంధించి చంద్రబాబు ప్రభుత్వం పోలీసుల చేత చేయిస్తున్న ఆందోళనా కార్యక్రమాలు, ఆ సందర్భంగా వాళ్ళు చేస్తున్న నినాదాలకు పరిమితమై ప్రస్తుతం చర్చించుకుందాం.

## అమానవీయ, అనైతిక చర్యలు :

మేం పౌరులం కాదా? మాకు హక్కులు లేవా? మావి ప్రాణాలు కావా? అని చంద్రబాబు పోలీసుల చేత పలికిస్తున్న పలుకులు కనీసం నైతిక అర్హత కూడా లేనివి. నాలుగు రోజులు ఆంధ్రా ఒడిషా బార్డర్ పరిధిలో ఆంధ్ర గ్రేహౌండ్స్ కొనసాగించిన వేటలో 31 మంది మనుషులు అత్యంత క్రూరంగా చిత్రహింసలకు గురై హత్యచేయబడితే ఆ మాంసపు ముద్దల్ని కుటుంబ సభ్యులు ఇళ్ళకు తెచ్చుకున్నారు. (కొందరు పోలీసుల వేధింపులకు భయపడి వెళ్ళలేదు) ఆ మాంసపు ముద్దల్ని ముందు పెట్టుకొని ఏడ్చుకుంటూ వాటిని స్మశానానికి మోసుకెళుతున్న సందర్భంలో పోలీసులు కౌంటర్ ర్యాలీలు చెయ్యడం అమానవీయం. 27.10.2016న మున్నా భౌతికకాయం ప్రకాశం జిల్లా ఆలకూరపాడు చేరుకుంది. వేలాది మంది ప్రజలు విగతజీవుడైన ఆ పసివాడ్ని చూసి కన్నీరు మున్నీరయ్యారు. అదే సమయంలో పోలీసులు తెలుగుదేశం కార్యకర్తలు దాదాపు 500 మంది మావోయిస్టుల బాధితుల సంఘం పేరుతో ఒంగోలు పట్టణంలోని బైపాస్ రోడ్ దగ్గర నుండి కలెక్టర్ కార్యాలయం వరకు సుమారు మూడు కిలోమీటర్లు ర్యాలీ తీశారు. ఆ ర్యాలీలో "మావోలవేనా ప్రాణాలు, మావి కావా? మావోయిస్టులు నశించాలి. పోలీసులే దేశభక్తులు" అంటూ నినాదాలిచ్చారు. ఇలాంటి హేయమైన చర్య మానవత్వానికే మాయని మచ్చని ప్రజలు అసహ్యించుకున్నారు. ఒకర్ని ఒకరు చంపుకునే దోపిడీ పాలకులు, రౌడీ గ్యాంగులు, గూండాలు, ఫ్యాక్షనిస్టులు కూడా ఇలా వ్యవహరించిన సందర్భం ఇంత వరకూ లేదు. వారి హత్యలు జరిగినపుడు హంతకులు ఎంతటి భయంకరులైనా హతుల బంధువుల శవాలను ఊరేగించుకొంటుంటే ఎప్పుడూ, ఎక్కడా ఇలాంటి ర్యాలీలు చెయ్యలేదు. హత్యచేసిన వారిని అరెస్టు చెయ్యాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తుంటే ఎవ్వరూ జోక్యం చేసుకోలేదు. "మా వారు చనిపోయినపుడు మీరెందు ఏడవలేదు. మేం చేసే ఊరేగింపుల్లో మీరెందుకు పాల్గొనలేదు" అని హతుని బంధువుల్ని ప్రశ్నించలేదు. ఎందుకంటే వీళ్ళ పగ కుటుంబ సభ్యుల మీద కాదు. వీళ్ళకు ఎదురుపడిన వాళ్ళమీద. కానీ బెజ్జంగి హత్యాకాండ సందర్భంగా ప్రజల కోసం ప్రాణాలు బలిచ్చిన (పోలీసుల దృష్టిలో హంతకులు కావచ్చు) వారి కుటుంబ సభ్యుల పట్ల ఫ్యాక్షనిస్టులు, గూండాగ్యాంగుల కంటే దారుణంగా పోలీసులు వ్యవహరించారు. ఇప్పటి దాకా ఈ దేశ సామాజిక, ఆర్థిక, రాజకీయ సమస్యను నక్సలైట్లు, పోలీసులకు మధ్య ఘర్షణగా చిత్రీకరించిన పాలకులు 'బెజ్జంకి' తర్వాత నక్సలైట్ కుటుంబాలు, పోలీసు కుటుంబాల మధ్య ఘర్షణగా చిత్రీకరించే ప్రయత్నం చేశారు. ఇది సాల్వాజుడుం ఏర్పాటు కంటే తీవ్రమైన పరిణామం. మానవ జాతి చరిత్రలోనే మొట్టమొదటిసారిగా చంద్రబాబునాయుడు శవాలను అడ్డుపెట్టుకుని ప్రజల మధ్య తీవ్రస్థాయిలో విద్వేషాలను రెచ్చగొట్టే సరికొత్త అధ్యాయాన్ని లిఖిస్తున్నాడు.

## అందరివీ ప్రాణాలే-అందరికీ హక్కులుండాలి :

ఈ ప్రజాస్వామిక వ్యవస్థలో పౌరులందరికీ (పోలీసులు, వారి కుటుంబ సభ్యులతో సహా) సమాన హక్కులుండాలని హక్కుల సంఘాలు, ప్రజా సంఘాలు, ప్రజాస్వామిక వాదులు పోరాడుతున్నారు. హక్కులు హరించి వేయబడుతున్న ప్రజల పక్షాన నిలబడి మాట్లాడుతున్నారు. పౌరులందరికీ రాజ్యాంగం, చట్టాలు కల్పించిన హక్కులు అమలు చెయ్యాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తున్నారు. దళితులపై, మహిళలపై, మత మైనారిటీలపై హత్యాకాండలు జరిగినపుడు, అదే విధంగా పోలీసులు నక్సలైట్లను చంపినపుడు కూడా ఆ ఎన్‌కౌంటర్ పేరిట జరిగిన హత్యాకాండల్లో పాల్గొన్న పోలీసులపై చట్టపరమైన చర్యలు తీసుకోవాలని అంటున్నారు. 302 కేసు రిజిస్టర్ చేసి కోర్టుకు హాజరు పరచాలని అడుగుతున్నారు. ఆత్మరక్షణ కోసం జరిపిన కాల్పుల్లో నక్సలైట్లు చనిపోయారనే పోలీసుల వాదన కోర్టుముందు రుజువుపరచు కోవాలని, ఈ దేశ అత్యున్నత న్యాయస్థానం చెబుతుంది కాబట్టి, న్యాయవ్యవస్థ మీద పాలకులకు, పోలీసులకు విశ్వాసముందని ప్రజల్ని నమ్మించడానికైనా సుప్రీంకోర్టు ఆదేశాలు అమలు చెయ్యాలి. ఎవ్వరైనా పౌరులు హత్యకు గురయితే శవపంచనామా దగ్గర నుండి శవాన్ని బంధువులకప్పగించే వరకు పోలీసులు ఏ విధంగా వ్యవహరించాలో స్పష్టమైన కోర్టు ఆదేశాలున్నాయి. కానీ నిత్యం జరుగుతున్న లాకప్ హత్యలు. ఎన్‌కౌంటర్



పేరుతో జరుగుతున్న హత్యల్లో ఏ ఒక్క సందర్భంలోకూడా పోలీసులు కోర్టు ఆదేశాలు పాటించడం లేదు.

నక్సలైట్లు పోలీసులను హత్యచేస్తే ఈ హక్కుల సంఘాలు ఎందుకు ఖండించవని పోలీసులు తరచూ మాట్లాడుతూ ఉంటారు. హక్కుల సంఘాల వారు నక్సలైట్లు చేసే హత్యలను సమర్థిస్తున్నట్లుగా ప్రజల్లోకి తప్పుడు సంకేతాలు పంపి ప్రశ్నించే వాళ్ళ గొంతు నొక్కే ప్రయత్నంలో భాగంగా ఇలాంటి వాదనలు ముందుకు తెస్తున్నారు. నక్సలైట్లు పోలీసులను చంపితే పోలీసు అధికారులు, ప్రభుత్వం వెంటనే స్పందించి హత్యకు పాల్పడిన నక్సలైట్లపై 302తో పాటు అనేక సెక్షన్లు జతచేసి కేసు నమోదు చేస్తున్నారు. కాబట్టి హక్కుల సంఘాల వారికి నక్సలైట్లపై కేసు రిజిష్టర్ చెయ్యమని అడిగే అవకాశం ఉండదు. చంపే హక్కు ఎవ్వరికీ లేదు. ఆ విధంగా ఎవరైనా (నక్సలైట్లయినా) సరే చట్టాన్ని చేతుల్లోకి తీసుకొని హత్యలు చేస్తే పోలీసులు వారిని అరెస్టు చేసి కోర్టు ముందు హాజరు పరచాలి. చట్టాన్ని రక్షించే బాధ్యతల్లో ఉండి వేలకు వేలు జీతాలు తీసుకుంటూన్న పోలీసులు చట్టాన్ని ఉల్లంఘించడం నేరం. చట్టాన్ని అమలు చెయ్యండి, కోర్టులను, రాజ్యాంగాన్ని గౌరవించండి అని అడగటమంటే నక్సలైట్లను సమర్థించడం కాదు. పోలీసులకు హక్కులు లేవనీ కాదు. పోలీసులు మరణించాలని కోరుకోవడం అంతకన్నా కాదు. పోలీసులు "మేం పౌరులం కాదా" అని పదే పదే ప్రశ్నిస్తున్నారు. వారు పౌరులు మాత్రమే కాదు. అంతకంటే ఎక్కువ. మొత్తం పౌరసమాజ హక్కులను కాపాడాల్సిన వారు కూడా. అందుకు గాను వారు వేల రూపాయలు ప్రజాధనాన్ని జీతాలుగా పొందుతున్నారు. మరణిస్తే అత్యంత గౌరవప్రదంగా వారి శవాలు కుటుంబ సభ్యులకు అప్పజెప్ప బడుతున్నాయి. 40 లక్షలకు పైగా నష్టపరిహారం, కుటుంబంలో ఒకరికి ప్రభుత్వ ఉద్యోగం ఇస్తున్నారు. పౌరహక్కుల్ని కాపాడవలసినవారు హక్కుల ఉల్లంఘనలు పాల్పడుతూ, హత్యలు చేస్తూ మేం పౌరులం కాదా, మాకు హక్కులు లేవా? అనడం హాస్యాస్పదంగా ఉంది. ఇదంతా ప్రభుత్వానికి, పోలీసులకు తెలియక ఆ ప్రశ్నలు వేయడం లేదు. పక్కా పథకం ప్రకారం సామాన్య ప్రజల్ని, మధ్య తరగతి బుద్ధి జీవులను గందరగోళానికి గురి చెయ్యడానికి పాలకులు ఆడుతున్న మైండ్ గేమ్.

## ప్రజల్ని సాయుధంగా అణచివేయాలనుకుంటున్నారు:

బెజ్జంగి మారణకాండ తర్వాత ఆంధ్రప్రదేశ్ డిజిపి సాంబశివరావు మీడియాతో మాట్లాడుతూ "మావోయిస్టులు ఆయుధాలు ధరించి తిరుగుతామంటే చట్టం చూస్తూ ఊరుకోదు. వారు ఆయుధాలు వదిలి ప్రజాస్వామ్య పద్ధతిలో పోరాడితే మాకు అభ్యంతరం లేదు. మావోయిస్టులు మాకు శత్రువులు కాదు" అని ప్రకటించారు. అప్పటి నుండి అనేక వాదనలు ముందుకు తెచ్చిన పోలీసులు తమ హంతక చర్యలకు ప్రజా ఆమోదం కూడగట్టుకొనే ప్రయత్నం చేశారు. కానీ పోలీసులు సాయుధ నక్సలైట్లను మాత్రమే చంపడం లేదు. సామ్రాజ్యవాద ప్రపంచీకరణ వేగవంతంగా విస్తరిస్తున్న క్రమంలో నిర్వాసితులౌతున్న ప్రజల తిరుగుబాటును అణచడానికి పాలకులకు ఆయుధమే పరిష్కారంగా కనపడుతున్నది. అగ్రకుల భూస్వామ్య పాలకులకు, సామ్రాజ్యవాదులకు, హిందూమతోన్మాదులకు వ్యతిరేకంగా ఆత్మగౌరవం కోసం, జీవించేహక్కు కోసం, బతుకుదెరువు కోసం ప్రజాస్వామ్య పద్ధతిలో పోరాడుతున్న ప్రజలందరి గుండెలపై తుపాకులెక్కుపెట్టబడుతున్నాయి. అందుకు ఉదాహరణలుగా కొన్ని సంఘటనలను మాత్రమే మీకు గుర్తు చేస్తాను.

చుండూరు హత్యాకాండలో పాల్గొన్న హంతకుల అరెస్టుకై చుండూరు దళితవాడలో శిబిరం ఏర్పాటు చేసి నిరాహారదీక్ష చేస్తున్న దళితులపై కాల్పులు జరిపి కొమ్మెర్ల అనిల్ కుమార్‌ను పోలీసులు కాల్చి చంపారు. శిబిరం చుండూరులో ఏర్పాటు చెయ్యడానికి వీల్లేదన్నారు. దాంతో చుండూరు దళితులందరూ గ్రామాన్ని వదిలి గుంటూరు చేరారు. 'చుండూరు' హంతకుల్ని అరెస్టు చెయ్యాలని డిమాండ్ చెయ్యడం అప్పటి ముఖ్యమంత్రి నేదురుమల్లి జనార్దన్ రెడ్డికి చంపదగ్గ నేరంగా అనిపించింది. పోలీసుల్ని పంపించి అనిల్‌ను చంపించారు. పెంచిన విద్యుత్ చార్జీలు తగ్గించమన్నందుకు హైదరాబాద్‌లోని బషీర్‌బాగ్‌లో విద్యుత్ ఉద్యమకారులపై కాల్పులు జరిగి ముగ్గుర్ని చంపారు. విద్యుత్ ఛార్జీలు తగ్గించమని డిమాండ్ చేస్తూ రోడ్డెక్కడం అప్పటి ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు సహించలేకపోయాడు. పోలీసుల ద్వారా కాల్పులు జరిపించి ఉద్యమాన్ని రక్తపు టేరుల్లోముంచారు. ఖమ్మం జిల్లా ముదిగొండలో గూడు కోసం చారెడు నేల ఇవ్వాలని నిరుపేదలు ప్రజాస్వామ్య పద్ధతిలో నిరసన వ్యక్తం చేస్తుంటే కాల్పులు జరిపి నడిరోడ్డు మీద ఎనిమిది మందిని బలి తీసుకున్నారు. వేలాది ఎకరాలు బహుళ జాతి కంపెనీలకు కట్టబెడుతున్న అప్పటి ముఖ్యమంత్రి రాజశేఖర్ రెడ్డికి గుడిసె వేసుకోవడానికి సెంటు నేలడిగిన కూలీలు విధ్వంసకారులుగా, సంఘ విద్రోహశక్తులుగా కనిపించారు. పై మూడు సంఘటనలలో ఎవ్వరి దగ్గరా ఆయుధాలు లేవు. వారు ప్రజాస్వామ్య పద్ధతిలోనే ఉద్యమిస్తున్నారు. మరి వారినెందుకు చంపాల్సి వచ్చిందో ఏపి డిజిపి సమాధానం చెప్పాలి. ప్రజలు కూడా ఆలోచించాలి.

అడవిని సామ్రాజ్యవాదులకు అమ్మడాన్ని వ్యతిరేకిస్తున్న ఆదివాసుల్ని అడవి నుండి తరిమేయడానికి వారిని ఆత్మన్యూనతకు గురిచేసే విధంగా వాకపల్లి, భల్లుగూడలో ఆదివాసీ మహిళలపై గ్రేహౌండ్స్ పోలీసులు సామూహిక అత్యాచారాలకు తెగబడ్డారు. అత్యాచారం చేసిన పోలీసులపై కనీసం ఎఫ్.ఐ.ఆర్. కూడా నమోదు కాలేదు. చైతన్యవంతమైన దళిత యువకులు గ్రామాలలోని అగ్రకులాధిపత్యాన్ని ప్రశ్నించినందుకు ప్రత్యక్షదాడులకు బలవ్వడమేకాకుండా, పోలీస్ స్టేషన్‌లలో లాకప్ హత్యలకు గురౌతున్నారు. దళిత చైతన్యాన్ని హతమార్చడానికి అగ్రకుల భూస్వాములకు పోలీస్ స్టేషన్‌లు వధశాలలుగా ఉపయోగపడుతున్నాయి. ప్రజల చైతన్యాన్ని, తిరుగుబాటు ధోరణిని ఆయుధం ద్వారా అణచడం పాలకుల ఏకైక మార్గంగా ఎంచుకున్నారు. అందుకే మూడవసారి ముఖ్యమంత్రిగా ప్రమాణం చేయడానికి కొన్ని గంటల ముందు చంద్రబాబునాయుడు నల్లమల అడవుల్లో ముగ్గురు చెంచులను కాల్చి చంపించారు. తన సొంత జిల్లా అయిన చిత్తూరులోని

## 11, 12 ఫిబ్రవరి 2017 ప్రొద్దుటూరులో జరిగిన విరసం సాహిత్య పాఠశాల దృశ్యాలు



అరసవిల్లి కృష్ణ, కిరణ్



బండి నారాయణ స్వామి




జయశ్రీ (ఎచ్.ఆర్.ఎఫ్.)



వరవరరావు











# విరసం సాహిత్య పాఠశాలలో పుస్తకావిష్కరణలు


మా తుఝె సలాం (శశికళ కథలు)
ఆవిష్కర్త: వెంకటకృష్ణ


ఆవాజ్ -మతం లేని లోకం కోసం
(పి.వరలక్ష్మి), ఆవిష్కర్త: దాదాహయత్


సాయంకాలం వానని (రివేరా కవిత్వం)
ఆవిష్కర్త: మహమూద్


వెన్నెలవనం(సూర్యచంద్ర కవిత్వం)
ఆవిష్కర్త: వరవరరావు


నక్సల్బరీ ఒక ఊరు మాత్రమే కాదు (చరిత్ర)
ఆవిష్కర్త: రాంకి


ప్రత్యేక తెలంగాణ-ప్రజాస్వామిక విశ్లేషణ,
ప్రత్యేక తెలంగాణ-ప్రజాస్వామిక దృక్పథం
ఆవిష్కర్త: కాశీం


పూలు రాలిన చోట (నాగేశ్వర్ కవిత్వం)
ఆవిష్కర్త: అరసవిల్లి కృష్ణ


బొల్షివీకరించడం పై కొన్ని వ్యాసాలు
ఆవిష్కర్త: రామచంద్రం


సాహిత్యంలో వస్తు రూప శిల్పాలు (చెంచయ్య)
ఆవిష్కర్త: శివరాత్రి సుధాకర్


మేమున్నాం (పాలమూరు అధ్యయన వేదిక),
ఆవిష్కర్త: మేడక యుగంధర్ రావు



30 Years of Dandakaranya Cultural
Revolution, ఆవిష్కర్త: అరవింద్


అభాగ్యజీవులు (ఎన్ రవి, అనూరాధ
అనువాదం), ఆవిష్కర్త: ఉదయమిత్ర

# విరసం సాహిత్య పాఠశాలలో పుస్తకావిష్కరణలు


కార్మిక వర్గ విప్లవం, విప్లవద్రోహి కౌట్స్కీ (నాగభూషణ్ అనువాదం), ఆవిష్కర్త: సి.ఎస్.ఆర్.ప్రసాద్


ఎర్రదుక్కి (ఎం. నారాయణ కథలు)
ఆవిష్కర్త: శశికళ


దోసెడు పల్లీలు (ఉదయమిత్ర కథలు)
ఆవిష్కర్త: పద్మకుమారి


Song of Furrows (ఇక్బాల్ కవిత్వం)
కాగుతున్న ఋతువు (కెక్యూబ్ వర్మ కవిత్వం)
ఆవిష్కర్త: కూర్మనాథ్


రాయలసీమ రాష్ట్రం (అరుణ్)
ఆవిష్కర్త: పెనుగొండ బాషా


గోరపిట్ట (సువర్ణముఖి కథలు)
ఆవిష్కర్త: కెక్యూబ్ వర్మ


మార్క్స్ పెట్టుబడి పరిచయం (పార్థసారథి అనువాదం), ఆవిష్కర్త: పెద్దికృష్ణ


పోస్టుమార్టం పోస్ట్ ట్రూత్ (వివి వ్యాసాలు)
ఆవిష్కర్త: పాణి


మలుపు తిప్పిన మహావిప్లవం (విలియం హింటన్, సి.ఎస్.ఆర్ అనువాదం), ఆవిష్కర్త: విక్రాంత్


రైతుల ఆత్మహత్యలన్నీ ప్రభుత్వ హత్యలే (రైతు సేవా సమితి), ఆవిష్కర్త: యోగానంద్


ఫాసిజం-బ్రాహ్మణీయ హిందూ ఫాసిజం
ఆవిష్కర్త: మల్లేశ్


బోల్షివిక్ పార్టీ చరిత్ర
ఆవిష్కర్త: మేఘరాజ్

34C

## 11, 12 ఫిబ్రవరి 2017 ప్రొద్దుటూరులో జరిగిన విరసం సాహిత్య పాఠశాల దృశ్యాలు




సి.ఎస్.ఆర్. ప్రసాద్



పి. వరలక్ష్మి



భాస్కర్




ఉజ్వల్



ప్రసాద్



ఎన్.వి.ఎస్. నాగభూషణ్



కాశీం



పాణి

**విశాఖ ఏజెన్సీ, ఒడిషా ప్రాంతంలో విస్తారంగా ఉన్న విలువైన బాక్సైట్ నిక్షేపాల్ని వెలికి తీసుకోవడానికి మన పాలకులు పెట్టుబడిదారులకు అనుమతులిచ్చారు. విశాఖ ఏజెన్సీలో ఉన్న ఆదివాసీలు బాక్సైట్ తవ్వకాన్ని వ్యతిరేకిస్తూ మావోయిస్టుల మద్దతుతో వీరోచిత పోరాటం చేస్తున్నారు. వారి పోరాటానికి టిడిపి, బిజెపి మినహా అన్ని పార్లమెంటరీ రాజకీయ పార్టీలు మద్దతు తెలియజేశాయి. దాంతో బెంబేలెత్తిన చంద్రబాబు ప్రభుత్వం బాక్సైట్ తవ్వకాల ఉత్తర్వులను తాత్కాలికంగా ఆపివేసింది. మావోయిస్టులను అంతం చేసి ఆదివాసుల్ని ఒంటరులను చేసి అడవి నుండి తరిమేసే పని పెట్టుకుంది. అందుకే బెజ్జంగి నరమేధాన్ని సృష్టించారు.**

శేషాచలం అడవుల్లో 20 మంది తమిళ కూలీలను పోలీసుల ద్వారా హత్య చేయించారు. వరంగల్ సెంట్రల్ జైలు నుండి కోర్టు వాయిదాకు హైదరాబాద్ తీసుకొస్తున్న వ్యానులోని వికారుద్దీన్‌తో సహా ఐదుగురు ముస్లిం యువకుల్ని కెసిఆర్ ప్రభుత్వం కాల్చి చంపింది. బిజెపి అధికారంలో ఉన్న మధ్యప్రదేశ్‌లోని భోపాల్‌లో అత్యంత పటిష్టమైన భద్రత కల్గిన సెంట్రల్ జైలు నుండి తప్పించుకు పోయినట్లు చెప్పబడుతున్న సిమి (స్టూడెంట్ ఇస్లామిక్ మూవ్‌మెంట్ ఆఫ్ ఇండియా)కి చెందిన 8 మంది నిరాయుధులైన యువకుల్ని కాల్చి చంపి వీడియో క్లిప్పింగ్‌లను మీడియాకు రిలీజ్ చేశారు. కాబట్టి ఆంధ్రప్రదేశ్ డిజిపి సాంబశివరావు చెబుతున్నట్లు కేవలం ఆయుధాలు ధరించిన మావోయిస్టులను మాత్రమే హత్యలు చేయడం లేదు. ప్రభుత్వ దోపిడీ విధానాలను వ్యతిరేకించిన అందరికీ తుపాకీ ద్వారానే సమాధానం చెప్పాలనకుంటున్నారు. ఇది కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల విధానంగా కొనసాగుతూ ఉంది.

గతంలో ఎవర్నైనా పోలీసులు ఎన్‌కౌంటర్‌లో చంపినప్పుడు ప్రాణరక్షణ కోసం ఎదురుకాల్పులు జరిపినట్టు, కాల్పుల్లో ప్రత్యర్థి వర్గం చనిపోయినట్లు కొంత సీన్ క్రియేట్ చేసేవారు. కానీ 2014లో బిజెపి కేంద్రంలో అధికారంలోకొచ్చిన తర్వాత సీన్ మారింది. శేషాచలం అడవుల్లో నిరాయుధులైన 20 మంది తమిళ కూలీలను చంపి వరుసగా పడుకోబెట్టి, గతంలో పట్టుబడి మార్క్ చేయబడ్డ ఎర్రచందనం దుంగల్ని వారి పక్కన పెట్టారు. వరంగల్‌లో హత్య చేయబడిన యువకుల కాళ్ళకు, చేతులకు కట్టివేయబడి ఉన్న గొలుసులను అలాగే ఉంచి మీడియాను ఆహ్వానించారు. భోపాల్‌లో నిరాయుధులైన 8 మంది ముస్లిం తీవ్రవాదులుగా చెప్పబడుతున్న వారిని కొండల మీదకు తీసుకెళ్ళి కాల్చి చంపి ఆ వీడియోను మీడియా వాళ్ళకు లీక్ చేశారు. అవన్నీ పోలీసులు చేసిన హత్యలేనని ప్రజలకు అర్థమయ్యేలా రాజ్యమే అలా వ్యవహరిస్తుంది. ఆ విధంగా చెయ్యడం నల్ల పాలకులకు రెండు ప్రయోజనాలున్నాయి. (1) ప్రజావ్యతిరేక ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా ఉద్యమిస్తే ఇలాగే చంపుతాం అని ప్రజలకు తెలియజేయడం ద్వారా వారిని భయభ్రాంతులకు గురిచెయ్యడం, (2) ఎంత మంది ప్రజల్నైనా హతమార్చి మీకు, మీ పెట్టుబడులకు, ఆస్తులకు రక్షణ కల్పిస్తామని సామ్రాజ్యవాదులకు నమ్మకం కల్గించడం.

## ప్రజల జీవన్మరణ పోరాటాలు :

"పోలీసులు అడవిలోని ఆదివాసుల్ని, వాళ్ళకు అండగా ఉన్న మావోయిస్టులను మాత్రమే చంపుతున్నారు. మైదాన ప్రాంతాలలో అలాంటి హత్యాకాండలు జరగడం లేదని మైదాన ప్రాంత ప్రజలు, మధ్య తరగతి బుద్ధిజీవులు అనుకొంటున్నారు. అది పొరపాటు. శ్రీకాకుళం జిల్లాలో పచ్చని పంట పొలాల్లో థర్మల్ పవర్ ప్లాంట్ కట్టుకోవడానికి మన పాలకులు పెట్టుబడిదారులకు అనుమతులిచ్చారు. ఆ ప్లాంట్‌ల కట్టడాన్ని అడ్డుకున్నందుకు కాకరపల్లి, సోంపేటలో ఆరుగురు నిరుపేద రైతు కూలీలను కాల్చి చంపారు. కాకరపల్లిలో థర్మల్ పవర్ ప్లాంట్ కట్టారు. సోంపేటలో తాత్కాలికంగా ఆపివేశారు. అభివృద్ధి పేరుతో అలాంటి విధ్వంసకర ప్రాజెక్టులు అనేకం మన రెండు రాష్ట్రాలలోకి రాబోతూ ఉన్నాయి. రెండు రాష్ట్రాల ముఖ్యమంత్రులు కాబోయే ముఖ్యమంత్రులుగా కీర్తించబడుతున్న వారి ఇద్దరు కొడుకులు దేశ దేశాలు తిరిగి పారిశ్రామిక వేత్తలను ఆహ్వానిస్తూ ఉన్నారు. ఒక్కొక్క రాష్ట్రంలో 10 నుండి 15 లక్షల ఎకరాల భూ బ్యాంక్ ఏర్పాటు చేశామని అనేక రాయితీలు ప్రకటించి మరీ స్వాగతం పలుకుతున్నారు. తద్వారా నిర్వాసితులు కాబోతున్న ప్రజలు మా భూములు మాక్కావాలి. మా నివాసాలు, మా ఊర్లు మేం ఖాళీ చెయ్యం అంటే ప్రభుత్వం తక్షణం చేసే పని ప్రజలపై ఆయుధాలు ఎక్కుపెట్టడమే. ఇప్పటికే ప్రజల వద్ద నుండి భూములు లాక్కోవడానికి చట్టాలు తయారు చేసిన వైనాన్ని (రాజధాని కోసం భూసేకరణ, సమీకరణ) ద్వారా మనం చూస్తూనే ఉన్నాం. భవిష్యత్‌లో మైదాన ప్రాంత ప్రజలందరూ ప్రభుత్వాలు ఎక్కడుండమంటే అక్కడ ఉండాలి (నివాసాలు కూడా ఏర్పాటు చేస్తారు) ఏ వృత్తిలో జీవించమంటే ఆ వృత్తితో బతకాలి (ఇప్పటికే ట్రైనింగ్ ప్రోగ్రాంలు నడుస్తున్నాయి) ఏ ఉద్యోగం చెయ్యమంటే ఆ ఉద్యోగం చెయ్యాలి. ఈ దేశ పాలకులు, సామ్రాజ్యవాదులు కలసి ఏర్పాటు చేయనున్న పునరావాస కేంద్రాలలో జీవించడానికి మైదాన ప్రాంత ప్రజల్ని మానసికంగా సిద్ధం చేస్తున్నారు. కానీ ఆదివాసులు అలా కాదు. అడవి తల్లి ఒడిని వదలి మైదాన ప్రాంతంలో జీవించలేరు. అందుకే ప్రభుత్వాలు చూపే పునరావాసాల్ని తిరస్కరిస్తున్నారు. అభివృద్ధి పేరుతో అడవిని ధ్వంసం చెయ్యడాన్ని అడ్డుకుంటున్నారు. ప్రభుత్వ సాయుధ బలగాల్ని పంపిస్తే ఆదివాసులు అంబులతో పాటు మావోయిస్టుల సహాయంతో ఎదుర్కొంటున్నారు. అందుకే అడవుల్లో నెత్తుటి ఏరులు పారుతున్నాయి. అయినా విశాఖలో బాక్సైట్ తవ్వకాలను ఆపగలిగారు.

## సామ్రాజ్యవాదుల సేవకుడిగా చంద్రబాబునాయుడు:

విశాఖ ఏజెన్సీ, ఒడిషా ప్రాంతంలో విస్తారంగా ఉన్న విలువైన బాక్సైట్ నిక్షేపాల్ని వెలికి తీసుకోవడానికి మన పాలకులు పెట్టుబడిదారులకు అనుమతులిచ్చారు. విశాఖ ఏజెన్సీలో ఉన్న ఆదివాసీలు బాక్సైట్ తవ్వకాన్ని వ్యతిరేకిస్తూ మావోయిస్టుల మద్దతుతో వీరోచిత పోరాటం చేస్తున్నారు. వారి పోరాటానికి టిడిపి, బిజెపి మినహా అన్ని పార్లమెంటరీ రాజకీయ పార్టీలు మద్దతు తెలియజేశాయి. దాంతో బెంబేలెత్తిన చంద్రబాబు ప్రభుత్వం బాక్సైట్ తవ్వకాల ఉత్తర్వులను తాత్కాలికంగా ఆపివేసింది. మావోయిస్టులను అంతం చేసి ఆదివాసుల్ని ఒంటరులను చేసి అడవి నుండి తరిమేసే పని పెట్టుకుంది. అందుకే బెజ్జంగి నరమేధాన్ని సృష్టించారు. ఒడిషాలోని మల్కాన్‌గిరిలో జరిగిన హత్యాకాండకు మేమే బాధ్యులమని డిజిపి ద్వారా ప్రకటింపజేసి ఆదివాసులను భయాందోళనలకు గురిచేసి, బలవంతంగా అడవి నుండి పునరావాస కేంద్రాలకు తరలించి, బాక్సైట్ తవ్వకాలు ప్రారంభించాలని చంద్రబాబు ఉవ్విళ్ళూరుతున్నారు. భారత పాలక వర్గాలు ఈ దేశాన్ని, దేశ సంపదను సామ్రాజ్యవాదులకు దోచిపెట్టడం కోసమే ప్రజలపై యుద్ధం ప్రకటించాయి. అగ్రకుల భూస్వాములు, సామ్రాజ్యవాదులు, హిందూమతోన్మాదులు వారి సాయుధబలగాలు ఒకవైపు, వారి దోపిడీ, పీడనలకు వ్యతిరేకంగా జీవన్మరణ పోరాటాలకు సిద్ధమౌతున్న ప్రజలు మరోవైపు ఉన్నారు. ప్రజాస్వామ్యాన్ని, రాజ్యాంగ చట్టాలను తుంగలో తొక్కి పీడక వర్గం ఉమ్మడిగా ప్రజలపై యుద్ధం ప్రకటించిన ఈ క్లిష్ట పరిస్థితుల్లో నిర్వాసితులౌతున్న ప్రజలకు ఏ మేరకు ఉపయోగపడితే ఆ మేరకు సాయమందించడం మనందరి కర్తవ్యం కావాలి.



సంస్మరణ వ్యాసం

# అరుదైన విప్లవ జీవితం

• గౌరవ్



నా జీవితంలో చాలా మంది విప్లవకారుల్ని చూసాను. విప్లవాన్ని పుస్తకాల్లో భద్రపరుచుకున్నవాళ్ళూ, విప్లవాన్ని సమావేశ వేదికల పైకి ఎక్కించిన వాళ్ళూ, విప్లవాన్ని జాగ్రత్తగా తలలో పెట్టుకుని తర్కించినవాళ్ళూ... కానీ విప్లవాన్ని జీవితాంతం ప్రతీ క్షణం ఆచరించినవాళ్ళూ, దానిని ఆస్వాదించినవాళ్ళూ అరుదు. అందులో ఒకరు చంద్రగిరి సాంబశివరావు గారు. పుచ్చిపోయిన సమాజాన్ని సమూలంగా మార్చడానికి తన పరిమితికి మించి పరితపించిన వ్యక్తి. అందుకే అంశం అదేదయినా కూడా చాల సరళంగా సూటిగా తన భావాల్ని వెల్లడించేవారు. సాంప్రదాయ మార్క్సిస్టుల్ని నేను కసిదీరా విమర్శిస్తున్న రోజుల్లో ఎస్.ఎస్.ఆర్. పరిచయం. అప్పటికే సాయుధ పోరాటంలోనూ, సాంఘిక ప్రక్షాళనలోనూ అయన అనుభవాలు అపారం.

నిజానికి విరసంలోనే కాదు. ఇతర నాస్తిక, హేతువాద, హక్కుల ప్రజాసంఘాల్లో సైతం అప్పటికే ఆయన ముద్ర ప్రత్యేకంగా కనిపించేది. చార్వాకాశ్రమం సుధాకర్ గారు-ఏం చెప్పారో తెలీదుగానే అకస్మాత్తుగా వోరోజు ఫోన్ చేసి ఎస్.ఎస్.ఆర్. తనని తాను పరిచయం చేసుంటూ నేను 498 ఎ మీద రాసిన వ్యాసం గురించి చెప్పి మెచ్చుకున్నారు. అలాగే అస్తిత్వం - అరాజకత్వం, చలం వ్యాసంకి నే చేసిన అనువాదం గూర్చి ఫోన్లోనే వివరంగా విశ్లేషిస్తుంటే నాకు నోట మాట రాలేదు. అరాజకత్వంని స్టైలిష్‌గా ఫాలో అయిన రోజుల్లో ఏనాడూ నేను మార్క్సిజాన్ని, కమ్యూనిజాన్ని ఉపేక్షించలేదు. అలాంటిది జీవితాన్ని నిబద్ధతగా సమానతతో కూడిన సామ్యవాద సిద్ధాంతానికి అంకితం చేసిన వ్యక్తికి నా రచనలు నచ్చడమేమిటో అర్థం కాలేదు. అదే విషయాన్ని ఆయన్నడిగాను. జవాబెప్పటికీ మర్చిపోలేను.

"మీకు తెలీకుండానే మీ రచనల్లో మార్క్సిజముంది గౌరవ్‌గారూ... ఐనా మార్క్సిజమంటే నా దృష్టిలో సిద్ధాంతాలు వల్లించడం కాదు... మనిషి వైపు నిలబడ్డం"

ఏదో ప్రయాణంలో ఉన్న నాకు అనారోగ్యంతో, గద్గద స్వరంతో బలహీనమైనొక కంఠం ఆ రాత్రి అంత బలంగా తాననుకున్న భావాల్ని ఫోన్లో ఎలా వెల్లడించగలిగిందో అనే ఆశ్చర్యం. ఆ కుతూహలంతోనే పరిచయం పెంచుకున్నాను. బొబ్బిల్లో జరిగిన సాహిత్య తరగతులకీ, విజయవాడలో జరిగిన విరసం సభలకీ ఆయన్ని కలుసుకోడానికి వెళ్ళాను. ఒంట్లో మాంసం, గొంతులో శబ్దం, ఏ మాత్రం శక్తీలేని ఓ బక్కపలచని ప్రాణి తత్వశాస్త్రం గురించీ, ప్రపంచ చరిత్ర పట్ల తనకున్న అవగాహన గురించీ, భారతదేశంలోని సామాజిక సమస్యల గురించీ అంత లోతుగా చర్చిస్తుందంటే ఎవరూ నమ్మరు.

కానీ, నిజం. ముందే చెప్పినట్లు ఎస్.ఎస్.ఆర్. విప్లవాన్ని వాక్కుల్లో-వాక్యాల్లో ఎంత ఉపయోగించారో అంతకు మించి జీవితంలో ఉపయోగించారు. అనారోగ్యంతో పోరాటం చేస్తూ, కడుపు కోసం కష్టపడుతూ కూడా చివరిదాకా సైద్ధాంతిక నిబద్ధతను ఇసుమంత కూడా జారిపోకుండా కాపాడుకున్న యోధుడాయిన. కవితలు కానీండి, కథలు కానీండి, వ్యాసాలు, విమర్శలు, సమీక్షలు అవేవైనా ఆయన వాడిన అక్షరాలన్నింటా ఒక తీక్షణత, భావుకత, విలక్షణత ఉంటాయి. సిద్ధాంతం నుండి విడివడి జీవితంతో సంబంధం లేకుండా ఆచరించదగ్గ విప్లవమేదీ ఉండదనేది ఆయన అవగాహన. అందుకే అనారోగ్యం కారణంగా సాయుధ పోరాటానికి దూరమైనా బతికున్నంత కాలం జీవితంలోని వేళ్లన్నిటినీ సాయుధం చేసి శత్రువు పైకి లంఘించిన అవిశ్రాంత విప్లవకారుడాయిన.

బొబ్బిలిలో అనుకుంటాను, రివేరాతో సహా ఎంతో మందిని పరిచయం చేస్తూంటే ఆ ఆత్మీయతను చాదస్తమనుకుంటూ, 'నాకు మీ సిద్ధాంతంతో విభేదాలున్నాయండి' అన్నానమాయకంగా. 'ఎవరికి లేవు? అందరికీ ఉంటాయి. ఆరోగ్యకరమయిన విభేదాలు లేని అనుసరణను విప్లవం అనరు, బానిసత్వం అంటారు. మీరే సంఘంలోనూ ఇమడలేరనే సంగతి నాకు తెలుసు. మీలాంటివారు స్వతంత్రంగా ఉండాలన్నదే నా భావన' అన్నారు. ఏమిటీ మనిషి? పరిచయమైన పది నిమిషాల్లో మనవైపేలా అవతలి వార్ని లాక్కోవాలని చూసే వ్యవస్థలో దశాబ్దాల చరిత కలిగిన ఒక విప్లవ సంఘంలో సీనియర్ స్థాయిలో ఉంటూ కూడా... అప్పుడర్థమైంది... వ్యక్తిగా సాంశివరావుగారి ఔన్నత్యం. పైకి అతి సామాన్యంగా కనిపించే అనన్య సామాన్య అసాధారణ జీవాయిన.

విరసం మహాసభకనుకుంటాను ప్రేమగా ఇంటికాహ్వానించారు. అప్పుడు కుదర్లేదుకాని తర్వాత వీలు చూసుకుని వెళ్ళానాయినింటికి. ఎంత సాధారణ జీవితం... నిత్యం ఒక పోరాటం... మళ్ళీ పదిమందికి మంచి చేయాలనే తపన. అప్పుడే ఆయన్ని ఇంటర్వ్యూ చేసాను. మిత్రుడు కరీముల్లాతో ఆయన బాగోగులు తెల్సుకుంటూడేవాడ్ని. చార్వాకాశ్రమ సుధాకర్‌గారు ఫోన్ చేసి ఎస్.ఎస్.ఆర్. మరణించారని చెప్పగానే ఒక్కసారి మాన్పడిపోయాను. ఆయనుండగా ఇంటర్వ్యూని ప్రచురించలేకపోయాను. కొద్దో గొప్పో వ్యక్తిగతంగా అనుభవాలకిలా అక్షర రూపమివ్వకపోవడం అన్యాయమన్పించింది. చివరి వరకూ రాజీపడకుండా జీవించిన ఎస్.ఎస్.ఆర్. రచనల్ని ఒక్కదరికి చేర్చి ప్రచురిస్తే బావుంటుందని నా భావం. ఏదేమయినా నా వరకూ నాకు ఆయనే వో విప్లవం!

కామ్రేడ్ ఎస్.ఎస్.ఆర్.కు నా లాల్ సలామ్!!



# అసంబద్ధతే కవిత్వమా...?

● పాణి

సమాజంలో కొంత అసంబద్ధత ఉండేదే. ఎందుకు అది అట్ల ఉన్నదో వివరించవచ్చు. హేతువుకు లొంగదని పైకి అనిపిస్తుంది. కాని నిజం కాదు. అసంబద్ధత వెనుక కూడా హేతుబద్ధత ఉంటుంది. దాని గుట్టు సామాజికవేత్తలు విప్పి చెప్పగలరు. ఈరోజు చెప్పలేకపోతే రేపు. కానీ కళాకారుల్లో కొందరు పైకి కనిపించే అసంబద్ధతే పరమ సత్యమని తాము భ్రమసి, శక్తివంచన లేకుండా దాన్ని కళగా మారుస్తుంటారు. ఈ మాట గట్టిగా అంటే కళకు సత్యంతో పని ఏమి? అని దబాయించినా ఆశ్చర్యపోనక్కర లేదు.

అయినా వాళ్లను గౌరవించగలం. ఎందుకంటే సంబద్ధతో, అసంబద్ధతో.. దాన్ని కళగా మార్చే నైపుణ్యం ఉన్నందుకు. అది కళ అయినందుకు. కానీ కొందరు కళే అసంబద్ధమనుకునే వారు ఉంటారు. సమాజంలో అసంబద్ధత ఉందనుకుంటే ఫర్వాలేదు. కానీ సామాజికమైనవన్నీ అసంబద్ధమే అనే నమ్మకంతో వీళ్లు బయల్దేరుతారు. తాము అసంబద్ధత అనుకున్న దాన్ని కవిత్వమని రాసేస్తుంటారు. 'ఏదైనా సరే కళ కావాలి.. కవిత్వం కావాలి' అనే వాదించే వాళ్లకు కూడా ఈ వ్యవహారం కష్టమే. 'ఏదైనా సరే విభిన్నంగా ఉండాల'ని కోరుకునే వారు కూడా ఈ విభిన్నాన్ని భరించడం దుర్లభమే. ఇలాంటి కవిత్వం రాస్తున్న వాళ్లలో బిఎస్ఎం కుమార్ ఒకరు.

ఆయన 2014లో 'సాకీ వృత్తాలు.. పరిపూర్ణ మృత్యు శిల్పం' అనే 'కవితా' సంపుటిని అచ్చేశారు. అప్పటికి ఎన్నో పుస్తకాలు రాశారు. ఆ వరుసలో ఇదీ. ఈ తర్వాత కూడా ఇంకా రాశారేమో. మామూలుగా ఒక తరహా కవిత్వం గురించిన విశ్లేషణలోకి వెళ్లాక ఏం మాట్లాడుకుంటామనేది వేరే విషయంగాని.. ముందు అది కాస్త అందంగానైనా ఉంటే అందులో కళా దినుసు ఉన్నదనే నమ్మకం కలుగుతుంది. కళతో పాటు మిగతా ఉండాల్సినవన్నీ ఏమైనా కావచ్చు. అవి ఉన్నాయా? లేదా? అవి ఉన్నాయా? లేదా అనేది వేరే విషయం. చాలా మంది పాఠకులు, కొందరు రచయితలు కూడా తమకు శిల్పం వగైరా రూప సంబంధమైనవి తెలియవని అంటూ ఉంటారు. కానీ వాస్తవానికి ఏ కళ గురించైనా పాఠకులకు, శ్రోతలకు, ప్రేక్షకులకు మొదట తెలిసేది శిల్పమే. రూపం లేదా శిల్పం అనే ద్వారంలోంచే కళావరణలోకి ప్రవేశిస్తారు. అందుకే కదా వాటన్నిటినీ కలిపి స్థూలంగా కళ అనేది.

బిఎస్ఎం కుమార్ కవిత్వం పేరుతో రాసిందానిలో నిండా అసంబద్ధత తప్ప కళ లేదు. జీవితంలోని అసంబద్ధత గొప్ప సాహిత్యమవుతుంది. దాని పొరలు విప్పేకొద్దీ, అన్వేషించే కొద్దీ, దాని మీద విమర్శనాత్మక దృష్టి ప్రదర్శించే కొద్దీ వాస్తవికతా మూలాలు గొప్పగా కనిపిస్తాయి. దీనికి తెలుగు ప్రగతిశీల సాహిత్యం నుంచి ఎన్నో ఉదాహరణలు ఇవ్వవచ్చు. ఆ రచయితలు అసంబద్ధతను కళగా మలవడం వెనుక వాస్తవికత-అసంబద్ధతల సంబంధం పట్ల ఎరుక ఉంటుంది. అసంబద్ధత మీద విమర్శ దృక్పథాన్ని ప్రకటిస్తూ దాన్ని కళగా మలిచారు. ఆ అర్థంలో కుమార్ సమాజంలోని, జీవితంలోని అసంబద్ధత దగ్గరికి కూడా వెళ్లలేదు. అదేమో ఆయనకు తెలియదని ఈ పుస్తకం పదే పదే చదవగా ఎవరికైనా తెలుస్తుంది. కవితా తలంలోంచి అసంబద్ధతను అందుకోవడంలో విఫలమైన ఆలోచనాపరుడి భాషా క్రీడ ఈ కవిత్వం.

నిజానికి ఇవాళ సమాజంలోని అసంబద్ధతను పట్టుకోవడమంటే మరో మార్గంలో ప్రయాణించి వాస్తవికతను పట్టుకోవడమే. కవిగా కుమార్‌ది చాలా విలక్షణ మార్గమని మాట వరసకు అంగీకరించినా, ఆ విలక్షణతను ఓపికగా పరిశీలించినా సామాజిక అసంబద్ధత ఇసుమంత కూడా కనిపించదు. దాన్ని అందుకోగల మాధ్యమం ఆయన వద్ద లేకపోవడమే దీనికి కారణం. అదే ఉంటే తప్పక ఈ అసంబద్ధత అంతర్ముఖీనంగా అయినా వ్యక్తమయ్యేది. లేదా అంతర్ముఖీన కవిత్వంలో ఈ అసంబద్ధత భాగమయ్యేది. అట్లాంటి కవిత్వం మీద అంచనా ఏమిటి అనేంత పెద్ద చర్చలోకి వెళ్లనవసరం లేదు కాని, కనీసం కళ అయిందనిపించుకునేది. నిజానికి అంతర్ముఖతను కవిత్వమే చేస్తే అది చాలా గాఢంగా ఉంటుంది. అలా చేసిన వాళ్లు ఎందరో ఉన్నారు. కానీ కుమార్ కవిత్వంలో అంతర్ముఖత్వ ఛాయలు కూడా లేవు. కవిగా అంతర్ముఖుడు కావడం వల్ల వ్యక్తమయ్యే కళా, తాత్విక సంబంధమైన దినుసు కాగడా పట్టి వెతికినా కుమార్ కవిత్వంలో కనిపించదు. అసలు మానవానుభవ స్పర్శే లేనప్పుడు అంతర్ముఖీనమేమిటి? సామాజికమేమిటి? అందుకే ఎన్ని పేజీలు తిప్పినా ఒక భావన లేదా ఫీల్ లేదా దృశ్యం లేదా అనుభూతి ఏమీ కలగదు. సారాంశంలో కవిత్వమని అంగీకరించడం కష్టం. చాలా సహనంగా ఆయన భాషను ఉపయోగించే ఫ్రేమను, అందులో పదాలను వాడే ఒడుపును, లేదా పాత పదాల వినిర్మాణాన్ని, కొత్త పదాల నిర్మాణాన్ని గమనించే కొద్దీ.. ఇవేవీ కవిత్వ సంబంధమైనవి కానేకాదనే స్పష్టత కలుగుతూ ఉంటుంది. సాహిత్యంలోని మానవానుభవానికి, అనుభూతులకు సామాజికత ఉంటుందని, అసలు భాషే సామాజికమనే విషయాలను వ్యూహాత్మకంగా పక్కన పెట్టే వాళ్లకు కూడా ఈ పుస్తకంలో కవిత్వం కనిపించదు. కుమార్‌దే అయిన కొత్త ప్రయోగంపట్ల అనురక్తితో చూసే వాళ్లకు, ఇప్పటి దాకా ఉన్న కవిత్వ పద్ధతులన్నీ పక్కన పెట్టి ఓపన్ మైండ్‌తో చూసే వాళ్లకు సహితం ఈ పుస్తకంలోని వైవిధ్యంలో కళ కనిపించదు.

మరి ఇంతకూ ఏముంది?

కుమార్ తనకు తెలిసిన తెలుగు, సంస్కృత పదాలను ఇష్టం వచ్చినట్లు రాసుకుంటూ వెళ్లారు. అంతే. అసంబద్ధత ఏమైనా ఉన్నదీ అంటే ఇలా పదాలు రాసుకుంటూ పోవడంలోనే. అదేదో జీవితంలోని అసంబద్ధతకు వ్యక్తీకరణ అనీ, అది కవిత్వం అయిందనీ, అంతర్ముఖీనత అనే లక్షణం ఉన్నదనీ, అదంతా అనుభూతికి సంబంధించిందనీ, దాన్ని నడిపించిన తాత్వికత ఇంకేదో ఉన్నదని అంటే నమ్మడం కష్టం. చిట్ట చివరికి ఏదో ఒక ప్రయోగంలే అని సరిపెట్టుకోడానికి కూడా ఏమీ లేదు. ఎందుకంటే భాషా సాహిత్య విషయాల్లో ప్రయోగాల మంచి చెడ్డల సంగతి ఎలా ఉన్నా మొట్ట మొదట అందులో ఏదో ఆకర్షణ ఉంటుంది. కుమార్ రచనలో అదికూడా లేదు. కాబట్టి ప్రయోగమనడానికి మనసు ఒప్పదు. ఈ ధోరణి ఇంత పరిపూర్ణంగా కాకపోయినా ఎంతో కొంత కొందరు కవుల్లో ఉన్నది. ఈ 'సాకీ వృత్తాలు.. పరిపూర్ణ మృత్యు శిల్పం' గురించి మాట్లాడుకోవడమంటే ఆ ధోరణి గురించి మాట్లాడుకోవడమే. అదొక ధోరణే కాకపోతే కుమార్ 'కవిత్వం' గురించి మాట్లాడుకోవడానికి ఏముందని?



సోషలిజమే ప్రత్యామ్నాయం:

# మక్సిం గోర్కి కథల్లో పోరాటం.. జన జీవితం

● బాలసాని రాజయ్య




మక్సిం గోర్కి రష్యా సోషలిస్టు విప్లవ కాలం నాటి ప్రముఖ రచయిత. టాల్‌స్టాయ్ నవలలు భావ చైతన్యాన్ని కలిగిస్తే, గోర్కి నవలలు, కథలు పోరాట స్ఫూర్తిని అందించినై. గోర్కి ప్రముఖ నవల అమ్మ ప్రపంచ దేశాలన్నింటినిలో కమ్యూనిస్టులకు దిశా నిర్దేశం కావించే ముఖ్య గ్రంథంగా వ్యాప్తి పొందింది, ఉత్తేజం కలిగించింది. గోర్కి కథలు కూడా ఆలోచనాత్మకాలు. అవశ్య పఠనీయాలు. నేను ఈ మధ్య చదివిన గోర్కి కథల సంపుటి - విశాలాంధ్ర ప్రచురణ 2001, 2008, అనువాదం నిడుకుర్తి ఉమామహేశ్వరరావు. ఇందులో 8 కథలున్నవి. వాటి పేర్లు వరుసగా ఇవి - 1) వింత మనస్తత్వం, 2) రక్తవాహిని, 3) సారంగం, 4) మకార్ చుద్రా, 5) ఒక ముద్దు, 6) మరపురాని రాత్రి, 7) పీఠాధిపతి, 8) త్రిపాది కానొ వాలోవ్ కథ. ఈ కథలు చదివే ముందు పాఠకులు గమనించవలసిన అంశాలు మూడు 1. ఆ వ్యక్తులు, స్థలాలు, పేర్లు మనకు కొత్తవి కావడం వల్ల నాలుక తిరగదు. జాగ్రత్తగా చదవాలి. 2. అనువాద రచయిత వాడిన కఠిన సంస్కృత పదాల అర్థాలు సామాన్య పాఠకులకు సరిగా తెలియవు. 3. వర్ణనలు ఎక్కువ, కొన్ని చోట్ల కథకు మించిన వర్ణనలున్నాయి. అవి కథా శిల్పం అన్నా, సన్నివేశ చిత్రణ అనుకున్నా, కథావగాహనకు ఒకింత ఆటంకం అని చెప్పక తప్పదు. అయితే ఇది ఆనాటి కథన పద్ధతి. వేరే భాషా ప్రజల జీవితం కావడం, మనం అనువాదం చదవాల్సి రావడం వల్ల కూడా కొత్త సాహిత్య పాఠకులకు కొంత ఇబ్బందిగా ఉండొచ్చు. అయినా తప్పక చదవాల్సిన కథలు ఇవి.

ఈ ఎనిమిది కథలలో కేవలం 3 కథలు 1, 2, 8, మాత్రం పోరాటాల విషయాలవి, మిగతా 5 కథలు ఆనాటి రష్యా దేశ సామాన్య జన జీవితాలవి.

1) మొదటి కథలో విచిత్ర మనస్తత్వంగల కథానాయకుడు. మధ్య వయస్సు వ్యక్తి. సైన్యం నుండి పదవి విరమణ పొంది, ఎన్నో తంటాలు పడి డబ్బు సంపాదించుకొని ఇక పెళ్ళి చేసుకొని సుఖంగా ప్రశాంత జీవితం గడపాలనుకుంటాడు. కాని బాగా తాగి ఇతని ఆరోగ్యం చెడింది. ఎక్కువ కాలం బతుకడు అని డాక్టర్ చెప్తాడు. దానితో ఇతనికి భయం పట్టుకొంది. నానా పాపాలు చేసి సంపాదించిన డబ్బు మంది పాలేనా? తాను అనుభవించకనే మరణిస్తానా? అని ఇతని బాధ. ఇతని ఆస్తికి వారసులు కూడా లేరు. ఇతని వరుస సోదరుడు ఒకడు సాయపడటానికి వస్తాడు. గూని పని మనిషి. పొడుగు కాళ్ళు.

పేద వాళ్ళకు మీ ధనం పంచండి అంటారొకరు. ఆ పని చేయను అంటాడు యజమాని. అది ధనిక మనస్తత్వం. ఏదైనా మత సంస్థకు ఇవ్వండి అంటే, అది ఆ పిచ్చి పని మాత్రం చేయను. ఈ ధర్మకర్తలు నీతిపరులు కారు అని అతని జవాబు. ఇట్లా రసవత్తర సంభాషణలు సజీవ జీవన చిత్రణ ఉంది. ఇంతలో ఏదో అలజడి. పెద్ద చప్పుడు. ఎక్కడో వీధిలో అనుకుంటే అది ఇక్కడే వీరింటి ముందే గేటు తలుపులు పీకారు, రాళ్ళు కర్రలతో దాడి, తుపాకుల కాల్పులు, దొంగలు అనుకుంటాడు. తిరుగుబాటుదారులు అనుకోవచ్చు. ఇతని పని మనిషి వెళ్లి వాళ్లలో కలుస్తాడు. వరుస సోదరుడే దెబ్బ తింటాడు. అతడు ఏ పక్షమో తెలియదు. ఇంటి యజమాని నర్సు సాయంతో పోరాటాకారులపై పూల కుండిలు విసురుతుంటాడు. ప్రభువు సైనికులు వచ్చి ఆందోళనకారులు చెల్లాచెదురు చేసే సరికి ఇతడు పడి పోతాడు. రష్యా విప్లవం నాటి ధనవంతుల స్థితి గతికి ఈ కథ దర్పణం.

2) కథ రక్తవాహిని :- ఇది అచ్చంగా ప్రజా పోరాట కథ, కమ్యూనిస్టు పోరాటం మాస్కోలో జార్ ప్రభువు భవనం ముట్టడి రాజా భటుల భవన రక్షణ, కామ్రేడ్‌ల తెగింపుతో ఉద్రిక్తంగా సాగుతుంది కథ. ఇందులో సంభాషణలు ప్రత్యేకంగా కమ్యూనిస్టులకు బోధన లాంటివి. కామ్రేడ్ మోసపోకండి. స్వాతంత్ర్యం ఒకరు పెట్టే భిక్ష కాదు. జనంలో కొందరు మతం విశ్వాసాలు కలవారు ఉన్నారు. క్రైస్తవ మత గురువు వీరిని అడ్డుకొని కీస్తును ధ్యానిస్తాడు.

ఆ భూతాన్ని తరిమేయండి.<br>
మన రక్తం రంగే ఎరుపు కామ్రేడ్స్<br>
స్వశక్తికాక ప్రజలను విముక్తి చేసే శక్తి ఏదీ లేదు.

సైనికులకు పోరాటకారులకు మధ్య కాల్పులు, రక్తపు ఏరులు, అసలు జారే ప్రభువు అంతకు ముందే భవనం నుంచి తప్పించుకోని ఎటో వెళ్ళాడట, అది జనవరి 9 పోరాట సన్నివేశం, అక్టోబర్ 1917 చివరి విముక్తి పోరాటానికి ముందు ఇటువంటివి ఎన్నో, ఇవి మళ్ళీ మళ్ళీ చదవాల్సిన కథ.

3) సారంగం :- ఇది ఒక కార్మికుని కథ. ప్రకృతి ముందు ఎంతో చిన్నవాడైన మనిషి తన శక్తి యుక్తులతో ప్రకృతినే శాసిస్తూ ఎన్నో విజయాలు సాధిస్తున్నాడు. ఒక కొండకు రహదారి మార్గంగా

సారంగం తవ్వుతూ రెండు ప్రాంతాల ప్రజలు ఆనందించడం ఇందులో ఉన్నది.

4) మకార్ చుద్రా :- ఒక జిప్సీ (దేశ దిమ్మరి) పెద్ద మనిషి పేరు మకార్ చుద్రా ఇతడు దేశ దిమ్మరి. రచయితకు చెప్పిన 'రాద్దా' అనే యువతి కథ ఇది. ఆమె తన తండ్రి గుడారంలో ఉంటుంది. డబ్బిచ్చి ఆమెను కొనదలచిన వృద్ధ ధనిక వ్యాపారిని తిరస్కరిస్తుంది. మరో అందమైన జిప్సీ యువ వీరుడు తన గుర్రంపై వస్తాడు. అతడు ఆమెను ఇష్టపడతాడు. తనకు లొంగితే ఒప్పుకుంటా అంటుంది రాద్దా. ఇక్కడ వ్యక్తుల ఆత్మాభిమానాలు ముఖ్యంగా కన్పిస్తాయి. ఎన్నో మలుపులు తిరిగిన కథ చివరికి విషాదాంతం. ఆమె అతన్ని పిస్తోలుతో కాలుస్తుంది. అతడు ఆమెను కత్తితో పొడుస్తాడు మకార్ చుద్రా. ఆ కథకు సాక్షి మానసిక స్థిరత లేని దురభిమానాలు ఈ దుష్పరిమాణాలకు కారణం అనుకోవచ్చు.

5) ఒక ముద్దు :- బతుకు పోరాటం సాగించే కూలీల, శ్రామికుల కథ, రచయిత తన మిత్రుడు ఏమిల్యాన్ హార్బర్ (ఓడరేవు)లో పని దొరకక ఉప్పు కొటర్ల వైపు వెళ్తారు. అక్కడా పని దొరికే అవకాశం లేదు. దారిలో స్టెప్పీ (గడ్డి) మైదానంలో పశుకాపరులను కలుస్తారు. వీళ్ళను చూసి వేదాంతులు వస్తున్నారు, జాగ్రత్త అని సద్దిమూటలను దాస్తారు. ఏ అవయవం లేకున్న పొట్ట ఆకలి లేని మనిషి ఉండడు అనుకునే ఏమిల్యాన్ ఖాళీ పొగాకు సంచిని తేప తేపకు విప్పి చూస్తుంటే జాలి, బాధ కలుగుతుంది. మనకు ఎంత పొదుపు పాటించినా పేదల బాధలు ఒకే రకం కాబట్టి, పశుకాపరులు వీళ్ళతో మాట్లాడి రొట్టెలు పొగాకు ఇచ్చి పశువులతో వెళ్ళారు. ఏమిల్యాన్ 8 ఏళ్ల క్రితం జరిగిన సంఘటన మాక్సింకు చెప్తాడు. ఇదే ఇందులో అసలు కథ. అతడు ఒక కలప వ్యాపారి దగ్గర పనిలో ఉన్నప్పుడు కొంత డబ్బు తాగుడుకు ఖర్చు పెడితే ఇతన్ని జైలుకు పంపాడట. మూడు నెలలకు విడుదల అయి వచ్చి ఒక బేకరిలో పనికి కుదిరినా, ఆ కలప వ్యాపారిపై కోపం పోలేదు, ఒక రాత్రి అతన్ని దారి కాచి చంపాలని చీకటిలో దాగి ఉంటాడు, అదే సమయంలో ఒక యువతి చిత్తుగా తాగి అక్కడి సముద్రంలో పడి చనిపోదామని వచ్చింది. ఇద్దరికి మాటలు కలుస్తాయి. ఆమె ధనవంతుని కూతురు. ఇద్దరు యువకులతో మోసపోయి, తండ్రి కోపిస్తే బాధలో ఆత్మహత్య చేసుకుందామని వచ్చింది. ఇతడు పేద. బాధలో ఉన్నవాడే. ఇతని మాటలతో ఆమె మనస్సు మారింది. మరునాడు అతడు ఆమెను వాళ్ళ ఇంటికి చేరవేస్తాడు ఆమె డబ్బిస్తానన్నా తీసుకోడు. ఆమె రాత్రి ఇచ్చిన ముద్దు విలువైనదిగా భావిస్తాడు.

6) మరుపురాని రాత్రి :- రచయిత ఒక రాత్రి హార్బరులో ఉంటాడు. తుపాను రానుంది, నిర్మానుష్యం, ఆకలి, ఒంటరితనం, మూసిన దుకాణాల మధ్య తిరుగుతున్నాడు. ఒకచోట ఒక స్త్రీ మూసిన డబ్బా దుకాణం కింద ఇసుక తవ్వుతున్నది. ఆమె అడిగితే ఇతడు వెళ్ళి సాయం చేస్తాడు. అక్కడ కింద చెక్క పగిల్చి లోపలికి వెళ్లి ఆమె రొట్టె తెచ్చింది. ఇంతలోనే వర్షం, ఇద్దరూ వెళ్ళి ఒక బోర్లించిన పడవ కింద పడుకున్నారు. అతని వయస్సు 17 సంవత్సరాలు అట. మరునాడు ఎవరి దారిన వారు పోతారు.

7) పీఠాధిపతులు :- మనం ఎన్నో కథలు చదివి ఉండచ్చు. ఈ కథ కొత్తదిగా నాకు అన్పించింది. ఒక వ్యక్తి ఇంటర్వ్యూ తీసుకుపోవడానికి వచ్చి ఒక పెద్ద మనిషికి తను చేస్తున్న పాపపు పనుల నౌకరీని గురించి వివరిస్తాడు. అదే ఈ కథ, అదేమిటి అంటే నాగరికులుగా కనిపించే ధనవంతులు తాము చేస్తున్న తప్పుడు పనుల నుండి ప్రజలకు దృష్టి మరల్చడానికి ఇలాంటి పాపపు పనులు చేస్తూ సంచలం సృష్టించే సంస్థను స్థాపించి ధనసహాయం చేసి నడిపిస్తుంటాడు. దానికి శాఖలు కూడా. బతకడానికి ఏ అవసరం లేని వాళ్ళు అందులో చెడి అవనీతి పనులు చేసి అల్లరి సృష్టిస్తూ రాజభటుల దృష్టిలో పడి శిక్షల పాలై జైళ్ళకు వెళ్తారు. వీళ్ళను విడిపించడం ఆ సంస్థ నిర్వాహకులు చేస్తారు. ఇది అవమానంగా బాధగా ఉన్నా, తమ భార్యా పిల్లలను పోషించడానికి అంతకు మించిన వేరే మంచి మార్గం లేదని ఆ పాపపు పనులు చేసే ఉద్యోగి జవాబు. ఇది చాలా ఆలోచింప చేసిన కథ..

8) త్రిపాది కొనా వాలొన్ కథ :- త్రిపాది అనే పదాన్ని లోక సంచారి, దేశదిమ్మరి, అనే అర్థాల్లో అనువాద రచయిత వాడినట్లు అనిపిస్తుంది.

కొనొవాలొన్ ఒక స్వేచ్ఛా జీవి, శ్రమ జీవి, వయస్సు 40 ఏండ్లు సామాజిక నిబంధనలు, కపట నటనలు, సంసార బంధాలు అతనికి నచ్చవు. శ్రమ పడు, పనిచేయి, సంపాదించు, బాగా తిను, తాగు, రేపటికి ఏమీ ఉంచుకోకు, నీ తోటి శ్రామికులకు, స్వేచ్ఛా జీవులకు ఖర్చు పెట్టు. ఇది అతని స్వభావం. కథకుడు (రచయిత) మాక్సింగోర్కి 18 ఏళ్ళ వయస్సులో ఒక బేకరిలో రొట్టెలు చేసే పనిలో ఉండేవాడు . అది జార్ చక్రవర్తి కాలం. ఈ ఒక్క కథకు 1896లో రాసినట్లు తేది ఉంది. కొనొవాలొన్ రొట్టెలు చేసే పనివాడుగా అక్కడే పరిచయం. అతడు ఒకనాడు వెళ్ళిపోతాడు. ఒక జైల్లో ఉరివేసుకొని చనిపోయినట్లు పత్రికలో వార్తను చూసిన మాక్సిం ఈ కథంతా మనకు చెప్తాడు. ఇది చాలా పెద్ద కథ. కొనొవాలొన్ ప్రవర్తన, ముచ్చట్లు ఈ కథలో ముఖ్యాంశాలు. అతనికి చదువు మితం, బాగా రాదనుకుంట, కానీ మాక్సింతో విప్లవకారుల పుస్తకాలు చదివించుకొని వింటాడు. వీర గాథలు ఇష్టం, దేశ సంచారం ఇష్టం, విప్లవకారుల చర్యలు ఆసక్తిగా వింటూ చాలా ఉద్రేకాన్ని పొందుతాడు. డబ్బు చేతబడితే చాలు వెళ్ళి తనలాంటి జనాలతో తాగుతూ జల్సా చేస్తాడు. ఒకసారి అతడు చేసిన మంచి పని చెడుగా మారుతుంది. అదేమంటే అతనికి పరిచయం ఉన్న ఒక వేశ్య పడుచు పిల్లను జాలిపడి జైలు నుంచి విడిపిస్తాడు. అందుకు తన సొంత జీతం డబ్బును ఖర్చు పెడుతాడు. ఆమె ఇతన్ని పెళ్ళాడి జీవించాలంటుంది. ఇతడు కాదంటాడు. ఆమె ఎందుకు విడిపించావని అల్లరి చేస్తుంది, ఎలాగో ఆ అల్లరి ఆగి పోతుంది. ముందు ఆలోచన, స్థిరత లేని జీవితాలు అంతే అని మిత్రుని మాట. ఎటో వెళ్ళిపోయిన కథా నాయకుడు ఒక చోట రాళ్ళు కొట్టే కూలీగా అవతరిస్తాడు. అక్కడ ఈ రచయితకు కనిపిస్తాడు. ఇతడు స్వేచ్ఛా సంచార జీవితం గడుపుతున్నందుకు అతడు ఆనందిస్తాడు. ఎన్నో ప్రసంగాలు, సంభాషణలు, జీవిత నిర్వచనాలు అందులో అనేకం. ఇద్దరూ వేరైనప్పుడు జీవితంలో వారెప్పుడూ కల్సుకోకపోచ్చు అనుకుంటాడు రచయిత. ఇదుగో ఈ పత్రిక మరణ వార్తతో అతనికి విషయం తెల్సింది. అతని కథ ముగిసింది. కానీ రచయిత ఎందుకో కథను ఈ వాక్యంతో ముగించలేదు. మాక్సిం గోర్కి కథలు జనజీవితాన్ని, శ్రామికుల పాట్లను అనేక కోణాల్లో వివరిస్తూ, కమ్యూనిస్టు విప్లవ దశలను చిత్రిస్తాయి.



దృక్పథం:

# పెట్టుబడిదారీ వ్యవస్థే సకల సంక్షోభాలకు మూలం

# సోషలిజమే ప్రత్యామ్నాయం

ప్రొద్దుటూరు సాహిత్య పాఠశాల కీనోట్

● పి. వరలక్ష్మి

**'దీన్ని మరణమని చెప్పలేను**
**అలాగని బతకడమూ కాదు**
**ఇదో అలౌకిక అసమంజస నిరర్థక నిర్బంధ స్థితి'**

వర్తమాన కవి ఇప్పటి సమాజ స్థితి గురించి ఇలా వ్యక్తీకరించాడు. ఉన్న స్థితిలో కొనసాగలేక, ముందుకుపోనూ సాధ్యం కాక వ్యవస్థలు పెనుగులాడుతుంటే అది సంక్షోభాన్ని సూచిస్తుంది.

సంక్షోభమనే మాట రోజువారీ సామాజిక జీవితంలో చాలా సార్లు ఉపయోగిస్తుంటాం. పొద్దున్నే పంపులో నీళ్ళు రాకపోతే అదో సంక్షోభంగానే ఫీలవుతాం. మోదీ పుణ్యమా అని రెండు నెలలు భారతదేశం అనుభవించిన గడ్డు రోజులు (దాని ప్రభావం ఇప్పటికీ ఉంది) ఉన్న ఫలంగా సామాజాన్ని స్తంభింపజేసాయి. జేబులో డబ్బులుంటాయి కాని, వాటి ఖర్చు చేసుకోలేము. బ్యాంకు బ్యాలెన్సు, ఏటియం కార్డు ఉంటాయి గాని నిరుపయోగమైపోతాయి. ఆధునిక వైద్యం అందుబాటులో ఉన్నా, దాన్ని కొనడానికి డబ్బులున్నా అవి చెల్లక మనుషులు చచ్చిపోయిన రోజుల్ని కూడా చూశాం. నోట్ల రద్దు గురించి అనేక విశ్లేషణలొచ్చాయి. వాటి సారాంశం ఏమిటంటే గుత్త పెట్టుబడి బండి నడవడానికి బిజెపి ప్రభుత్వం ప్రజల డబ్బులన్నిటినీ ఇంధనంగా పోసింది. వేరు వేరు రూపాల్లో ప్రభుత్వాలు పెట్టుబడిదారీ దోపిడి నిరంతరాయంగా జరగడానికి ప్రజల శ్రమను పిండి దానికి ధారపోస్తూనే ఉన్నాయి. నోట్ల రద్దు అనే చర్య ద్రవ్య ఆర్థిక వ్యవస్థ దోపిడిని సులభతరం చేయడానికే. ఇది ఒక పెట్టుబడి సంక్షోభాన్ని, దాన్ని నివారించడానికి వ్యవస్థాగతంగా చేయవలసిన సర్దుబాటును సూచిస్తుంది. ఇదే సమాజంలోనూ, ప్రజల జీవితాల్లోనూ సంక్షోభాన్ని తెచ్చిపెడుతుంది.

## సంక్షోభం అంటే ఏమిటి?

సమాజాన్ని నడిపించే సూత్రాలు కాలగతిలో పనికిరాకుండా పోతే, అవి విచ్ఛిన్నం అయితే సంక్షోభం వచ్చినట్లు.

(crisis: breakdown of operating principles of a society-marxist thought)

సంక్షోభాన్ని సూచించే పరిణామాలు, ఘటనలు అనేక రూపాల్లో సమాజంలో వ్యక్తమవుతూ ఉంటాయి. ఈ అవాంఛనీయ పరిణామాల మధ్య ఎటు పోతోందీ సమాజం అని కలవరపడుతూ ఉంటాం. సాధారణ అర్థంలో అవి అవాంఛనీయమే కానీ అవి అనివార్య పరిణామాలు. ఆ పరిణామాల ఒత్తిడులను, హింసను మనం ప్రతి సందర్భంలోనూ విశ్లేషించుకోవాల్సి ఉంది. అది కూడా రాజకీయార్థిక పునాది నుండి విశ్లేషించుకోకపోతే వేరు వేరు సంక్షోభాల వ్యక్తీకరణల వెనక పనిచేసే మూలాలను వదిలేసినవాళ్లమవుతాం., అసలు వ్యవస్థయే సంక్షోభాలను ఉత్పత్తి చేస్తూ ఉంటుంది. అట్లా ఉత్పత్తి చేసినప్పుడల్లా అది మార్పు కోసం పెనుగులాడుతోందని అర్థం. మార్క్స్ చాలా స్పష్టమైన రాజకీయార్థిక అర్థంలో సంక్షోభమానే మాటను వాడతాడు. ఆయన చెప్పినట్లు పెట్టుబడిదారీ వ్యవస్థ గర్భంలోనే ఎడతెగని సంక్షోభాలు ఉంటాయి. పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానమే అందుకు కారణం. ఇక్కడ సమాజ అవసరాల కోసం ఉత్పత్తి చేయడం కాకుండా పెట్టుబడిదారుల ప్రయోజనం కోసం, మార్కెట్ విస్తరణ కోసం ఉత్పత్తి జరుగుతుంటుంది. పెట్టుబడికి లాభాలు పెరుగుతూపోవాలి. ఆ పెరుగుదలలోనే దాని ఉనికి ఉంటుంది. ఆ పెరుగుదల దోపిడి మీద ఆధారపడి ఉంటుంది. మౌలికంగా సరుకు ఉపయోగపు విలువకు, మార్కెట్ ధరకు వైరుధ్యం ఉండటం, ఉత్పత్తికి, పంపిణీకి వైరుధ్యం ఉండటం వల్ల ఉత్పత్తి చేసిన సరుకులు ఇబ్బడి ముబ్బడిగా ఉన్నా అవి మనుషులకు అందుబాటులో ఉండవు. అంతకంతకూ సంపద కొద్ది మంది వద్ద పోగుపడుతూ వస్తుంది. సామాజిక ఉత్పత్తికి, వ్యక్తిగత ఆస్తి సంచయనానికి మధ్య వైరుధ్యం తీవ్రమవుతూ వస్తుంది. లాభాల వేటలో తాను విపరీతంగా ఉత్పత్తి చేసిన సరుకులకు కొనుగోలు మార్కెట్ చిన్నదైపోతుంది. ఇదే సంక్షోభానికి దారి తీస్తుంది. ఆర్థిక సంక్షోభాన్ని అధిగమించడానికి పెట్టుబడి కొత్త మార్కెట్లను సృష్టించుకుంటుంది.

ఇలా పెట్టుబడిదారీ వ్యవస్థ ఉనికిలోకి వచ్చాక అది వస్తు రూపంలో ప్రపంచవ్యాప్తంగా విస్తరించడం, గుత్త పెట్టుబడిగా, సామ్రాజ్యవాదంగా మారడం అంతా నిరంతర సంక్షోభాలకు గురవుతూ, వాటిని అధిగమిస్తూనే సాగింది. 1870లు, 1930లు, 1970ల ఆర్థిక సంక్షోభాలు, తర్వాత 1980ల, 1990ల తొలి సంవత్సరాలు, 2001 ఆ తర్వాత తాజాగా 2008 ఫైనాన్స్ పెట్టుబడి సృష్టించిన దారుణమైన సబ్ ప్రైమ్ సంక్షోభం- ఇలా ఎప్పటికప్పుడు సంక్షోభాలను అధికమించినట్లు పెట్టుబడి నటిస్తుంది. అది ఎన్నటికీ వాటిని పరిష్కరించదు కానీ వాయిదా వేస్తూ పోతుంది. పెట్టుబడిదారీ సంక్షోభం అనేక చిన్నా పెద్దా యుద్ధాలను సృష్టించింది. మార్కెట్లను, వనరులను తన చెప్పుచేతల్లో పెట్టుకోడానికి అదెంత దూరమైనా పోతుంది. మందులమ్ముకోడానికి రోగాలను సృష్టిస్తుంది. ఆయుధాలు అమ్ముకోడానికి పోట్లాటలు ప్రేరేపిస్తుంది. ఆయిల్ కోసం టెర్రరిజాన్ని పుట్టిస్తుంది.

బ్రిటీష్ ప్రభుత్వం పోయి అధికార మార్పిడి జరిగాక మన దేశం అర్థవలసగానే కొనసాగింది. సామ్రాజ్యవాద మార్కెట్ విస్తరణ కోసం 1991నుండి మన మీద రుద్దిన సరళీకృత ఆర్థిక విధానాలు దేశీయ ఆర్థిక వ్యవస్థను గ్లోబల్ పెట్టుబడి సంక్షోభంతో జత కలిపింది. సమస్త రంగాలను పెట్టుబడి కబలించింది. చెట్టు, గుట్ట, నీరు, నది మార్కెట్ సరుకులయ్యాయి. వ్యవసాయం కుదేలయింది. దేశీయ పరిశ్రమలు మూతపడ్డాయి. విద్యా, వైద్యం మనుషుల కోసం కాక మార్కెట్ కోసమైంది. మానవ ఆవాసాలు, ప్రకృతి నివాసయోగ్యతను కోల్పోయేంతగా పాడైపోతున్నాయి. సామాజిక, సాంస్కృతిక రంగాలు కుదుపుకు లోనయ్యాయి.

ప్రపంచీకరణ విపరీతంగా సంపద కేంద్రీకరణకు దారితీసి గ్లోబల్ సంపన్నులను తయారు చేసింది. ఎంతగా సంపద కేంద్రీకరణ జరుగుతున్నదో అంతగా సగటు జీవన ప్రమాణాలు తగ్గిపోతున్నాయి. ఆర్థిక రంగమే కాదు, అనేక మానవ విధ్వంసక రూపాల్లో సామ్రాజ్యవాద పెట్టుబడిని ఈ రోజు మనం చూడొచ్చు. సామ్రాజ్యవాదం ప్రపంచ పోలీసు అవతారమెత్తింది. విపరీతంగా సైనికీకరణ (పారిశ్రామిక రిజర్వ్ ఆర్మీ వంటివి), మనిషి మనిషిపై నిఘా,

ఆసమానతను ప్రశ్నిస్తూ అట్టడుగువర్గాలు కదుతున్న దశలో సమాజంలో రాపిడి జరుగుతుంది. కుల అణచివేత సామూహిక మారణకాండ వంటి హింసాత్మక రూపం తీసుకుంది. రాజ్య స్వభావంలో, పనితీరులో ఆధిపత్య కుల, మత భావజాలం ఉండటం, అది సాంఘిక వ్యవస్థను నియంత్రిస్తూ, ఆర్థిక విధానంలో సామ్రాజ్యవాద మార్కెట్‌కు అనుసంధానమై ఉంటడం మన సమాజ ప్రత్యేకత. బిజెపి అధికారంలోకి వచ్చిన తర్వాత మరింత నిర్దిష్టంగా ఇది వ్యక్తమవుతున్నది. హిందూ జాతీయవాద భావజాలంతో అది ఫాసిజాన్ని అమలుచేస్తూ భారతీయ సమాజాన్ని సామ్రాజ్యవాద మార్కెట్ లక్ష్యానికి నేరుగా గురి చేసింది.




రోహిత్ వేముల మరణం, తదనంతర పరిణామాలు, గొడ్డు మాంసం తిన్నారని దాడులు, హత్యలు చేయడం, ఉనా దళిత ఉద్యమం వంటి సంచనాల క్రమంలో నోట్ల రద్దు, నగదు రహిత లావాదేవీల ప్రయోగం జరిగింది. భారత ప్రభుత్వం తన హిందూజాతీయవాదంలో భాగంగా కులాధితపత్యతత్వాన్ని మరింత బలంగా వ్యక్తం చేస్తూనే, గత పాతికేళ్లలో కార్పొరేట్ పెట్టుబడి కోసం ప్రజల్ని బలిపెడుతూ చేసిన అతిపెద్ద చర్య నోట్ల రద్దు రూపంలో తీసుకుంది. కార్పొరేట్ కంపెనీల కోసం తీసుకున్న ఈ చర్యతో కేవలం నగదు అందుబాటులో లేకపోవడం వల్ల యాభై రోజుల్లో 150 ప్రాణాలు పోయాయి. అటు సామ్రాజ్యవాద శక్తులకు, ఇటు మతవాద ఫాసిస్టు శక్తులకు మనుషుల ప్రాణాల పట్ల లెక్కలేనితనం కొత్తేమీ కాదు. నోట్ల రద్దు, నగదు రహిత లావాదేవీ ప్రయోగం వంటివైనా, మైనింగ్ కోసం దండకారణ్యంలో ఆదివాసులపై చేస్తున్న యుద్ధంమైనా, బాక్సైట్ కోసం ఆంధ్రా ఒడిసా సరిహద్దు ప్రాంతంలో చేస్తున్న మారణకాండ అయినా, పశ్చిమ కనుమల్లో ప్రకృతి సంపదను మార్కెట్‌పరం చేయడం కోసం అముచేస్తున్న హింస అయినా సామ్రాజ్యవాద పెట్టుబడి విస్తరణలో భాగమే.

అభద్రత, జాతి విద్వేషాలతో పాలన సాగించే పరమ రియాక్షనరీ పాలకులు 21వ శతాబ్దపు కొత్త తరహా ఫాసిజాన్ని ప్రపంచానికి పరిచయం చేస్తున్నారు.

భారతదేశంలో 2000-2014 మధ్య సంపద విపరీతంగా పెరిగింది (2/3 దాకా పెరిగింది). అంతకన్నా ఎక్కువగా సంపద కేంద్రీకరణ జరిగింది. ఇవాల భారతదేశం మొత్తం సంపదలో సగం కన్నా ఎక్కువ ఒక శాతం మంది సంపన్నుల చేతిలో ఉంది. మూడొంతుల సంపద 10 శాతం వ్యక్తుల చేతిలో ఉంది. మరో వైపు మూడు లక్షల మంది రైతులు ఆత్మహత్యలను ఈ దేశం నిశ్శబ్దంగా వీక్షించింది. ఈరోజు ప్రపంచంలో అన్నం దొరక్క పస్తుండే ప్రతి నలుగురిలో ఒకరు ఇండియన్. సరైన పౌష్టికాహారం లేక ఎదుగుదల లోపం ఉన్న పిల్లల శాతం అధికంగా ఉన్న దేశం కూడా ఇండియానే. 78 శాతం వైద్యం కోసం ప్రైవేటు ఆసుపత్రుల మీద ఆధారపడుతున్న ఇండియాలో ప్రజల సగటు ఆరోగ్య ప్రమాణాలు ఆఫ్రికా ఆకలి దేశాలతో పోటీపడున్నాయి. ప్రభుత్వం చెవుతున్నట్లు కొత్త పరిశ్రమలు, ప్రైవేటు పెట్టుబడి ఉద్యోగాలవకాశాలను మెరుగుపరచడం లేదు. అంతకంతకూ నిరుద్యోగం విపరీతంగా పెరిగిపోతోంది. భారతదేశంలో ఏటా కోటి మంది చొప్పున కొత్త కార్మిక శక్తి తయారవుతుంటే అందులో సగం మందికి కూడా ఉద్యోగావకాశాలు లేవు. పెద్ద ఆర్థిక విజయంగా చెప్పుకుంటున్న ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ సృష్టించిన ఉపాధి చూస్తే అది మొత్తం కార్మికుల సంఖ్యలో రెండు శాతం మాత్రమే.

## సంక్షోభాన్ని మేనేజ్ చేయడానికి వ్యవస్థలో రాజ్యం జోక్యం పెరుగుతుంది, హింస పెరుగుతుంది.

చిరకాలంగా మనగడలో ఉన్న సామాజిక ఆర్థిక వ్యవస్థను మార్పుకు గురిచేయడానికి రాజ్యం ఆయా సమాజాల్లో అంతకంతకూ ఎక్కువ జోక్యం చేసుకోవాల్సిన అవసరం ఏర్పడుతుంది. రాజ్య యంత్రాంగం ఎప్పటికన్నా విస్తారమూ, సుస్థిరమూ అవుతూ వస్తుంది. ప్రజలు ఎంత ఎక్కువ సరుకుల వినిమయంలోకి వెళ్తారో అంతగా రాజ్యంతో అనుసంధానంలోకి వెళ్తారు. రేషన్ కార్డు దగ్గిరి నుండి ఆధార్ కార్డు దాకా మెల్లగా ప్రజలను తన పరిధిలోకి తీసుకొచ్చి ప్రజలందరినీ లబ్దిదారులుగా, ప్రభుత్వ దయాదాక్షిణ్యాల మీద ఆధారపడేవారిగా చేస్తుంది. ఉద్యోగ భద్రత, ఉపాధి అవకాశాలు ఊడ్చుకుపోతూ ప్రజల కాళ్ల కింది నేలను కూడా పెట్టుబడి కబళిస్తుంది. ఈ పరిణామాలు ఘర్షణకు, తిరుగుబాట్లకు దారి తీస్తాయి గనక, విద్యావంతులైన పెటీబూర్జువా వర్గం చేత రాజ్యం తన అనుకూల భావజాలాన్ని కూడా సమాజంలో వ్యాపింపజేస్తుంది. ఈ వ్యవస్థ ఎంతో సుస్థిరమూ, పటిష్టమూ అనుకునేలా, దీనికి ప్రత్యామ్నాయం లేదనుకునేలా చేస్తుంది. ప్రపంచీకరణ మంచిదే! అడవులు, కొండలు, నదులు, భూములు పోతాయనుకుంటే మరి అభివృద్ధి ఎలా సాధ్యం? కొంత మంది నష్టపోవడం తప్పదు! ఇటువంటి వాదనలు వస్తాయి: ప్రత్యక్ష, పరోక్ష హింస విపరీతంగా పెరిగిపోతుంది.

మన సమాజంలో రాజ్యం పాత ఆధిపత్య శక్తులను ఉపయోగించుకుని కుల, మతపరమైన హింసకు కూడా దోహదం చేస్తుంది. పాత సాంఘిక వ్యవస్థను,

## ప్రాంతీయ అసమానతలు పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం ఫలితమే!

పెట్టుబడి అంటేనే అసమానత. అది సమాజంలో అనేక రకాల అసమానతలను సృష్టిస్తుంది. అందులో జాతి పరమైన అసమానతలు, ఒకే జాతిలోని వేర్వేరు ప్రాంతాల మధ్య అసమానతలు ప్రపంచవ్యాప్తంగా ఉంటాయి. ఎందుకంటే పెట్టుబడి చావకగా శ్రమశక్తిని, ప్రకృతి వనరులు కొల్లగొట్టడానికి వెనకబడిన ప్రాంతాలను తయారుచేస్తుంది. సరుకులమ్ముకోడానికి వస్తువినిమయ సమాజాన్నీ, సోకాల్డ్ అభివృద్ధి చెందిన ప్రాంతాలను సృష్టిస్తుంది. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో అసమానతలు ప్రాంతీయ ఉద్యమాలకు దారితీసిన వైనం చూశాం. తెలంగాణ రాష్ట్ర ఉద్యమంతో పాటు రాయలసీమ కూడా తన ఆకాంక్షలు వ్యక్తం చేసింది. కొత్త ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ప్రాంతీయ అసమానతలు మరింత తీవ్ర రూపంలో కొనసాగుతాయని రాయలసీమ, ఉత్తరాంధ్ర, పల్నాడు వంటి ప్రాంతాలు తెలియజేస్తున్నాయి. రాయలసీమ రాష్ట్ర ఉద్యమం తిరిగి రంగం మీదికి వస్తున్నది. దేశవ్యాప్తంగానే ఇటువంటి ప్రాంతీయ ఆకాంక్షలు వివిధ ప్రాంతాల్లో వ్యక్తమవుతున్నాయి. పెట్టుబడిదారి సంక్షోభం వల్ల దెబ్బతిన్న వివిధ సమూహాలు ఇటువంటి ఉద్యమాల్లో సమీకరించబడతాయనడానికి తెలంగాణ ఒక ఉదాహరణ. వీరి ఆకాంక్షలు బూర్జువా పార్లమెంటరీ సర్దుబాట్ల వల్ల తీరేవి కావు. ప్రత్యేక రాష్ట్ర ఏర్పాటు అనంతరం తెలంగాణ సమాజం తిరిగి ఉద్యమాలకు సిద్ధం కావలసిన పరిస్థితులు రావడానికి ఎక్కువ సమయం పట్టదు. ఎందుకంటే మౌలిక వైరుధ్యాలను పరిష్కరించే శక్తి ఈ వ్యవస్థకు లేదు.

## సాహిత్య రంగంలో సంక్షోభాల ప్రతిఫలనం:

సమాజ హృదయమే సాహిత్యం అన్నాడు గోర్కీ. సమాజం రాపిడికి

గురవుతున్నప్పుడు, ఆ ఒత్తిడి మానవ జీవితంలో ఎలా ప్రతిఫలిస్తుందో, మార్పు క్రమంలోని చలనాలు నిజజీవిత ఆవరణలో ఎలా గోచరమవుతాయో అది వ్యక్తమయ్యే తీరులో గొప్ప సాహిత్యం తయారవుతుంది. తెలుగు సాహిత్య రంగం అనేక సంచలనాలను తనలోకి స్వీకరించింది. ప్రగతిశీల భావాల వేదికయ్యింది. అభ్యుదయ, విప్లవ, అస్తిత్వ సాహిత్య ధోరణులన్నీ భాషా, సాంస్కృతిక రంగాలను సుసంపన్నం చేశాయి. రాజకీయార్థిక, సామాజిక సంక్షోభాలు సాహిత్య ప్రపంచంపై పాజిటివ్, నెగెటివ్ ప్రభావాలు వేస్తున్నాయి. ఈ దేశపు మూలవాసులు సరికొత్త కంఠస్వరంతో ఆధిపత్య సంస్కృతిని, రాజకీయాలను ప్రశ్నిస్తూ మానవసారాన్ని సాహిత్యంలో పలికిస్తున్నారు. మరోవైపు సాహిత్యానికి ఉన్న సామాజిక తత్వాన్ని తిరస్కరించే ధోరణి ఒకటి బయలుదేరింది. కళా సాహిత్యాలను, వాటికి మూలమైన మానవ సామాజిక, వ్యక్తిగత అనుభవాలను విశ్లేషించేందుకు మార్క్సిజం ఒక్కటే సరిపోదనే వాదనా తిరిగి లేచి నిలబడింది. సామాజిక అనుభవం నుంచి వైయుక్తిక అనుభవాలను వేరు చేసి, పోటీ పెట్టి, ఆ రెంటిని అపసవ్యంగా అర్థం చేసుకోవడమేగాక వ్యక్తిగత అనుభవాలే గొప్ప కళగా మారుతాయనే ధోరణి కూడా మళ్లీ వచ్చేసింది. సామాజిక చలనాలను, వాటి అంతస్సారాన్ని జీవితపులోతుల్లోంచి అర్థం చేసుకోలేని గందరగోళంలో రచయితలు పలాయనవాదాన్ని ఆశ్రయిస్తున్నారు. ఉజ్వలమైన ధిక్కార స్వరం సన్నగిల్లి మళ్ళీ రాజాశ్రిత సాహిత్య సంరంభాలు, పెట్టుబడి స్పాన్సర్డ్ సాహిత్య పండుగల్లో సృజనాత్మకత సామాజిక నిబద్ధత నుండి దూరం జరుగుతున్నది.

ఇవాళ మళ్ళీ సాహిత్య సామాజికతను, సాహిత్య సామాజిక ప్రయోజనాన్ని ఎత్తిపడుతూ రకరకాల సాహిత్య కూటవాదాలను ఓడించాల్సిన బాధ్యత ప్రగతిశీల సాహిత్యకారులకు, ముఖ్యంగా మార్క్సిస్టు రచయితలకు ఉన్నది. ప్రపంచానికి గొప్ప సాహిత్యాన్ని అందించిన మార్క్సిస్టు సాహిత్యకారులు, విమర్శకులను మళ్ళీ కొత్తగా అధ్యయనం చేయాల్సిన అవసరం ఉంది. సాహిత్యంలో వాస్తవికతావాదానికి తిరుగులేని శక్తిని అందించిన రష్యన్ సాహిత్యకారులు ఇప్పటికీ మానవజాతి సాహిత్య చరిత్రలో అగ్రగణ్యులుగా నిలిచే ఉన్నారు. రష్యన్ సాహిత్యం ఇప్పటికీ అంత ప్రభావశీలంగా ఉండగలుగుతోంది అంటే దానికున్న శక్తి ఏమిటి? పుష్కిన్, గొగోల్, టాల్‌స్టాయ్, దొస్తొయెవ్స్కీ, తుర్గెనెవ్, కుప్రిన్, చెహోవ్, గోర్కీ వంటి సృజనమూర్తుల రచన, జీవితాచారణ చూస్తే వీళ్ళంతా సామాజికులైన రచయితలు. రాజకీయ కార్యాచరణలో ఉన్నవారు. అధికారాన్ని ధిక్కరించి ప్రవాస శిక్షలు అనుభవించిన రచయితలు ప్రపంచ సాహిత్యాన్నే సుసంపన్నం చేశారు. ఇవాళ రాజకీయ నిబద్ధత సృజనాత్మకను పలుచబారుస్తుందని విమర్శించే వాళ్ళు, రచయితలకు రాజకీయాలుండొద్దని, సాహిత్యం రాజకీయాలకు అతీతంగా ఉండాలనే వాళ్ళు రష్యన్ సాహిత్యాన్ని చదవాలి. అటువంటి సృజనమూర్తులను సృష్టించిన బోల్షివిక్ విప్లవానికి ఇప్పుడు నూరేళ్ళు. మూడు నాలుగు తరాలుగా మానవాళిని ఉరికెత్తే విప్లవశక్తిగా తీర్చిదిద్దుతున్న ఆ విప్లవాన్ని, ఆ సాహిత్యాన్ని ఈ సంక్షోభ కాలంలో తప్పక మళ్లీ మళ్లీ అధ్యయనం చేయాలి. మనకాలపు ప్రజా ఆకాంక్షల్లో, ఆచరణలో ఆనాటి రష్యన్ సాహిత్య కాంతి బావుటాలు ప్రకాశిస్తున్నాయి.

## రష్యన్ విప్లవం వందేళ్ళ సందర్భంలో ఆ అనుభవాన్ని నేడెలా చూడాలి?

సామ్రాజ్యవాదం గుత్త పెట్టుబడిగా మారుతున్న దశలో విజయవంతమైన ఆ విప్లవం, దానికి ప్రేరణ అందించిన ఆ సాహిత్యం .. ఇవాళ్టి ద్రవ్య పెట్టుబడి సంక్షోభాలను పరిష్కరించే ప్రజా ఆచరణకు తప్పనిసరిగా గొప్పగా పదును పెడతాయి. అయితే ఇరవయ్యవ శతాబ్దంలో సామ్రాజ్యవాద పెట్టుబడి శరవేగంగా విస్తరిస్తూ పోతుండగా జరిగిన మరో ముఖ్యమైన పరిణామం ప్రత్యామ్నాయం అనుకునే సోషలిస్టు శిబిరాలు లేకుండా పోవడం. ఒక మనవీయ ప్రయోగం అనేక బాహ్య, అంతర్గత కారణాల వల్ల దెబ్బతినిపోయి ఓడిపోయింది. అంత మాత్రాన మానవ సమాజం ఇక ఎప్పటికీ లేచి నిబడదు అనడం హాస్యాస్పదం. రాచరికం ఒక్కసారిగా అంతం కాలేదు. బానిస సమాజమూ ఒకే దెబ్బతో కూలిపోలేదు. మానవ ప్రయత్నం కొనసాగింది. అంతిమంగా మార్పు అనివార్యం. మార్పే నిత్యసత్యం. మార్క్స్ చెపినట్లు పెట్టుబడిదారీ సంక్షోభాన్ని చైతన్యయుతమైన కార్మిక వర్గమే వర్గపోరాటం చేసి పరిష్కరిస్తుంది.

ఈ ఏడాదికి బోల్షివిక్ విప్లవ విజయానికి వందేళ్లు పూర్తవుతాయి. మనిషిని పరాయీకరించి, సామూహికత నుండి విడగొట్టి, మనిషిని మనిషిగా ఉండనీయని వర్గసమాజానికి ప్రత్యామ్నాయం ఉందని, అది సుసాధ్యమేనని నిరూపిస్తూ మానవజాతి చరిత్రలో జరిగిన మహోద్భుత ఘట్టం రష్యన్ విప్లవం. అది సామాజిక ఆర్థిక సాంస్కృతిక రంగాల్లో ఎంత గొప్ప మానవీయ ప్రయోగాలు చేసిందో, ఎన్ని విలువల్ని నెలకొల్పిందో పునఃస్మరించుకోవాల్సిన అవసరం నేడెంతో ఉంది. అట్లాగే చైనా మహత్తర శ్రామిక వర్గ సాంస్కృతిక విప్లవానికి 50ఏళ్ళు నిండిన సందర్భం కూడా ఇదే. సాంస్కృతిక విప్లవం మార్క్సిజానికున్న విమర్శనాత్మక దృక్పథాన్ని, నిరంతర వర్గపోరాటతత్వాన్ని, విగ్రహ విధ్వంస లక్షణాన్ని పదునుపెట్టింది. ఆ విమర్శనాత్మక దృక్పథంతోనే సోషలిస్టు ప్రయోగాలను అంచనా వేయాలి. బోల్షివిక్ విప్లవం, చైనా సాంస్కృతిక విప్లవం రెండూ విప్లవ క్రమంలోనూ, సోషలిజాన్ని నిర్మించే క్రమంలోనూ వర్గేతర భావజాలానికి వ్యతిరేకంగా సలిపిన పోరాటం నిత్య స్ఫూర్తిదాయకం. విప్లవం విజయవంతమైన తర్వాత కూడా బూర్జువా శక్తులు తిరిగి అధికారంలోకి రావడానికి ఎన్ని రకాలుగా ప్రయత్నిస్తాయో, కమ్యూనిస్టు నాయకత్వం కూడా సులువుగా అన్యవర్గ భావజాలానికి గురయ్యే ప్రమాదం ఎలా వెన్నంటి ఉంటుందో అవి తెలియజెప్పాయి. నిరంతర వర్గపోరాటం ఏ మాత్రం పట్టు విడిచినా అది బూర్జువా శక్తులకు ఎలా అందివస్తుందో హెచ్చరించాయి. సాంస్కృతిక విప్లవ ప్రభావం మనదేశంలో వర్గపోరాట రాజకీయాలను రివిజనిజం నుండి కాపాడింది. నక్సల్బరీ సాయుధ పోరాటాన్ని మార్క్సిస్టు ఆచరణ రూపంగా స్థిరపరిచింది. రాబోయే మే నాటికి యాభై ఏళ్లు నిండనున్న నక్సల్బరీ ఇవాళ దండకారణ్యంగా వాస్తవరూపం ధరించింది.

## సోషలిజమే ప్రత్యామ్నాయం

ఇది నినాదప్రాయం కాదు. విఫల ప్రయోగంగా పెట్టుబడిదారీ మేధావులు ప్రచారం చేస్తున్న సోషలిజం ఒక శాస్త్రీయ సిద్ధాంతం. పెట్టుబడిదారీ వ్యవస్థ హామీ పడిన బూర్జువా ప్రజాస్వామ్యం ఎంత డొల్లగా తేలిపోయిందో కొత్తగా నిరూపించనక్కర్లేదు. అది ఎట్లా ఫాసిస్టు రూపు తీసుకుంటోందో మోడీలు, ట్రంపులే చెబుతున్నారు. ఈ వ్యవస్థకు ప్రత్యామ్నాయం లేదని విర్రవీగడం తప్ప మనుషులు మనుషులుగా జీవించే వ్యవస్థ ఇది కాదని తేలిపోయింది. చరిత్ర పొడవునా ఆయా స్థలకాలాల్లో వచ్చిన సంక్షోభాన్నిటికీ కార్మికవర్గ విప్లవాలే పరిష్కారంగా వచ్చాయి. మరి సోషలిజమే ఎందుకు ప్రత్యామ్నాయం? పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానంలో ఉన్న వైరుధ్యం పరిష్కరించే దారి సోషలిజంలో ఏర్పడుతుంది. నియంత్రణ లేని మార్కెట్ ఆర్థిక వ్యవస్థలో ఉత్పత్తికి, పంపిణీకి, ఉపయోగితకు మధ్య తీవ్ర వైరుధ్యం ఉంటుంది. అదనపు విలువ దోపిడి ఆధారంగా నడిచే స్వేచ్ఛా మార్కెట్ ఆర్థిక వ్యవస్థ సంపద ఒక్క చోట పోగుపడేలా చేస్తుంది. వ్యవస్థలో సకల దుర్లక్షణాలకు అది మూలం. సోషలిస్టు వ్యవస్థలో వ్యక్తిగత ఆస్తి రద్దు ఉత్పత్తి శక్తులను విడుదల చేసి సంపద అందిరికీ పంపిణీ అయ్యేలా చేస్తుంది. ఇక్కడ లాభాల కోసం ఉత్పత్తి కాదు, సమాజ అవసరాల కోసం ప్రణాళికాబద్ధ ఉత్పత్తి ఉంటుంది. భూమి, నీరు అందరిదీ అయి, ప్రకృతి పెట్టుబడి కబంధ హస్తాల నుండి విడుదలవుతుంది. వినియోగదారునిగా, మార్కెట్ వనరుగా, సరుకుగా ఉండే మనుషులు నిజమైన మానవులుగా ఆవిష్కారమయ్యేది సోషలిజంలోనే. ఇక్కడ దోపిడి, అసమానత తొలగిపోతూ, సకల ఆధిపత్య వ్యవస్థలు అంతరించే ప్రాతిపదిక ఏర్పడుతుంది. కార్మికవర్గ నియంతృత్వం దోపిడీదారులను కట్టడి చేసే శ్రమజీవుల రాజ్యం. అది అంతిమంగా రాజ్యం కూడా అంతరించే కమ్యూనిజాన్ని సాఫల్యం చేస్తుంది. 

● వై. వి. రమణారావు

# శ్రమ గతితర్కం

మానవజాతి అస్తిత్వం, కొనసాగింపునకు మూలమైన ‘ శ్రమ ’ గురించి ముందుగా తెలుసుకుని, ఆ తర్వాత చారిత్రకంగా ఈ శ్రమ ఎలా గతితార్కికంగా అభివృద్ధి చెందుతూ వస్తున్నదో చూద్దాం. శ్రమ అనగానే, ఈ శ్రమ సృష్టించిన సంపద, ఆస్తి గుర్తుకు వస్తాయి. అయితే, చారిత్రకంగా ఈ శ్రమ పరాయీకరింపబడి, ప్రైవేటు ఆస్తికి మూలమయింది. కాబట్టి, శ్రమతో పాటు, శ్రమశక్తి, శ్రామికుడు, ప్రైవేటు ఆస్తి, శ్రమవిలువ, రాజకీయ అర్థశాస్త్రాలను పరిశీలించి చూస్తే, శ్రమ గురించిన అవగాహన మనకు ఎక్కువగా కలుగుతుంది. వీటన్నింటినీ వివరించాలంటే ఇక్కడ స్థలాభావం సమస్య కాబట్టి, వాటి గురించి సంక్షిప్తంగానైనా చూద్దాం.

## 1. శ్రమ, శ్రమశక్తి:

శ్రమ జీవజాతికి ప్రాణం. ఒక జీవజాతి సంపూర్ణ లక్షణం, స్వభావం. స్వేచ్ఛతో కూడిన చైతన్యవంతమైన కార్యాచరణలో మనిషి యొక్క జీవజాతి లక్షణం వుంటుంది. అంటే, శ్రమే జీవితం. ప్రకృతి-శ్రామికుడు: ప్రకృతి లేకుండా శ్రామికుడు దేనినీ సృష్టించలేడు. జ్ఞానేంద్రియజ్ఞాన ప్రపంచం లేకుండా దేనినీ సృష్టించలేడు. పదార్థంలోనే శ్రమ కార్యరూపం దాల్చుతుంది, ఉత్పత్తి చేస్తుంది. ఆ రకంగా, శ్రామికుని భౌతిక మనుగడకు ప్రకృతి (పదార్థమే) మూలం.(ఎకనామికల్ అండ్ పొలిటికల్ మానుస్క్రిప్ట్స్, 1844, సంక్షిప్తంగా,"ఇ.పి.ఎమ్.", దీన్నే 'పారిస్ రాతప్రతులు' అనీ అంటారు): మార్క్స్.......... మానవ హస్తం కేవలం శ్రమచేసే అంగమే కాదు, అది శ్రమ ఫలితం కూడా. ఆ రకంగా, శ్రమే మానవుని సృష్టించిందని చెప్పవచ్చు. ('నరుడు వానరుడిగా మారిన క్రమంలో శ్రమ నిర్వహించిన పాత్ర' లో ఎంగెల్స్). "శ్రమ అనేది, మొదటగా, మనిషీ, ప్రకృతీ ఉభయులూ పాల్గొనే ఒక ప్రక్రియ; దాని ద్వారా మనిషి తన సొంత సంకల్పంతో తనకూ, ప్రకృతికీ మధ్య భౌతిక (లేక పాదార్థిక) ప్రతిచర్యల్ని ప్రారంభించి, క్రమబదం చేస్తూ, అదుపులో వుంచుకుంటూ వుండేటటువంటి ప్రక్రియ అది..........ఈ విధంగా బాహ్య ప్రపంచంపై చర్యలు జరుపుతూ, దాన్ని మార్చడం ద్వారా, అతడు (మనిషి) తన సొంత నైజాన్నే (స్వభావాన్ని లేక ప్రకృతిని) మార్చి వేసుకుంటాడు. తనలో నిద్రాణమైవున్న శక్తుల్ని తట్టిలేపి, వాటిని వికసింపజేసి, తన శాసనానికి విధేయకంగా అవి వర్తించుకునేటట్లు (వాటిని) బలవంతపెడతాడు." (శ్రమ పై మార్క్స్, లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్, గుంటూరు).: శ్రమశక్తి అంటే: పని చేసేందుకు అవసరమైన సామర్థ్యం. శ్రమ అంటే:భౌతికంగా పని చేయటం. శ్రమశక్తి అనేది ఒక చారిత్రక అంశం:'శ్రమశక్తి విలువ'లో:ఒక 'భౌతిక' అంశం (ఒక ఆరోగ్యవంతమైన శ్రామికునికి అవసరమైన కనీస భౌతికావసరాలు) మరియు ఒక 'నీతి-చారిత్రక' అంశం (ఒక సగటు శ్రామికుని జీవన విధానంగా సమాజంలో స్థిరపడినవి అయిన కనీస భౌతిక అవసరాల స్థాయిని దాటి వుండే వాటి యొక్క సంతృప్తికరమైన వాటిని పొందటం)అనే రెండు అంశాలూ వుంటాయి.(ఇంటర్నెట్). : ఒక యంత్రం తాను నిర్వహించే పని కంటే ఎలా భిన్నమో, అలాగే శ్రమశక్తి కూడా అది నిర్వహించే శ్రమ కంటే భిన్నం.(పెట్టుబడి-1). :-శ్రమశక్తి ఎల్లప్పుడూ సరుకుగా లేదు:శ్రమ, శ్రమశక్తులు చరిత్రలో మార్పు చెందుతూ వచ్చాయి. ఉదాహరణకు, బానిస,ఫ్యూడల్ దాసుడు. :శ్రమశక్తిలోని 'జీవశక్తి' లో వున్న కొలతవేయదగని 'పనిచేయగల శక్తే' గుర్రం చేతా,మనిషిచేతా అదనపుశ్రమ చేసే శక్తినిస్తాయి.(వైవిఆర్). :శ్రమశక్తిని కార్మికుడి పెట్టుబడిగా బూర్జువా అర్థశాస్త్రవేత్తలు భావించడాన్ని మార్క్స్ ఖండిస్తాడు. :(పెట్టుబడి,2:పేజీ-368,369). :శ్రమ ఏ ప్రత్యేక రకానికి చెందిందనే విషయం గురించి అలక్ష్యం (పట్టింపులేని తత్వం:indifference) వుందంటే: నిర్దిష్ట శ్రమకు చెందిన కోవ (తరగతు)లలో ఏదీ మరెంతమాత్రం ఆధిపత్యంలో (మిగతా అన్నింటికంటే ప్రబలంగా) లేదనీ, అటువంటి వివిధ కోవలు సమ్మిశ్రితమైన, బాగా అభివృద్ధి చెందిన ఒక (శ్రమ) మొత్తం వుందనీ దాని అంతరార్థం అవుతుంది..... ఇలా ఒక ప్రత్యేక రకం శ్రమ గురించిన అలక్ష్యం అనేది వ్యక్తులు తేలిగ్గా (అల్కగా) ఒక రకం పనినుండి మరొక రకం పనికి సాగిపోగల ఒకానొక సమాజ రూపానికి అనుగుణంగా వుంటుంది; అందువల్ల తమవంతుకు ఏ ప్రత్యేక రకం పనిపడువుందనే విషయమై వారికి పట్టింపు లేకుండా పోతుంది. ఉదాహరణకు, బూర్జువా సమాజాలన్నింటిలో అత్యంత అధునాతనమైన అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో ఈ వ్యవహార స్థితి అత్యున్నత వికాసం చిందింది. ఇక్కడ (అమెరికాలో) మాత్రమే 'శ్రమ' కోవ యొక్క అమూర్తీకరణ:అంటే 'సాధారణత్వంలోని శ్రమ', విశ్లేషణ పదజాలం వెంటలేని శ్రమ (labour sans phrase) వ్యవహారంలో సాధించబడుతుంది.:శ్రమ పై మార్క్స్, లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్, గుంటూరు). : భారీ పరిశ్రమల ఉత్పత్తితో అదృశ్యమయ్యే ప్రత్యక్ష్య శ్రమ:........ శ్రామికుడు (సగర్వంగా), "ఇదిగో, ఇది నేను (ఉత్పత్తి) చేసింది, (ఇది నాది గనుక) దీన్ని నాకోసమే అట్టిపెట్టి వుంచుకుంటాను!" అని పట్టుకుని చూపించేందుకు అసలేమీ వుండదు. ..........ఇలా, దాని ప్రత్యక్ష రూపంలో వుంటూవచ్చే వ్యక్తిగత శ్రమ, సాంఘిక శ్రమగా పరివర్తితమై వుంటుంది. ఈ విధంగా, ఈ ఉత్పత్తి విధానపు ఇంకో ప్రాతిపదిక (అంటే, ప్రత్యక్ష వ్యక్తిగత శ్రమ) అదృశ్యమై పోతుంది. :: (శ్రమ పై మార్క్స్, లెఫ్టిస్ట్ స్టడీ



సర్కిల్, గుంటూరు).

## 2. శ్రామికుడు::

రెండు రకాల శ్రామికులు: 1. శారీరక శ్రమ చేసే శ్రామికులు, 2. మేధో శ్రమ చేసే శ్రామికులు. ఇలా రెండు రకాల శ్రామికులుగా సమాజం విడిపోయి, కొన్ని వేల సంవత్సరాలు అయింది. మనిషి తన నుండి తాను వేరుపడే క్రమానికి శ్రమ విభజన కారణమైంది కూడా. ఇది మనిషి యొక్క సమగ్ర (మానసిక, శారీరక ) అభివృద్ధిని వక్రీకరిస్తుంది. :రెండు చారిత్రక దౌర్భాగ్య స్థితులు: (అ). కార్మికుల దుస్థితి:కార్మికులు 2 రకాలు: 1. ప్రత్యేకనిపుణ కార్మికులు, 2. అతిసామాన్య కార్మికులు. అయితే, పెట్టుబడిదారీ ఆర్థిక శాస్త్రం ఏమంటుందంటే:పై రెండు రకాల శ్రామికుల జీవన స్థితి పై రెండు రకాల వారి మొత్తం సరాసరి లెక్కకడితే, ఉదాహరణకు, 50 సంవత్సరాల క్రిందటికంటే సగటున మెరుగైందని. కానీ, మార్క్స్ ప్రకారం, అతిసామాన్య కార్మికుల సగటు మాత్రమే లెక్కగడితే, వారి జీవన స్థితి మాత్రం 50 సంవత్సరాల క్రిందటికంటే ఏమీ మారలేదని. కాబట్టి, ఈ పైపై సగటు లెక్కలను చూచి శ్రామికవర్గం తన్నుతాను ఇంకా మోసపుచ్చుకోవద్దని అంటాడు. (ఆ). వ్యభిచార దౌర్భాగ్యంలో సమాజం:ఆస్తిలేని పేద జీవితంలో వ్యభిచారం దాని అన్ని రూపాలలో కనపడుతుంది. చింకిపాతల జీవులు, ఎముకల గూళ్ళు. ఇంగ్లండులోని వ్యభిచారుల దయనీయ జీవితం గురించి సి.హెచ్.లౌడన్ ఇలా అన్నారు "........6/7 సం॥లు మాత్రమే ఆయుస్సు కల్గే ఆ వ్యభిచారుల వృత్తి కొనసాగాలంటే, గంటకు ఒకరు ఆ వృత్తి లోకి రావాల్సి వుంటుంది.".......... అవసరం తీరాక ఒక పరిశ్రమ ఒక క్షణం కూడా కార్మికులను పనిలో ఉండనివ్వదు. ఇటువంటి పరిస్థితులలో శ్రామికుడు తనను, తన శ్రమను ఏ ధరకైనా అమ్మేస్తాడు. ఎంత కష్టమైన, నీచమైన పనైతే, అంత తక్కువ వేతనం పొందుతాడు. నిర్విరామంగా రోజుకు 16 గంటలు కష్టపడి పనిచేసే కార్మికుడు కేవలం చావకుండా బ్రతికే హక్కు మాత్రమే పొందగల్గుతాడు. :(ఇ.పి.ఎమ్.:మార్క్స్).

## 3.శ్రమ విలువ, శ్రమశక్తి విలువ(వేతనం):

1. అర్థశాస్త్రం 'శాస్త్రం' కాకమునుపు, అయిన తర్వాత, 'సరుకువిలువ'పై దాని అభిప్రాయాలు: 1.ధరలు సాధారణంగా కేవలం యాదృచ్ఛికంగా నిర్ణయింపబడినట్లు కనిపిస్తుందని పూర్వం అనుకునేవారు. 2. కానీ, అది శాస్త్రంగా అయిన వెంటనే, ఈ యాదృచ్ఛికాన్నే పాలించే నియమాన్ని కనుక్కోవడం దాని ప్రథమ కర్తవ్యాలలో ఒకటిగా వుండింది. 3. సరుకు యొక్క విలువ, సరుకులో వున్నట్టి, దాని ఉత్పత్తికి అవసరమైనట్టి శ్రమ చేత నిర్ణయింపబడుతుందని సాంప్రదాయిక అర్థశాస్త్రం అప్పుడు కనుక్కుంది. ఈ వివరణతో అది తృప్తిపడింది. 4. సరుకు విలువ 'సరుకు యొక్క ఉత్పత్తి ఖర్చుకు సమానం' అన్నది.:: (ఎంగెల్స్- మార్క్స్ 'వేతన శ్రమ, పెట్టుబడి' పై ముందుమాటలో). :సంప్రదాయపు అర్థశాస్త్రం చిక్కుకున్న పద్మవ్యూహం నుండి బయటికి దారి కనుక్కున్నవాడు మార్క్స్. అర్థశాస్త్రులు, సరుకు యొక్క ఉత్పత్తి ఖర్చుకు సమానమన్న 'శ్రమ యొక్క ఉత్పత్తి ఖర్చు' అన్నది:నిజంగా 'కార్మికుని యొక్కా, అతనితో పాటు అతని శ్రమశక్తి యొక్కా ఉత్పత్తి ఖర్చే' . - శ్రమధరవేతనంవశ్రమశక్తి ధర:వేతనం అనేది శ్రమశక్తి ధరకు, మానవ రక్తమాంసాలు తప్ప మరే ఉనికీ పట్టూలేని యీ విశిష్టమైన సరుకు యొక్క ధరకు, ప్రత్యేకమైన పేరు మాత్రమే. దీనిని మామూలుగా, 'శ్రమధర' అంటారు. ( 'వేతన శ్రమ, పెట్టుబడి' లో :మార్క్స్ ). - "మార్పిడి విలువ, ఉపయోగపు విలువ అనేవి (ఇవి 'సరుకు' యొక్క 2 విలువలు) వీటి స్వభావం రీత్యా కొలవబడజాలని పరిమాణాలు. 'శ్రమ విలువ', 'శ్రమ ధర' లాంటి మాటలు, 'పత్తి విలువ', 'పత్తి ధర' లాంటి మాటల కంటే నిరేతుకమని అన్పించవు (మనకు)........... :పెట్టుబడిదారునికి కార్మికుడు సరఫరా చేసిన ఉపయోగపు విలువ, నిజానికి శ్రమశక్తి కాదు. అది, దాని (శ్రమశక్తి యొక్క) క్రియ అయిన కొంత నిర్దిష్ట శ్రమ మాత్రమే. అంటే:కుట్టుపని, పాదరక్షల తయారీ, వడకటం, వగైరా మాత్రమే. ఇదే శ్రమ, మరోవైపున, 'సార్వత్రిక విలువ'ను ( మారకపు విలువను, ఉదాహరణకు, 'డబ్బు'ను': వై.వి.ఆర్.) సృష్టించే అంశమనీ, ఆ రకంగా అది మిగిలిన సరుకులన్నిటి కంటే భిన్నమైన ఒక ధర్మాన్ని కలిగి వుందనీ మామూలు బుర్రకి తోచదు.: -(పెట్టుబడి-1, :పేజీ-496, మార్క్స్).: శ్రమ తీవ్రతతో పాటు, పోటీ కూడా పెరిగి, చివరికి, వేతనం తగ్గుతుంది. : వేతనాల నిగూఢత్వాన్ని ఛేదించటానికి చరిత్రకి దీర్ఘకాలం పట్టింది. అయినా అది తేలికైన పనే." (పెట్టుబడి-1:పేజీ-496,మార్క్స్).

## 4.రాజకీయ అర్థశాస్త్రం::

"రాజకీయ అర్థశాస్త్రం ఒక సిద్ధాంతాన్ని కనిపెట్టింది:గుర్రానికి దానాలా, పనిచేయడానికి సరిపోయేటంత మాత్రమే శ్రామికునికి వేతనంగా ఇవ్వాలి. వ్యక్తిగత ఆస్తి అనే వాస్తవం నుండి రాజకీయ అర్థశాస్త్రం బయలుదేరింది. కానీ, దానికి అర్థం చెప్పదు, వివరించదు. అలానే, సాధారణ 'వైరూప్య సూత్రాలు' వ్యక్తిగత ఆస్తిని కాపాడే శాసనాలుగా మారాయని కూడా దానికి తెలుసు. కానీ, దాని నియమాలను రాజకీయ అర్థశాస్త్రం విడమర్చి చెప్పదు. అంటే:ఈ నియమాలు వ్యక్తిగత ఆస్తి స్వభావం నుండి ఎలా బయటకు వచ్చాయో బహిర్గతం చెయ్యదు. ఉదాహరణకు: లాభం, వేతనాల మధ్య సంబంధాన్ని సూత్రీకరించే సమయంలో, పెట్టుబడిదారుల ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకొని ప్రారంభిస్తుంది. అంటే: ఏ ప్రతిపాదనను వివరించాలో ముందే ఊహించుకుంటుంది. అలాగే, తరచుగా పోటీని చర్చలోకి తెస్తుంది. రాజకీయ అర్థశాస్త్రాన్ని చలనంలో ఉంచిన చక్రాలు: కేవలం అత్యాశ, ధనదాహం, పోరాటమైన పోటీ. ఇప్పటికే రాజకీయ అర్థశాస్త్రవేత్త చేసిన పొరపాట్లు మనం చేయకూడదు. ఇతడు తన వివరణ కోసం ఆదిమ ప్రపంచ పరిస్థితులను (చారిత్రక పరిస్థితులను) తనకు అనుకూలంగా ఊహించుకొన్నాడు. ఉదాహరణకు, మానవ పతనం చెడుకు ప్రారంభమని మతధర్మశాస్త్రం వివరిస్తుంది (అనే దానిని ఊహించుకున్నాడు). దురదృష్టకరమైన 'పని దొరకడం' కూడా 'అదృష్టమనే'

భావనను కార్మికుల్లో కల్గిస్తుంది. కార్మికులకు ఆటవిక జీవనం కూడా రాజస్వంలా కన్పడుతుంది. కార్మికుని అవసరాలు కనిష్టస్థాయికి కుదించివేయబడి, కేవలం కార్మికుని భౌతిక అస్తిత్వానికి, చాలినంతగా మాత్రమే వుంటాయి. అతని కార్యకలాపం (శ్రమ) 'నైరూప్య' ( రూపం లేని) 'యాంత్రిక' చలనంగా మార్చబడుతుంది. కార్యకలాప రంగంలో కానీ, వినిమయరంగంలో కానీ:మానవునికి మరే ఇతర అవసరాలు వుండవని రాజకీయ అర్థశాస్త్రవేత్త చెబుతాడు. ఇటువంటివాటిని కూడా: మానవ జీవితమనీ, మానవ అస్తిత్వమనీ చెబుతాడు. 'జీవితం' అంటే అత్యంత దారుణమైన 'దీనావస్థ' అనీ ; కార్మికుడంటే: జ్ఞానేంద్రియాల కోర్కెలూ, అవసరాలూ 'లేనివాడుగా' రాజకీయ శాస్త్రవేత్త భావిస్తాడు. అన్ని కార్యకలాపాలనూ: శుద్ధ సారంగా, 'కార్మికుని శ్రమ'గా అతడు మారుస్తాడు.(ఇపిఎమ్, 1844-మార్క్స్). అర్థశాస్త్రవేత్తలు రాజకీయ అర్థశాస్త్రాన్ని తీక్షణమైన, ఖచ్చితమైన సూత్రాలుగా కుదిస్తారు. రాజకీయ అర్థశాస్త్రంలో నిజమైన నియమం యాధృచ్ఛికతే." (జేమ్స్ మిల్ పై మార్క్స్). -"'ఆస్తి అన్యాక్రాంతమై డబ్బుగా మారుతుంది' అన్న మిల్ చెప్పింది అసలు విషయం కాదు. వస్తువుల మార్పిడికి 'మనిషి యొక్క మధ్యవర్తిత్వం' అనే 'సామాజిక వ్యవహారం' అయిన మానవ కార్యకలాపం: మనిషితో ప్రమేయంలేని ఒక బాహ్య పదార్థపు (డబ్బు యొక్క) లక్షణంగా మారిపోతోందన్నది అసలు సంగతి. మధ్యవర్తిత్వం అనే తన ఈ కార్యకలాపాన్నే మనిషి అన్యాక్రాంతం చేస్తాడు. కనుక అతడు తనను తాను, తన మానవ స్వభావాన్నీకోల్పోతాడు. వస్తువుల మధ్య సంబంధమూ, వస్తువులతో మనిషి నిర్వహించే కార్యకలాపాలూ ఇక మానవ కార్యకలాపాలుగా వుండక, మనిషికి బాహ్యంగా, మనిషికి అందని ఏదో వేరే శక్తి కార్యకలాపాలుగా అవి మారతాయి. .......... దానితో అతని దాస్యం పరాకాష్టకు చేరుకుని, ఇక ఈ పరాయి శక్తిని పూజించడం అన్నది దానంతటదే ఒక లక్ష్యం అవుతుంది." (జేమ్స్ మిల్ పై మార్క్స్).

## 5. ఈ వ్యాసానికి ప్రధాన ఆధారం:

ఆంగ్లంలో సి.జె.ఆర్థర్ రాసిన 'డయలెక్టిక్స్ ఆఫ్ లేబర్' అనే గ్రంథం. ఆర్థర్ ఏమంటాడంటే:పెట్టుబడి అంటే పోగుచేయబడిన ప్రైవేటు ఆస్తే గనుకా, ఈ ప్రైవేటు ఆస్తి అనేది దోపిడీ చేయబడిన శ్రమకు సమానమే కనుక, శ్రమ మరియు పెట్టుబడుల మధ్య జరిగే పోరాటాన్ని మనం, శ్రమ మరియు ప్రైవేటు ఆస్తి మధ్య జరిగే పోరాటంగా చూడొచ్చు అని. అయితే, శ్రమ నుండే ప్రైవేటు ఆస్తి ఉత్పన్నమౌతుంది మరియు ప్రైవేటు ఆస్తి ద్వారానే శ్రామికునిలోని 'శ్రమ' పెట్టుబడిగా మారుతుంది. కాబట్టి, మానవ సమాజమంతా ఈ ప్రైవేటు ఆస్తి అనేదాని చుట్టూనే తిరుగుతోంది అంటూ, అలా, శ్రమ మరియు ప్రైవేటు ఆస్తి యొక్క గతితార్కిక చలనాన్ని చెప్పే పనికి పూనుకుంటాడు. :ప్రైవేటు ఆస్తిని గురించి ఎవరైనా మాట్లాడేటప్పుడు, అది మానవునికి 'బాహ్యమైనదిగా' భావిస్తాడు. ఎవరైనా 'శ్రమను' గురించి మాట్లాడేటప్పుడు, 'మానవుణ్ణే' లెక్కలోకి తీసుకుంటాడు (అంటే, సమాజంలో 'ప్రైవేటు ఆస్తి' అనేది: సాధించవలసిన ఒక విషయంగానో, పొందాల్సిన ఒక వస్తువుగానో కన్పడుతుంది:ప్రతిమనిషికీ:వై.వి.ఆర్.). దీని ప్రకారం, ఆస్తి అంటే ఒక 'సాంఘిక సంస్థ' వంటిదని మనకు తెలుస్తుంది. భౌతిక వస్తువుల ఉత్పత్తి మరియు పంపకాల్లో మానవ సంబంధాలను వ్యవస్థీకరించటం అనే పద్ధతే ఇది అని తెలియాలి. చివరగా, ఇది మానవులచే తయారుచేయ బడ్డదని అర్థం చేసుకోవాలి. కానట్లయితే, మానవ చరిత్రలో ఉత్పత్తి మరియు పునరుత్పత్తి చేయబడేదంతా 'ప్రకృతి పరంగా ఏర్పడినదే' అనే అసంబద్ధ తీర్మానం/నిర్ణయం (దీన్ని మానవజాతి అస్తిత్వానికే పునాదిగా భావిస్తూ తీసుకునే వీలుంది. మార్క్స్ ఏమంటాడంటే:"ఉత్పత్తి విధానం యొక్క ఫలితమైన వస్తువు (శ్రమ ఫలం)లో అన్యాధీకరింపబడిన శ్రమ ఫలితం వుందంటే, దాని అర్థం:ఉత్పత్తి విధానమే పరాయీకరింపబడి వుండాలి" అని. : 'ఉత్పాదక కార్యకలాపం' అనే మాధ్యమం ద్వారానే మానవునికి ప్రకృతితో గల సంబంధాన్ని మానవుడూ, ప్రకృతీ ఒకరిపై ఒకరికి గల సంబంధాన్ని మార్పు చెందిస్తూ సాగటాన్ని బట్టి, ఇది మానవ అస్తిత్వాన్ని చారిత్రకంగా ధృవపరుస్తుంది అని చెప్పటం వల్ల, మార్క్స్ అలా ఇ.పి.ఎమ్. **1844** లో, చారిత్రక భౌతికవాద దృక్పథం యొక్క లక్షణాలను వెల్లడి చేశాడు.

:రాజకీయ అర్థశాస్త్రం:ఉత్పత్తికి గుండెకాయ వంటిదంటూ 'శ్రమ'తో మొదలెట్టినా కూడా, శ్రమకు ఏమీ ఇవ్వకనూ, ప్రైవేటు ఆస్తికి అంతా చెందేటట్లూ చెప్పి, చేస్తూండటం వల్ల, ఒక గందరగోళం/ అసంబద్ధత వుందంటాడు మార్క్స్. 'ప్రౌధాన్' ఈ సమస్యను పరిష్కరించటంలో, శ్రమకు అనుకూలంగానూ మరియు ప్రైవేటు ఆస్తికి వ్యతిరేకంగానూ వ్యవహరించటం వల్ల,అతనిది అసంపూర్ణ గతితర్క విధానమైంది అంటూ మార్క్స్:"మనం ఎదుర్కొనేది 'అన్యాధీకరింపబడిన శ్రమ దానికదే లోనైన వైరుధ్యం' గురించి" అంటాడు.:::-(సి..జె. ఆర్థర్). "శ్రమ యొక్క ఉత్పాదితం నాకు అన్యమైనది. అది నాకు ఎదురుగా అన్యమైన శక్తిగా నిలబడితే, అప్పుడది ఎవరికి చెందుతుంది? జవాబు: నాకు గాక ఇతర మానవునికి. ఈ జీవి ఎవరు? దేవుళ్ళా? తొలి దినాలలో శ్రమ యొక్క ఉత్పత్తి దేవుళ్ళకు చెందడం వాస్తవమే. ఉత్పత్తిలో అధిక భాగం వారికే చెందేది. ఉదాహరణకు, దేవాలయ భవనాలు, మొ//వి: ఇండియా, ఈజిప్టు, మెక్సికోలలో. కేవలం దేవుళ్ళే శ్రమకు యజమానులు కారు. (రాజులు, పూజారులు, మంత్రగాళ్ళు, వగైరాలు కూడా యజమానులే). ప్రకృతి యొక్క విషయంలో కూడా ఇదే వాస్తవం. :తన శ్రమ ద్వారా మానవుడు ప్రకృతిని వశపరచుకొని, తన పరిశ్రమ వల్ల ఉత్పత్తిలో అద్భుతాలు సృష్టించిన కొద్దీ, ఉత్పత్తిని అధికం చేయడంలో దేవుని అద్భుతాలు అబద్ధాలని తేలిపోయిన కొద్దీ, మానవుడు తాను చేసిన ఉత్పత్తిలో వచ్చే సంతోషాన్ని నిర్బంధంగా· (అంటే, రాజులు, పూజారులు, యజమానుల బలప్రయోగ సంస్కృతిలో, ఆచరణలో: వై.వి.ఆర్.) కోల్పోతాడు. అలాగే, వీరితో వుండే విభేదాల వల్ల, తాను చేసిన ఉత్పత్తిని,తనకు దక్కాల్సిన సుఖసంతోషాలను కోల్పోతాడు. ఇదొక వింత విషయం, విడ్డూరం. ఈ రకంగా, దేవుళ్ళు కాదు, ప్రకృతి కాదు. కేవలం 'మరోమనిషే' మనిషిపై అన్యాధీకరణమైన శక్తి. :పై ప్రతిపాదనను పరిశీలిస్తే, మనిషితో మనిషి సంబంధం:ఇతర మానవులతో సంబంధం ద్వారానే వస్తుగతమైన /పాదార్థికమైన యదార్థమవుతుంది (అంటే, 'హెగెల్'లాగా, కేవలం ఆత్మగతంలోనే తత్వ విచారణ చేయుటం వల్ల ఈ విషయం: 'కేవలం ఆలోచనలోనే' పుట్టి, సాగి, సమాజంపై, మనిషిపై ఆత్మగతమైన, యదార్థం (భౌతికం)కాని) తప్పునిర్ధారణలను బయటికి తెస్తుంది.: వై.వి.ఆర్). కార్మికుడు పెట్టుబడిని ఉత్పత్తి చేస్తాడు. పెట్టుబడి కార్మికుణ్ణి ఉత్పత్తి చేస్తుంది. అంటే, కార్మికుడు తనను తానే ఉత్పత్తి చేసుకుంటాడు. మానవుడు: ఒక కార్మికుడిగా, ఒక సరుకుగా ఈ పూర్తి చక్రీయగతి యొక్క ఉత్పత్తి.:(ఇ.పి.ఎమ్. లో మార్క్స్).

## 6. మార్టిన్ లూథర్(మతం), స్మిత్(సంపద) -

'"సంపదకు మూలం శ్రమే'నని స్మిత్ చెప్పినపుడు అతడు, 'బూర్జువా రూప' సంపదగానే దాన్ని చూచి, దానికి 'మూలం' గా 'విలువను ఉత్పత్తి చేసే శ్రమ' నే పేర్కొన్నాడు. మార్క్స్ అందుకనే స్మిత్ ను 'అర్థశాస్త్రపు లూథర్' అన్నాడు. ఎందుకంటే:విగ్రహారాధన,

మతగురువులు, ఆచారాలు, చర్చిలు, మొదలగు రూపాలలో వున్న మతతత్వం యొక్క బాహ్యరూపాలను నిరసించి, అందుకు ప్రతిగా , మార్టిన్ లూథర్ (సీనియర్ ) ఎలాగైతే మతవిశ్వాసుల హృదయాలలో దైవభావనను మరింత గట్టిగా పాదుకొల్పాడో, సరిగ్గా అలాగే, స్మిత్ కూడా, బంగారం మరియు ఇతర రూపాలలో వున్న సంపద యొక్క బాహ్యరూపాలపై వాణిజ్యవేత్తలకు గల భ్రమలను పరిహసిస్తూ, సంపద (అంటే, విలువ:వై.వి.ఆర్.) యొక్క అంతర్గతసారంగా 'ఆస్తి' అనే అభివర్గానికి చెందినదైన 'శ్రమ'ను (బూర్జువా అర్థశాస్త్రం దృష్ట్యా గల 'మారకపు విలువను' మాత్రమే సృష్టించే శ్రమ అని ఇక్కడ అర్థం: వై.వి.ఆర్.) మరింత గట్టిగా పాదుకొల్పాడు."

: "మార్టిన్ లూథర్ సీనియర్ ఎలాగైతే: మతతత్వ బాహ్యరూపమైన నైతిక విలువలు లేని కేథలిక్కుల అనైతిక విలువలతో" ఘర్షణ పడి ఆ బాహ్యరూపాన్ని అధిగమించి, 'పూజారి (ప్రీస్ట్) అంటే:సామాన్య మానవుని కంటే ప్రత్యేకమైన వారు' అనే భావనను రద్దుపరచి, పూజారిని 'సామాన్య మానవుని హృదయం' గా మార్చిన విధంగానే; సంపద (వ్యక్తిగత ఆస్తి): మానవునికి బాహ్యమైనది, స్వతంత్రమైనది కాబట్టే, దానిని బాహ్యంగానే సాధించాలి, బాహ్యంగానే నిర్వహించాలి, రద్దుచేయాలి" అంటాడు. అంటే:సంపద/వ్యక్తిగత ఆస్తి పోవడానికి మానవుడు నీతులు చెప్పో, మతపరంగానో, తాత్వికంగానో దానిపై విజయం పొందలేడనీ, బాహ్యంగా ఏర్పడిన ఆ దోపిడీ సంపదను బాహ్యంగానే ఎదుర్కొంటూ, దాన్ని రద్దుచేయాలి . అంటే, ఏ మేరకు ప్రైవేటు ఆస్తి, మానవునిలో భాగమై వుందో, దాని బాహ్య, బుద్ధిలేని 'వస్తుగతమైన' దానిని రద్దుచేయాలి" అంటాడు మార్క్స్. .:(ఇ.పి.ఎమ్. లో మార్క్స్).

7. 'ప్రైవేటు ఆస్తి' యొక్క 'గతితర్క' అభివృద్ధి తెలియకుండా, "ఆదర్శం, నీతి, సమానత్వం అనే ఆశలపై ఆధారపడి మాత్రమే" కమ్యూనిజాన్ని సాధించలేము ( ఉదాహరణకు, మొరటు కమ్యూనిజం) : : అన్యాధీకరణకు గురైన జీవితం నుండి, 'జీవితంపై అతని వ్యక్తీకరణ' వచ్చింది. :-(ఇ.పి.ఎమ్., **1844** లో మార్క్స్). :'అన్యాధీకరణ' అనే ముసుగులో ప్రైవేటు ఆస్తి ఆధిపత్యంలో/పరిపాలనలో వ్యవస్థ యొక్క మొత్తం అభివృద్ధి జరుగుతుంది. 'అన్యాధీకరణను రద్దు చేయాలంటే, ప్రైవేటు ఆస్తిని రద్దు చేయాలి. అయితే, ప్రైవేటు ఆస్తి రద్దును కేవలం 'అనిర్దిష్ట వ్యతిరేకత' (అంటే: ప్రైవేటు ఆస్తి అంటే ఏమిటో తెలియకుండానే, అది పోవాలనే ఆకాంక్ష లేదా దాని సంస్కరణ రూపాలకై వెదుకులాట: వై.వి.ఆర్.)తో చేస్తే గనుక, దానర్థం ఏమిటంటే:"సంస్కృతి మరియు నాగరికతల రద్దు (లేదా అధిగమించటం), అస్వాభావికమైన 'పేదవారి అతి సాధారణ జీవితాన్ని' అధిగమించాలని కోరటం, అవసరాలు లేని మొరటు మానవునికై ఆశించటం అంటే: అతను ప్రైవేటు ఆస్తి దాటివెళ్ళే ప్రయత్నం చేయటంలో విఫలమైనవాడే కాక, ప్రైవేటు ఆస్తిని కనీసం చేరనైనా చేరనివాడు" అని అర్థం.

"మానవజాతి లోని నిద్రాణమైవున్న (slumbering) శక్తులను తట్టిలేపి మరియు సాధారణ శ్రామికుని శ్రమపడే తత్వాన్ని మెరుగు చేయటానికి పెట్టుబడి యొక్క బలప్రయోగం తప్పనిసరైంది. 'ఇంతకు ముందటి కమ్యూనిస్టు సిద్ధాంతకారులు ప్రైవేటు ఆస్తి యొక్క ఆశావహ సారాన్ని గ్రహించలేదు' అంటాడు మార్క్స్. ప్రైవేటు ఆస్తి యొక్క సంబంధంలో గల సారాన్ని విమర్శనాత్మకంగా పరిశీలించకుండానే, ఆస్తి గల వారిపై 'ద్వేషం' వుండాలనే ప్రాతిపదికపై నిలబడి మాత్రమే 'మొరటు కమ్యూనిజం' అనేది ఆధారపడింది. దాని కార్యక్రమం ఏమంటే:అన్ని అసమానతలను రూపుమాపుతూ, ఏ రకమైన వ్యక్తిగత తేడాలున్నా వాటినన్నింటినీ రద్దు చేయాలంటూ, 'సమానత్వం' అనే దాన్ని బలవంతంగా మోపటం, అంటే: 'శ్రామికుడు' అనే అభివర్గాన్ని గురించి తెల్సుకోకుండానే (శ్రామికుడు అంటే 'పనివాడు' అనుకుంటూ: వై.వి.ఆర్.) మనుష్యులందరికీ వర్తింపజేసింది. ప్రైవేటు ఆస్తి యొక్క సంబంధం అనేది:వస్తువుల ప్రపంచంతో సంఘానికి గల సంబంధంగా కొనసాగింది. సంఘం అనేది 'ఒక అనిర్దిష్ట పెట్టుబడిదారుడు' అనేదిగా వుంటూ, సమాన వేతనాలను చెల్లించేది. కాబట్టే, 'ఆస్తి' అనేది ఒక ప్రపంచ వ్యాపితమైన దానిగా ఎక్కువగా అభివృద్ధి/(మార్పు చెందిన) అధిగమించిన రూపంగా చెందలేదు (అప్పుడు). పర్యవసానంతో, ప్రైవేటు ఆస్తిని వ్యతిరేకించే చలనాల జంతురూపం 'వివాహం'లో వ్యక్తమవుతుంది. వివాహ వ్యవస్థను అందరూ అంగీకరించరు. అది ప్రత్యేకమైన ప్రైవేటు ఆస్తి. అయితే, స్త్రీలు 'గుంపు యొక్క సమిష్టి ఆస్తి'గా వున్న సమాజాలలో ఈ వివాహ వ్యవస్థ వ్యతిరేకమైనదిగా వుంటుంది..." .:(ఇ.పి.ఎమ్. లో మార్క్స్).

:ప్రైవేటు ఆస్తి అనేది మానవుల మధ్య సౌభ్రాతృత్వానికి అడ్డంగా వుండే ఒక అతీంద్రియ శక్తిగా ఎదురవడాన్ని ద్వేషిస్తూ మాత్రమే వుండే 'మొరటు కమ్యూనిజం' అనేది అందుకనే, ప్రైవేటు ఆస్తి యొక్క 'సానుకూల సారాన్ని' గ్రహించలేదనీ 'అవసరం' యొక్క 'మానవ స్వభావం' దానికి అందుకనే అర్థం కాలేదు, అది ప్రైవేటు ఆస్తి యొక్క 'బందీ'గా భ్రష్టత్వంలోనే వుంది అంటూ, ఆ రకంగా, మొరటు కమ్యూనిజానికి, ప్రైవేటు ఆస్తి ( పొట్లూరి వెంకటేశ్వర రావు గారు ఇక్కడ, చాలాచోట్ల, 'వ్యక్తిగత ఆస్తి' అని అనువాదం చేశారు,కానీ 'ప్రైవేటు ఆస్తి' అనే పదమే సరైనది:వై.వి.ఆర్.) యొక్క సిద్ధాంతం అర్థం అయింది, 'సారం' అర్థం కాలేదు" అంటాడు మార్క్స్ (ఇ.పి.ఎమ్. **1844** లో). సి.జె. ఆర్థర్ ఏమంటాడంటే: "మార్క్స్ చెప్పినట్లు, గత కాలాలన్నింటిలోనూ గల అభివృద్ధిలో సంపద యొక్క మార్పులలో జరుగుతూ వస్తున్న వాటిలోని 'అవసరమైన మానవీయమైన వాటిని, గతితార్కికమైన వాటిని నిల్పుకూంటూనే, ప్రైవేటు ఆస్తిని మనం రద్దు చేయాలి/అధిగమించాలి, అదే దాని 'సారం'" అంటాడు. : ఈ మొరటు కమ్యూనిజం సిద్ధాంతం అనేది అందుకనే దాని సిద్ధాంతానికి అనుకూలమైన ఉదాహరణలుగా చరిత్రలోని 'సహకారం' వంటి వాటిని సాక్ష్యాలుగా ఏరుకుంటూ తన్నుతాను సమర్థించుకుంటుంది. మార్క్స్ ఏమంటాడంటే: "ఈ ఉదాహరణలను చూపటంలో మొరటు కమ్యూనిజం ఎంతవరకు సఫలత చెందగలదంటే:ఈ అభివృద్ధి యొక్క అధికభాగం దాని వక్కాణింపులను వ్యతిరేకిస్తుంది మరియు ""కమ్యూనిజం' అనేది గతంలో ఒకసారి ఉండేది" అనే విషయం గనుక నిజమైతే, 'ఆవశ్యకమైన ఒక సామాజిక స్థితి'గా వుండాల్సిన దానిగా ఈ మొరటు కమ్యూనిజం అనే సిద్ధాంతమే నొక్కి చెప్పే దాని సొంత ప్రాతిపదికను, ఆ గతంలోని విషయమే ఆధారసహితంగా తీసిపారేసినట్లు కాగలదు" అని (అంటే, ఆ సామాజిక స్థితి పోయి, తర్వాత దానికంటే ఎక్కువ అభివృద్ధి చెందిన సామాజిక వ్యవస్థలైన ఫ్యూడల్, పెట్టుబడిదారీ వ్యవస్థలు వచ్చాయి కనుక, గతించినట్లుగా 'మొరటు కమ్యూనిజం' చూపించే ఆ 'కమ్యూనిజం' అనే సామాజిక స్థితి, ఆ రకంగా 'తక్కువ అభివృద్ధి చెందిన స్థితి' అని మొరటు కమ్యూనిజమే ఒప్పుకోవాల్సి వచ్చేది, అని అర్థం: వై.వి.ఆర్.). మార్క్స్ ఏమంటాడంటే: "కమ్యూనిజం అనేది తక్షణ భవిష్యత్తు యొక్క ఆవశ్యకమైన రూపం/ఆకృతి మరియు చలనశీల నియమం; కానీ,కమ్యూనిజం అనేదే మానవ అభివృద్ధి యొక్క లక్ష్యం కాదు,మానవసమాజం యొక్క రూపు కాదు." (ఇ.పి.ఎమ్).

(మిగతా వచ్చే సంచికలో...)



# నాన్న

**నాన్న గురించి ఏం రాయాలి? నాన్నను తలుచుకుంటే కలిగే భావనలు నాలో ఒక భాగంగా, అంతర్భాగంగా ఉన్నాయి. వీటిని బయటకు తీసి చెప్పడం బహుశా కృత్రిమంగా ఉంటుంది. నాన్న గురించి విరసం మిత్రులు అనేక కోణాల నుంచీ విశ్లేషించారు. నిజంగానే వారన్నట్టు అది ఒక ఆవిష్కరణే. ఈ ఆవిష్కరణ వ్యక్తిది కాదు. ఆ వ్యక్తిని రూపొందించిన చరిత్రది. చరిత్రలో భాగంగా ఉండే వ్యక్తులు తమకు ఉన్న స్వీయాత్మక పరిస్థితిలో, స్వీయాత్మక కృషితో రూపొందుతారు. ఈ కృషితో సమాజానికి ఉపయోగపడే విధంగా ఉన్నవారి గురించి మన స్మరణ. ఆ కృషి నుంచీ మనం అనుసరించతగ్గదీ, ముందుకు తీసుకువెళ్లేదీ అర్థం చేసుకోవడం కోసం జ్ఞాపకాలు సమిష్టిగా కలబోసుకుంటాం.**

● కొండతల్లి

నాన్న పోయి ఏడు నెలలు దాటింది. ఈ కాలంలో అనేక కోణాల నుంచీ మిత్రులు రాసారు. నేను కూడా రాయాలనే అనుకున్నాను. కానీ రాయలేకపోయాను. ఇప్పుడు కూడా, నా కర్తవ్యం నెరవేర్చాలన్న భావంతో రాయడానికి పూనుకున్నానే కానీ, ఎక్కడ మొదలుపెట్టాలో ఏమేం చెప్పాలో అర్థం కానట్టే ఉంది.

ఒక కూతురిగా నాన్న గురించి చెబుతాను. అలాగే ఒక కార్యకర్తగా రూపొందిన క్రమంలో నాన్న గురించి చెబుతాను.

నాకు ఊహ తెలిసేనాటికి నాన్నంటే భుజాల మీద ఎక్కించుకుని తిరిగే, కాళ్ల మీద వేసుకుని పాటలు నేర్పించే ఒక ప్రేమాస్పదమూర్తి. నాకు కాళ్ల నొప్పులు ఉన్నప్పుడు కాళ్లు నొక్కేవాడు. తనకు ఉన్నప్పుడు తొక్కించుకునేవాడు. వెన్నెల రాత్రుల్లో సముద్రం దగ్గరకు తీసుకెళ్లేవాడు. ఇసకలో అందరం ఆడుతుంటే, మధ్యలో వెళ్లి ఈతకొట్టి వచ్చేవాడు. ఇంట్లో ఎక్కువ ఉండేవాడు కాదు. ఉన్నప్పుడు చీటికీ మాటికీ ముద్దులు అడిగేవాడు. ముద్దు పేర్లతో పిలుస్తూ ఉండేవాడు. ఇలా ఎప్పటికీ ముద్దులు పెట్టించుకునే, తొక్కించుకునే, కాళ్లు పట్టే వ్యక్తి నాన్నైతేనేం, తాతైతేనేం, భయం ఎందుకు ఉంటుంది? నాన్న గురించి నేను చెప్పదలచుకున్న మొదటి మాట ఇదే. నాన్నంటే భయం లేదు నాకు. పితృస్వామ్య సమాజం తండ్రి పట్ల భయభక్తులతో ఉండాలంటుంది. పిల్లలు భయపడరేమోనని తండ్రులు జాగ్రత్తపడుతూంటారు. నాన్న ఈ రకంగా జాగ్రత్తపడలేదు. మమ్మల్ని పడనివ్వలేదు. నాన్నంటే నాకు 'పిచ్చి ప్రేమ'.

బరువు మోయవలసి వచ్చినా, బండ పనేదైనా చేయవలసి వచ్చినా నాన్న చెయ్యవలసిందే. ఎక్కడికైనా వెళ్లేటప్పుడు స్కూటర్ మీద వెనకాల ఇద్దరు కూర్చుంటే, వాళ్ల ఒళ్లో మరో ఇద్దరు పిల్లలం కూర్చుంటే బండి నడిపేవాడు. శారీరకంగా బలమైనవాడు. మమ్మల్ని సైకిలు నేర్చుకోమని, మేం తొక్కుతుంటే వెనక నుంచీ ఒక్క చేత్తో పట్టుకుని, దాంతో పాటు పరిగెడుతూ బ్యాలెన్స్ చేసేవాడు. ఇంట్లో చిన్న చిన్న పనులు, ఎత్తి ఇవతల పెట్టేవీ, ఇటువంటివి ఏమైనా ఉండే నాన్న చేసేవాడు. ఈ పనుల ప్లానింగ్ మాత్రం పెదనాన్నది. శారీరక శక్తి ప్రాధాన్యతను తన చేతులతో మా గుర్తింపులో ఉంచినవాడు.

నాన్న ఇంట్లో ఉన్న సమయం తక్కువే. కానీ మా విషయాలు ఏ మాత్రం పట్టించుకోలేదని కాదు. మాతో హోంవర్క్ చేయించేవాడు. మా చదువులకు అవసరమైన బయటి పనులన్నీ చేసేవాడు. పరీక్ష ఫీజులు కట్టడం, హాల్ టికెట్లు తేవడం మొదలయిన పనులలో మాకు నాన్న భరోసా చాలా ఉండేది. ఇంటికి కావలసినవి లిస్టు రాసి ఇస్తే తెచ్చి పెట్టేవాడు. మేం ఇంట్లో సల్వార్ వేసుకుని కనిపిస్తే ఎందుకా బిగుతు బట్టలు, నైటీ వేసుకోవచ్చు కదా అనేవాడు. జుట్టు కత్తిరించుకోమనేవాడు.

సమాజంలో సాధారణంగా ఉండే పట్టింపులు కొన్ని నాన్నకు పట్టేవి కాదు. ఉదాహరణకు బట్టలు. బట్టలు ఎలా ఉన్నాయనేది ఆలోచించేవాడు కాదు. చిరిగిపోయిందనో ఏదో కారణంతో మార్చుకుని వెళ్లమంటే మహా అసహనం వచ్చేది. నాన్న బట్టలన్నీ అమ్మే చూసేది. తల దువ్వుకునేవాడు కాదు. మా చిన్నప్పుడు ఎప్పుడన్నా మేం కూర్చోబెట్టి ముద్దుగా తల దువ్వితే మేం తల ఇటు తిప్పాక, భుజం మీద తట్టి, 'అమ్మా' అని పిలిచి నవ్వుతూ చేత్తో తలంతా చెరిపేసుకునేవాడు! తిండి విషయంలో ఆవకాయ మీద ఇష్టమే తప్ప అయిష్టాలు, రుచుల పట్టింపులూ ఏమీ ఉండేవి కాదు.

సమయం పాటించడం! ఎక్కడికైనా వెళ్లాలనుకుంటే ముందుగా టైం చెప్పేవాడు. ఆ టైముకు స్కూటర్ బయటకు తీసి అక్కడే నిలబడేవాడు అమ్మ వచ్చేవరకూ. ఇంట్లో పని పూర్తి కాక అమ్మ లేటవుతుంటే 'విజయా!' అంటూ కేక పెట్టేవాడు. చూసి చూసి ఒక్కోసారి కోపంగా స్కూటర్ స్టార్ట్ చేసేవాడు. వెళ్లడానికి కాదు, అమ్మ త్వరగా రావాలని. సమయం పాటించడం, పనిలో పర్ఫెక్షన్ నాన్నలో ఉన్న కొన్ని ప్రొఫెషనల్ లక్షణాలు. కాలేజీలో కానీ సంస్థలో కానీ క్లాసు చెప్పాలంటే చాలా విస్తృతంగా తయారయేవాడు.

సముద్రం అంటే ఇంట్లో అందరికీ చాలా ఇష్టం. పౌర్ణమి రోజు రెండు మూడు కుటుంబాల వాళ్లం బీచి ఒడ్డున ఆటలు ఆడుకున్న జ్ఞాపకాలు మరువగలిగేవి కావు. ఆ బీచిలోనే పాటలు, కోలాటం ప్రాక్టీసు చేసేవాళ్లం. 'విప్పపూల చెట్ల సిగను దాచినా విల్లంబులన్ని... నీకిస్తా తమ్ముడా నీ కిస్తా చెల్లెలా...' అంటూ సి.వి. సుబ్బారావు పాట పాడుతుంటే ఆ ఇసకలో కోలాటం ప్రాక్టీసు చేసేవాళ్లం. చుట్టుపక్కల గ్రామాలకు వెళ్లి ప్రదర్శించేవాళ్లం. అప్పుడు ఎర్ర చొక్కా వేసుకుని, నాన్న వేలు పట్టుకుని నడుస్తూ మొదలయింది ప్రపంచంలోకి నా ప్రయాణం. అలా వివిధ ప్రాంతాలకు వెళుతున్నప్పుడు అక్కడి ప్రజల జీవితాల గురించి, ఆ ప్రాంత ప్రాధాన్యం గురించీ చెప్పేవాడు. మీటింగులలో నాన్న ఉపన్యాసాలు, ప్రజలతో మాట్లాడడం చూస్తూ వింటూ ఉండేవాళ్లం. మా అమ్మకూ నాన్నకూ, పిన్నికీ వాళ్ల బాల్యం నుంచీ పార్టీ పరిచయం. అంటే ఆనాటి ఉమ్మడి కమ్యూనిస్టు పార్టీ. ఉద్యమంలో, నంబూలలో, డెన్‌లుగా పాలు పంచుకున్న కుటుంబాలు వాళ్లవి. వారికి రాజకీయాలు వ్యాపకం కాదు. జీవితంగానే ఉంటూ వచ్చాయి.



తెలంగాణా పోరాట విరమణతో క్రియాశీల రాజకీయాలకు విరామం వచ్చినా, తిరిగి రాజకీయాలు క్రియాశీలం అయినప్పుడు వారు అందులో భాగమయిపోయారు. అందుకనే నన్ను భాగం చేయడం కూడా కేవలం బాధ్యతగానే కాకుండా, వారి జీవిన విధానంలో భాగంగానే చేసారు. నాకూ ఒక జీవన విధానంగా చేసారు.

ఇక్కడ మా తల్లిదండ్రులూ అంటే అమ్మా నాన్నా, పిన్నీ పెద్దనాన్నా. ఇలా రాస్తున్నప్పుడు నాన్న గురించి మొత్తంగానే విడిగా చెప్పడం కష్టం. అది సరికాదు కూడా. ఆ నలుగురూ రకరకాలుగా మమ్మల్ని చైతన్యవంతులను చేస్తూ వచ్చారు. వాళ్ల రూపొందించిన ముద్దలమే మేము.

ఉమ్మడితత్వంతో పెంచారు మమ్మల్ని. ఇంట్లో ఉంటున్న వాళ్లమే భోజనం చేసినది చాలా తక్కువ. ఎప్పుడూ దాదాపుగా ఎవరో ఒకరు ఉండేవారు. అలాగే వేరే ఊళ్ల నుంచీ వచ్చి కొన్ని రోజుల పాటు ఉండి వెళ్లేవారు. ఇలా వచ్చేవారు ఏదో ఒక రంగంలో పని చేస్తున్నవారు అయి ఉండేవారు. వీరి మాటలు వినడం మాకు ఒక ఎడ్యుకేషన్. నాన్నకు ఉన్న విస్తృత ప్రజా సంబంధాలు, మా నలుగురు తల్లిదండ్రులకు ఉన్న విశాల దృక్పథం వల్ల మాకు ప్రపంచాన్ని వివిధ కోణాల నుంచీ అర్థం చేసుకునే అవకాశం ఏర్పడింది. మేం ఒక విశాల 'కుటుంబం'గా పెరిగాం. ఇందులో రక్త సంబంధీకులు కాని వాళ్లే ఎక్కువ. భావజాల సంబంధంలో వీరందరి పట్లా అంతే ప్రేమతో బాధ్యతతో వ్యవహరించారు. నాన్న ఫలానా పిల్లల కోసం ఎంత చేసినా అది మాకు వేరే భావం కలిగించేది కాదు. నిజంగానే ఇల్లనే నాలుగ్గోడల మధ్య ఉన్న వ్యక్తులం మేమే కానీ కుటుంబాల కష్టనష్టాలలో ఎందరో వ్యక్తులు ఉన్నారు. ప్రేమలు, ఇబ్బందులు, బాధలు కలిసే పంచుకున్నాం. ఆ రకంగా కలిసే జీవించాం.

1975 జూన్ 25. నా పదో పుట్టిన రోజు. ఉదయాన్నే దొడ్డికి కూచున్నప్పుడు హఠాత్తుగా తలుపులు తోసుకుంటూ వచ్చారు పోలీసులు. ఎమర్జెన్సీ విధించారు గడిచిన అర్ధరాత్రి. ఇల్లంతా సోదా చేసారు. పుస్తకాలు చిందరవందర చేసారు. బావను పట్టుకుపోయారు. అప్పుడు నాన్న ఊర్లో లేడు. పెదనాన్న కూడా లేరు. మర్నాడు రైలు దిగిన పెదనాన్నను అటు నుంచీ అటే పోలీసు స్టేషన్‌కు తీసుకువెళ్లి జైల్లో పెట్టారు. పది రోజుల తరువాత నాన్న వచ్చాడు. నాన్నను కూడా తీసుకుపోతారని నాన్న కాలేజీకి వెళ్లేటప్పుడు రోజూ వీడ్కోలు చెప్పేవాళ్లం. కొన్ని రోజులకు నాన్నను కూడా జైలుకు పట్టుకుపోయారు. ఇంట్లో మగవాళ్లు ముగ్గురూ జైల్లో ఉంటే అమ్మ జీతం, అమ్మా పిన్నీల ధైర్యంతోనే మేం గడిపాం. అనేకమంది స్నేహితులు మొహం చాటేసారు. భయపడ్డారు. ఆ పరిస్థితిలో మేం కుంగిపోకుండా, మా చదువులు కొనసాగించామంటే ఆ నలుగురూ ఇచ్చిన అవగాహనా, చైతన్యమే కారణం. రోజుకో ఉత్తరం, ఉత్తరంలో కవిత్వం రాసేవాడు నాన్న. ఇవి నిత్య ప్రేరణ. ఆ ఉత్తరాలు చదివి, అంతరార్థం అర్థం చేసుకోవడానికి సెన్సార్ చేసే అధికారులు పాపం నానా తిప్పలూ పడేవాళ్లు. నాన్న అక్షరాలు తేలికగా అర్థం కావు గదా!

నాన్నను చూడడానికి జైలుకు వెళ్లి ఇంటర్వ్యూ పెట్టేవాళ్లం. పత్రం రాసి ఇచ్చి జైలు బయట ఒక షెడ్డులో గంటలు గంటలు కూర్చోవాలి. ఎప్పటికో పిలిస్తే లోపలకు వెళ్లాలి. నాన్నకూ మాకూ మధ్య ఒక ఇనప జాలీ. నాన్నకు ముద్దు కాదు, ముట్టుకునే వీలే లేదు. పక్కనే ఒక పోలీసు. మనసారా మాట్లాడుకోవడం కుదరదు. 'ఖాకీ' అంటేనే ఒక కోపం, కసీ పుట్టేది. ఇంటర్వ్యూకు వెళ్లిన ప్రతీసారీ ఒక పుస్తకాల లిస్టు రాసి ఇచ్చేవాడు. తరువాతి ఇంటర్వ్యూకి అవి ఇంట్లో లైబ్రరీలో వెతికి తీసుకుపోయి ఇచ్చేవాళ్లం. ప్రతీ పుస్తకం మీదా జైలరు సంతకం ఉండేది. 'హరిప్రసాద్' పక్కనే ఆ ఒక్క అక్షర సంతకం చూస్తే ఒక అనవసరమైన, ద్వేషపూరితమైన వస్తువేదో అక్కడ ఉన్నట్టుగా భావన కలిగేది. 'సెన్సార్' పదం ద్వారా మానసిక స్వేచ్ఛపై ప్రభుత్వ నిఘా అర్థమయ్యింది. నాన్నను మాకు దూరం చేసిన ప్రభుత్వం మీద కోపం క్రమేపీ ప్రజల తరపున ప్రభుత్వాన్ని ద్వేషించే వైపుగా తీసుకువెళ్లినది నాన్న నన్ను దింపిన ఆచరణలో.

జైలరుతో నాన్నకూ అక్కడి రాజకీయ బందీలకూ స్నేహం కుదిరింది. మమ్మల్ని (పిల్లలిద్దరినీ) ఒకసారి ఇంటర్వ్యూ తరువాత వాళ్ల సీడీ వార్డులోకి తీసుకువెళ్లారు! అక్కడ సి.వి., రావిశాస్త్రిగారు... ఇంకా ఎందరో... అంతా కేరింతలు! మేమూ వాళ్లూ మహా ఉత్సాహంగా మాట్లాడుకున్నాం. అయితే 'ఇక పదండి, పదండం'టున్న జైలరుకు మాత్రం పై అధికారులు అనుకోకుండా వస్తే ఎలా అనే టెన్షన్‌తో చెమటలు కారిపోయాయి. ఈ రాజారత్నం అనేటాయననూ, ఆ తరువాత కపాడియా అనేటాయననూ మనవాళ్లు ప్రభావితం చేసారని చెప్పాలి.

1977 ఫిబ్రవరిలో ఎమర్జెన్సీ ఎత్తేసారు. అరెస్టయిన ఆరు నెలలకు పెదనాన్నా, ఏడాదికి బావా చివరికి నాన్నా విడుదలయ్యారు. వేసవి సెలవుల్లో మొదటిసారీ ఆఖరుసారీ నాన్నతో కలిసి వాళ్ల ఊరు వెళ్లాం. నాగాయలంక, అవనిగడ్డ, అక్కిలేరు అన్నీ చూపించాడు.

ఇక బహిరంగ కార్యక్రమాల కోసం ప్రయత్నాలు ఆరంభ మయ్యాయి.

> సమాజం మనిషిగా, మంది మనిషిగా నాన్నను చూడడం అంటే, నాన్న పుట్టి పెరిగిన నేపథ్యం నుంచీ నాన్నను అర్థం చేసుకోవడం. ఇది ఒక్క రోజులో జరిగినది కాదు. జీవితంలో అడుగడుగునా నా జ్ఞానాన్ని పెంచుకునే క్రమంలో నాన్నను అర్థం చేసుకుంటూ వచ్చాను. నిజానికి నాన్న నాకు 'ఇంస్పైరెడ్'. అందుకనే అనుకుంటాను, ప్రత్యేకంగా ఏం చెప్పాలన్నది అర్థం కావడం లేదు.



## ఎ.జి. యతిరాజులకు నివాళి

ప్రముఖ సాహితీవేత్త, అనువాదకులు ఎ.జి. యతిరాజులు 2017 ఫిబ్రవరి 23న అనారోగ్యంతో చిత్తూరులో మరణించారు. ఆయన ఎనభై సంవత్సరాల వయస్సులోనూ అలుపెరగకుండా తెలుగు, తమిళ భాషల్లో అనువాద రంగంలో విశేష కృషి చేశారు. నిత్యపాఠకునిగా, మంచి పుస్తకాల అన్వేషకునిగా అనువాదకులకు మార్గదర్శిగా నిలిచారు. యతిరాజులు. తెలుగు, తమిళ సాహిత్యాభిమానులకు గత 56 సంవత్సరాలుగా సుపరిచితులే. తమిళనాడులోని గుడియాత్తంలో చేనేత కుటుంబమైన గోవిందస్వామి, మునెమ్మ దంపతులకు 1935 ఆగస్టు 4న జన్మించిన యతిరాజులు మాతృభాష తెలుగే అయినా తమిళ, హిందీ, ఆంగ్ల భాషల్లోనూ, ఆయా భాషల్లోని సాహిత్యంతోనూ పట్టు సాధించారు. చిత్తూరు జిల్లాలో హిందీ ఉపాధ్యాయులుగా పనిచేసి ఉద్యోగ విరమణ చేసిన అనంతరం తన జీవితచరమాంకాన్ని చిత్తూరు పట్టణంలోని గ్రీమ్స్‌పేటలో సాగించారు. తమిళనాడులోని గుడియాత్తం పట్టణంలో వామపక్ష ఉద్యమంతో సన్నిహిత సంబంధం కారణంగా 15వ ఏట నుంచే 'జనవాణి', 'సందేశం' పత్రికల ద్వారా తెలుగు అభ్యుదయ సాహిత్యంతో ఆయనకు పరిచయం ఉంది. అప్పట్లోనే తెలుగు, హిందీ, తమిళం భాషల్లోని అభ్యుదయ రచనలను మరో భాషా పాఠకులకు అందించాలనే లక్ష్యం ఏర్పడిందని ఓ సందర్భంలో యతిరాజులు పేర్కొన్నారు.ఆయన అనువదించిన పుస్తకాలను, వస్తు విస్తృతిని, విభిన్న ఎంపికల్ని పరిశీలిస్తే వీరి విశాల దృక్పథం, ఆలోచనా పరిధి అర్థం అవుతాయి. వయసుపైబడిన దశలోనూ రాయటానికి చేయి సహకరించకపోయినా తాను చెబుతూ డిటిపి చేయించడం ద్వారా సాహిత్యంపై ఆయనకున్న అమితమైన నిబద్ధతను చాటుకున్నారు.కె చిన్నప్ప భారతి నవలలు - 'దాహం', 'సంఘం', ఇఎంఎస్ నంబూద్రిపాద్ రచనలు 'వైదిక భారతం', 'భారతదేశ చరిత్ర' తదితర పుస్తకాలను తమిళం నుంచి తెలుగులోకి అనువదించారు. శివశర్మ 'సంస్కృతులు' రాహుల్‌జీ 'ఈ దుష్ట సమాజం సతనం పతనం కాక తప్పదు', ప్రభాకర సాంజ్‌గిరి 'మనిషి కథ', గిజుభాయి సమగ్ర సాహిత్యం ఏడు భాగాలు హిందీ నుంచి తెలుగులోకి అనువదించారు. హిందీ నుంచీ పలు గ్రంథాల్ని తమిళంలోకి కూడా అనువదించారు. రాహుల్ సాంకృత్యాయన్ స్వీయ చరిత్ర 4 భాగాలు, దేశదిమ్మరి పురాణం, హిందూతత్వ శాస్త్రం, బౌద్ధతత్వ శాస్త్రం, ఇస్లాం తత్వశాస్త్రం, ఐరోపా తత్వశాస్త్రం, గతితార్కిక భౌతికశాస్త్రం, వైదిక ఆర్యులు, దివోదాసు రామరాజ్యం - మార్క్సిజం, ప్రేమ్‌చంద్ కథానికలు, శివవర్మ సంస్కృతులు తమిళంలోకి మార్చారు. తెలుగు నుంచి తమిళంలోకి చాలా గ్రంథాల్ని అనువదించారు. ఇందులో కృష్ణారెడ్డి 'ఉప్పెన' నవల, వెంకటేశ్వరరావు 'మహాత్ములు', మేజర్ జైపాల్ సింగ్ 'దేశం పిలిచింది' అమీర్ హైదర్‌ఖాన్ 'స్వీయచరిత్ర', పుచ్చలపల్లి సుందరయ్య 'విప్లవ పథంలో నా పయనం' (2 భాగాలు) హొవర్డ్ ఫాస్ట్ - 'స్పార్టకస్', అలెక్స్‌హేలి 'ఏడు తరాలు' , డా. కేశవ రెడ్డి 'అతడు అడవిని జయించాడు, జి.కళ్యాణరావు 'అంటరాని వసంతం' తదితర పుస్తకాలను ఆయన తమిళంలోకి అనువదించారు. ఆయన నిత్య సాహిత్య విద్యార్థిగా, నిరంతర పాఠకుడు, అగ్రశ్రేణి అనువాదకునిగా పేరొందిన యతిరాజులు మరణం సాహితీరంగానికి తీరనిలోటు. ఆయన స్మృతికి విరసం వినమ్రంగా నివాళులు అర్పిస్తోంది.

ఆ సంవత్సరం జూలై 30న విశాఖపట్నంలో అమరవీరుల సంస్మరణ సభ, ఊరేగింపులతో కార్యక్రమాలు మొదలు. ఆ సభకు నెల రోజుల ముందు నుంచీ జననాట్యమండలి ఏర్పాటు కూడా మొదలయింది. 'భూమి భాగోతం', 'కొండలు పగలేసినం' ప్రాక్టీసు చేసాం. డాన్సు వచ్చినందుకు 'మంగి' పాత్ర నాకు ఇచ్చిన ఆనాటి నిర్ణయంతో నేటికీ మంగి, మంగన్నలతో ఉండే ఆచరణ నిర్దిష్ట రూపం తీసుకుంది. ఈ ఆచరణలో నాన్న నుంచీ నేర్చుకున్నది అనేక కోణాలలో, అనేక స్థాయిలలో ఉన్నది. సంఘం, సంఘానికి మార్గదర్శకత్వాన్ని అందిస్తున్న పార్టీ, ప్రజలే కార్యకర్తకు గురువులు. అయితే కాగ్నిషన్, పర్‌సెప్షన్, లీప్‌లో నాన్న పాత్ర చాలానే ఉంది.

సమాజాన్ని, వ్యక్తులనూ వివిధ కోణాలలో అర్థం చేసుకోవడంలో నాన్న దృక్పథం నాకు చాలా ఉపయోగపడింది. తన అభిప్రాయాలను మా మీద రుద్దేందుకు ఎప్పుడూ ప్రయత్నించలేదు. వ్యక్తుల పట్ల అంచనా, సాహిత్య ప్రక్రియలు మొదలయిన విషయాలలో మాకు భిన్నాభిప్రాయాలు ఉండేవి. పార్టీతో నాకు ప్రత్యక్ష సంబంధం పెరిగిన తరువాత, నాన్నతో వివిధ విషయాల మీద చర్చించడం పెరిగింది. కొన్ని సందర్భాలలో 'నా అభిప్రాయం ఇలా ఉంది, లెట్ అస్ బీ ఓపెన్ ఎండ్ డిస్కస్' అనేవాడు. తన అభిప్రాయాలు చాలా స్పష్టంగా ఉండేవి. ఎదుటివారి అభిప్రాయాలతో తనకు విభేదం, పొరపాటు కనిపిస్తే, ఒక ప్రాసెస్‌లో చర్చిస్తూ ఉండేవాడు. కొన్ని సందర్భాలలో కొంతమందితో (యువకులతోనే) చనువుగా, 'ముండా నీకేం తెలీదు' అనో, గట్టిగా ఖండిస్తూనో మాట్లాడేవాడు. కానీ నాన్న నమ్మినది, ఆచరించినదీ ఒక విశాల దృక్పథాన్నే. నాన్న తన రాజకీయాలను నాకు నేర్పి, ప్రజలలో నిలబెట్టి ఆచరణ ప్రాధాన్యతను నేర్పిస్తే, ఈ ఆచరణ నాకు నాన్నను కేవలం తండ్రిగా కాక సామాజిక వ్యక్తిగా చూడడం నేర్పింది.

సమాజం మనిషిగా, మంది మనిషిగా నాన్నను చూడడం అంటే, నాన్న పుట్టి పెరిగిన నేపథ్యం నుంచీ నాన్నను అర్థం చేసుకోవడం. ఇది ఒక్క రోజులో జరిగినది కాదు. జీవితంలో అడుగడుగునా నా జ్ఞానాన్ని పెంచుకునే క్రమంలో నాన్నను అర్థం చేసుకుంటూ వచ్చాను. నిజానికి నాన్న నాకు 'ఇంస్పైడ్'. అందుకనే అనుకుంటాను, ప్రత్యేకంగా ఏం చెప్పాలన్నది అర్థం కావడం లేదు.

నాన్నకు దండకారణ్యం చూపించగలగడం నాకు చాలా సంతృప్తి ఇచ్చిన విషయం. ఆ వయసులో, పరిస్థితిలో రావడం, తిరిగి వెళ్లడం మాకు టెన్షన్‌గానే అనిపించింది. కానీ ఉన్నన్నాళ్లూ చాలా విషయాలు పరస్పరం తెలుసుకోగలిగాం.

ఇంతకంటే నాలో నుంచీ బయటకు తీసి నాన్న గురించి మరింకేం విషయాలు చెప్పగలనో అర్థం కావడం లేదు. అనేక మంది రాసిన అనేక కోణాలలో కాకుండే వేరే కోణాలలో చెప్పడానికి ప్రయత్నించాను. ఇంకేమీ లేవని కాదు. కలిసి మాట్లాడు కుంటున్నప్పుడు జ్ఞాపకాల దొంతరలు కదులుతాయి. గాఢత ఉంటుంది. అక్షరాలు ఎంత వ్యక్తమో అంత అవ్యక్తం కూడా. ఈ పరిమితి ఈ స్మరణలో నాకు మరీ ఎక్కువగా అనిపిస్తున్నది. అయినా రాసాను. ఏ మేరకు సఫలమయ్యానో మా 'కుటుంబ' సభ్యులు చెప్పాలి.

వెరసి నాన్న is in my blood, my heart, my consciousness and my practice. నాన్నను నేను విడిచి వచ్చి ఉండవచ్చు. కానీ తనున్నాడు నా లోపల. ఆ మాటకు వస్తే మా తల్లిదండ్రులు నలుగురూ ఉన్నారు నా లోపల...

ఏప్రిల్ 2016

నాన్న మాత్రమే నన్నలా పిలిచే

కొండతల్లి



● కారసాల విజయ్ కుమార్

# హంతకుల నేర అంగీకారం

## బీహార్ దళితుల హత్యాకాండల్లో కెమేరా ముందు...

**మధ్య బీహార్ రణవీర్ సేన సభ్యులు నిరాయుధులైన దళితులను, పేదలను ఆరు అతి భారీ విచక్షణారహిత సామూహిక హత్యాకాండల పథకాలను ఎలా రచించి అమలు జరిపింది, దీర్ఘకాలంగా ఆయుధ చట్టాలను ఎలా వక్రీకరించింది, వారికి ఆయుధాలు వాడకంలో శిక్షణ ఎవరు ఇచ్చింది, ఎవరు వాళ్లకు ఆయుధాలను సమకూర్చింది, ఎవరు వారికి ఆర్థిక సహాయం చేసింది, వాళ్లకు రాజకీయ అండగా ఎవరు నిలిచింది, ఎలా దళితులను ఊచకోత కోసింది అంగీకరించిన దృశ్యాలను కెమెరాలో బంధించింది కోబ్రాపోస్ట్.**

ఒక సంవత్సరం పాటు సాగిన రహస్య పరిశోధనలో, ఆరుగురు క్రూరాతి క్రూరమైన రణవీర సేన కమాండర్ల ఆచూకీ తీసి కెమెరాలో బంధించిది కోబ్రా పోస్ట్. సరైన సాక్ష్యాలు లేవని పాట్నా హైకోర్టు ఇద్దరిని అమాయకులుగా ప్రకటించి విడుదల చేసింది. మధ్య బీహార్‌లో జరిపిన ఆరు అతి భారీ దళితుల ఊచకోతలలో అనగా, సార్తువా (1995), బదానితోలా (1996), లక్ష్మన్‌పురా బాతే (1997), శంకర్ బిగా (1999), మియాన్ పుర్ (2000), ఇక్బారి (1997) తదితర మారణ కాండలలో తమ ప్రమేయాన్ని ఒప్పుకున్నారు. ఈ ఆరు మారణకాండలలో మొత్తం 144 మహిళలను , చిన్నారులను అత్యంత కిరాతకంగా చంపడం జరిగింది. ఈ రణవీర్ సేన కమాండర్‌లలో చాంద్‌కేశ్వర్, రవీందర్ చౌదరి, ప్రమోద్ సింగ్, భోలా సింగ్, అరవింద్ కుమా సింగ్, సిద్ద్ నాద్ సింగ్‌లు ఉన్నారు. ఈ సామూహిక దళితుల భారీ హత్యాకాండలు ఎలా జరిపారనేగాక, దాని పథక రచన, ఈ యుద్ధ కాండలలో ఖచ్చింగా టార్గెట్ ప్రకారం హతం చేయడానికి ఆయుధాల వాడకంలో ఎవరు శిక్షణ ఇచ్చారు, ఎవరు ఆయుధాలను సమకూర్చారు, ఎవరు ఆర్థిక సాయం చేశారు, రాజకీయంగా ఎవరు సహకరించారు.. అవే వివరాలను బహిర్గతం చేసింది. జెడియు-బిజెపి మిత్ర కూటమి ప్రభుత్వ అధికారంలోకి వచ్చిన వెంటనే జస్టిస్ అమీర్ దాస్ కమిషన్ విచారణ అర్ధాంతరంగా ముగిసింది. కారణం జస్టిస్ (రిటైర్డ్) అమీర్ దాస్ విచారణలో కొందరు ప్రముఖ రాజకీయ నాయకుల ప్రవేటు సైన్యం ప్రమేయం ఉన్నట్లు పరిశీనలో తేలటంతో ఆ నివేదికను అర్ధాంతరంగా తిరస్కరించారు. బహుశా స్వాతంత్ర భారతంలో సామూహిక హత్యాకాండకు సంబంధించిన విచారణ కమిషన్ను నిలుపుదల చేసిన చరిత్ర కూడా ఇదేనేమో.

ఒకే రోజు 50 గ్రామాలలో ఈ తరహా ఊచకోతల మారణ కాండలు జరపాలనే లక్ష్యం చేసుకున్నట్లు వీరు ఒప్పుకున్నారు. దీనికి అత్యాధునిక ఎకె 47, ఎల్ ఎం జి, ఎస్ ఎల్ ఆర్ వంటి అత్యంత ప్రమాదకర మారణాయుధాలతో ఎన్నిక చేయబడిన ప్రాంతాలలో ఆగ్రహావేశపు అగ్రకుల భూస్వామ్య ప్రైవేటు (వ్యక్తిగత) సైన్యానికి తాము ధ్వంసం చేయదలుచుకున్న లక్ష్యాన్ని అమలుచేయడం అంత కష్టమేమీ కాదు.

సినిమా నిర్మాతల వేషంలో రణవీర సేన కథనం పై సినిమా తీయాలనే లక్ష్యముందనీ, కోబ్రా పోస్ట్ అసోసియేట్ ఎడిటర్ కె.అవినాశ్, చాంద్‌కేశ్వర్ అలియాస్ చంద్రేశ్వర్‌ను, ప్రమోద్ సింగ్‌ను, భోలా సింగ్ రాయ్ ను, అరవింద్ కుమార్ సింగ్‌ను, సిద్ధాంత్ సింగ్‌ను, రవీంద్ర చౌదరీలను ఇంటర్వ్యూ చేశారు. రవీంద్ర చౌదరి తప్ప మిగిలిన వారందరూ లక్ష్మంపుర బాతే సామూహిక నరమేధంలో నిందితులే. రవీంద్ర చౌదరి మాత్రం 1995 లో జరిగిన సార్తువా (భోజ్‌పూర్) ఊచకోతలలో ప్రముఖంగా పాల్గొన్నాడు. చాంద్‌కేశ్వర్ ప్రమోద్ సింగ్ లను పాట్నా హైకోర్టు విడుదల చేసింది. కొన్ని రోజులకు భోలా సింగ్‌ను, అరవింద్ కుమార్ సింగ్‌ను, సిద్ధ్‌నాద్ లను కింది కోర్టు వదిలేసింది. కానీ జార్ఖండ్ లోని టాటా నగర్ లో నక్కి ఉన్న భోలా సింగ్ కోసం పోలీసులు ఇంకా గాలిస్తునే ఉన్నారు.

రణవీర్ సేనకు కేంద్ర, రాష్ట్ర స్థాయి రాజకీయ నాయకుల పరోక్ష ఆశ్రయం, మద్దతు ఉందని ఈ నర హంతకుల నేరాంగీకారం ద్వారా స్పష్టంగా బహిర్గతమైంది. ఉద్దేశ పూర్వకంగానే మాజీ ప్రధాన మంత్రి, భారత సైన్యం పనికి రావని తిరస్కరించిన అత్యాధునిక ప్రమాదకర మారణాయుధాలైన ఎల్ఎంజిలు, ఎస్ఎల్ఆర్‌లు సెమీ ఆటోమేటిక్ తుపాకులు, గుండ్లు సమకూర్చుకోవడంలో సహకరించినట్లు తెలిసింది. మాజీ ఆర్థిక మంత్రి ఒకరు వీళ్లకు ఆర్థిక సాయం చేసినట్లు తెలిసింది. సామూహిక హత్యాకాండల తరువాత నేరస్తులను మరో రాజకీయ నాయకుడు సంఘటనా స్థలం నుండి పోలీసుల కంటబడకుండా తన కారులో ఎక్కించుకుని తప్పించాడు. వీరిలో అత్యధికంగా భూమి, రాజ్‌పుట్ భూస్వాములకు చెందిన వారు, రణవీర్ సేనకు ప్రస్తుతం సైన్యంలో పని చేస్తున్నవారు లేక మాజీ సైనికులు ఈ ఆయుధాలను వినియోగించడంలో తర్ఫీదు ఇచ్చినట్లు, ప్రైవేటు వ్యక్తుల నుండి విరాళాలు సేకరించి ఒక డజను ఎకె-47 లాంటి ఆయుధాలను డిశంబర్ 1995 లో పురీలియా ప్రాంతంలో విమానం నుండి కిందికి జారవిడిచినవి కొనుగోలు చేసినట్లు తెలిపారు. ఐతే ఈ సామూహిక నర హంతకులు చెప్పిన విషయాలను వింటుంటే రక్తంగడ్డ కట్టుక మానదు. రణ వీర్ సేన ముఠా కార్యక్రమాలు క్రిత కాలం నాటి భయంకర అత్యవసర పరిస్థితులను తలపిస్తున్నవి. గమనిస్తే సిపిఐ-ఎంఎల్ (లిబరేషన్) నాయకత్వంలో వ్యవసాయ కూలీలు సంఘటితమై, తాము ఉచితంగా భూస్వాముల భూముల్లో చాకిరి చేయమన్నందుకు, కూలీ రేట్లను పెంచవలసిందిగానూ డిమాండ్ చేసినందుకు, నిరసనగా ఆగ్రహించిన అగ్రకుల ఆసాములు తీవ్ర అశాంతికి గురై, భోజ్‌పూర్ జిల్లా బెలూర్ గ్రామంలో భూస్వామి దరిచరణ్ సింగ్ తమ ప్రైవేటు సైన్యాన్ని

రూపొందించినట్లు తెలుస్తుంది. ఇతనే రణవీర్ సేన స్థాపకుడు. తన బంధువు పదవీ విరమణ చేసిన సైనికుడు, రణవీర్ చౌదరి. ఆ తరువాత అది భోజ్‌పూర్-ఖోపియ గ్రామ పెద్ద బ్రహ్మేశ్వర్ సింగ్ నాయకత్వంలో బాగా తీర్చిదిద్దబడింది. విచక్షణారహితంగా, నిర్దాక్షిణ్యంగా హత్యలు చేసే ముఠాగా తర్ఫీదు పొందింది. ఎకె-47, ఎల్ఎంజిలు, సెమీ ఆటోమేటిక్ తుపాకులు, ఎస్ఎల్ఆర్, మౌజర్ల సహాయంతోఅగ్రకుల భూస్వాములలో విస్తరించింది. తరువాత కేవలం ఆరు సంవత్సరాలలోనే ఈ ముఠా 16 మారణ కాండలలో 300 మంది దళితులను వీరిలో మగ, ఆడ, చిన్నారులను, ఇంకా గర్భిణీ స్త్రీ కడుపులో ఉన్న పిండాలను సైతం చంపింది. బీహార్ రాష్ట్రంలోని అరహ్, అర్వాల్, భోజ్‌పూర్, గయా, ఔరంగాబాద్, జార్ఖండ్ ఆరు జిల్లాలలో విస్తరించింది. ఈ హంతక ముఠా డిశంబర్ 1 1997 న నిశిరాత్రి 58 దళితులను చంపినపుడు జాతి యావత్తు అవమానంతో తల దించుకుంది. చనినపోయిన వారిలో 27 మంది మహిళలు, 16 మంది చిన్నారులు కూడా ఉన్నారు. ఈ నరరూప రాక్షస రణవీర్ సేన హంతక ముఠా కనీసం గర్భిణీ స్త్రీలను కూడా వదల లేదు, పాశవికంగా గర్భిణీ స్త్రీల గర్భాలను చీల్చి, కడుపులోంచి పిండాలను బయటకు తీసి చంపారు.

ఇటువంటి పెట్రేగిన మానవ వధ మళ్లీ గుజరాత్ 2002 దాడులలో కనిపిస్తుంది, ఈ హంతక మూకలు జనం చూస్తుండగానే ముస్లిం మహిళలైన గర్భిణీ స్త్రీల గర్భాలను చీల్చి పిండాలను ముక్కలు ముక్కలుగా నరికి ఆనందాన్ని పొందారు.

విస్మయానికి గురిచేసే మరో తీర్పు ఈ సంవత్సరమే (2015) జనవరి 14న వెలువడింది. గణతంత్ర దినోత్సవం సందర్భంగా కింది కోర్టు అర్వాల్ జిల్లా, శంకర్ బిగా గ్రామంలో 1999 లో జరిగిన 23 మంది దళితుల ఊచకోత హత్యలకు బాధ్యులైన 24 మంది హంతకులను కింది కోర్టు నిర్దోషులుగా ప్రకటించి విడుదల చేసింది. అలాగే 1 డిశంబర్ 1997 లో జరిగిన 58 మంది దళితులను ఎన్నడూ కనివినీ ఎరుగని రీతిలో నరహత్యలు గావించిన లక్ష్మన్‌పురా బాతే సంఘటనలో 16 మందికి ఉరిశిక్ష పడిన నిందితులతో సహా మొత్తం 26 మంది రణవీర్ సేన నరహంతకులను నిర్దోషులుగా ప్రకటించి అక్టోబర్ 2013 న విడుదలచేసింది. 11 జులై 1996 న జరిగిన బదానీ తోలా నరమేధం కూడా ఇలానే జరిగింది. ఈ దాడిలో 21 మంది దళితులను వీరిలో 11 మంది మహిళలు కాగా ఆరుగురు చిన్నారులను నరికి చంపారు. కానీ మొత్తం 23 మంది రణవీర్ సేన హంతకులను అమాయకులుగా ప్రకటించి విడుదల చేసింది పాట్నా హైకోర్టు 17 ఏప్రిల్ 2012న. జూన్ 2000లో జరిగిన మియాన్ పూర్ నరమేధంలో నిందితులైన వారిని 2 జులై 2013 న పాట్నా హైకోర్టు మొత్తం 10 మంది నిందితులలో ఒక్కరిని మినహా అందరినీ నిర్దోషులుగా ప్రకటించి విడుదల చేయడంతో ఈ ఊచకోతలో చనిపోయిన 32 మంది తవ్వనినరిగా తమ సమాధులను తొలుచకొని బయటకు వచ్చినట్లయ్యింది. ఈ ఉత్తర్వులను ఒక ఉదాహరణగా భావించి ముందు ముందు రానున్న రోజుల్లో మిగిలిన కేసులలో కూడా సాక్ష్యాలు లేవని న్యాయస్థానాల్లో తీర్పులు ఇలానే పునరావృతం అయినా ఏ ఒక్కరూ ఆశ్చర్యపోవలసిన అవసరం లేదు. ఉదాహరణకు డిప్యుటీ సూపరింటెండెంట్ ఆఫ్ పోలీస్ (రిటైర్డ్) మీర్జా మఖ్సూద్ ఆలం బేగ్ ఈ నిందితులందరిపైనా నేరాలకు సంబంధించి ఖచ్చితమై ఆధారాలు ఉన్నాయని అభిప్రాయ పడ్డాడు.ఆయన మాటల్లోనే చెప్పాలంటే ....ఔను వాళ్లకు వ్యతిరేకంగా (వారిపై) ప్రత్యక్షసాక్ష్యాలు ఉన్నవి. ప్రజలు వాళ్ళను చూసి గుర్తు పట్టారు...ఈ మారణకాండకు ముందు వీళ్లు ఒక సమావేశం నిర్వహించారు...ఈ విషయాలన్నీ కేసు డైరీలో నమోదు చేయబడినవి. లక్ష్మన్‌పురా బాతే మారణకాండలో బేగ్ దర్యాప్తు అధికారిగా చార్జిషీట్ నమోదు చేయడంలో ప్రధాన బాధ్యత వహించాడు. అటువంటి సాక్ష్యాల ఆధారంగానే కింది కోర్టు జైలు శిక్షలు, మరణ శిక్షలు విధించింది.

ఈ నిర్దోషులుగా విడుదలైన వారు ఒక అద్భుతం సృష్టించారు. 300 మంది దళితులను వాళ్ళు చంపకపోతే ఇంకెవరు చంపినట్లు? ఈ ఊచకోతలలో ఇప్పటికే ఎందరో హత్యకు గురయ్యారు. వాళ్లను ఎవరూ చంపలేదా?

ఈ సామూహిక హత్యా కాండలకు పాల్పడిన అత్యంత క్రూరమైన హంతకులు కోర్టులకు నిర్దోషుల్లా కనిపించిన క్రమంలో కోబ్రాపోస్టు కూడా వారిలో కొందరిని రహస్యంగా విచారించి, నిజంగా వాళ్ల చేతులకు రక్తం అంటలేదనే విషయాన్ని వాళ్లు చెపుతారా? అని తెలుసుకోవాలని నిర్ణయించుకుంది.

కోబ్రాపోస్ట్ అసోసియేట్ ఎడిటర్ కె.ఆశిష్ సినీ నిర్మాత వేషంలో రణవీర్ సేన ఇతివృత్తంగా ఒక సినిమా నిర్మించాలనే ఉద్దేశంతో మధ్య బీహార్‌లో విస్తృతంగా పర్యటించి ప్రముఖంగా ఆరుగురు రణవీర్ సేన కమాండర్లను ఇంటర్వ్యూ చేయగా, ఐదు అతి భారీ మారణకాండ నరమేధాలలో తమ ముఠా ప్రమేయం ఉన్నట్లు పశ్చాత్తాపంతో అమాయకంగా అంగీకరించారు. అవి బదాని తోలా, లక్ష్మన్‌పురా బాతే, శంకర్ బిగా, మియాన్ పూర్, ఇక్వారి. నిజానికి వాళ్లు ఒక రకమైన హోదా కోసం ఇంతటి హేయమైన నేరాలు చేసినట్లు విడి విడిగా ప్రతి సంఘటనను క్లుప్తంగా వివరించారు. ఈ ఆరుగురు రణవీర్ సేన మనుషులలో చాంద్‌కేశ్వర్ అలియాస్ చంద్రేశ్వర్‌ను, ప్రమోద్ సింగ్, భోలా సింగ్, అరవింద్ కుమార్ సింగ్, సిద్‌నాద్ రాయ్ రవీంద్ర చౌదరి, కాగా రవీంద్ర చౌదరి మినహా మిగిలిన అందరూ లక్ష్మన్‌పురా బాతే నరమేధంలో నిందితులు. ఐతే రవీంద్ర చౌదరి ప్రధానంగా 1995 లో జరిగిన సార్థువా (భోజ్‌పూర్) ఊచకోతలలో నిందితుడు.

చాంద్‌కేశ్వర్, ప్రమోద్ సింగ్‌లను పాట్నా హైకోర్టు స్వేచ్ఛగా విడుదల చేసింది. అలాగే భోలా సింగ్, అరవింద్ కుమార్ సింగ్ సిద్‌నాథ్ రాయ్ లను సాధారణ వ్యక్తులుగా భావించి కిందికోర్టు వదిలివేసింది. ఝార్ఖండ్, టాటానగర్‌లో దాగివున్న భోలా సింగ్ కోసం బీహార్ పోలీసులు ఇంకా గాలిస్తూనే వున్నారు.

కెమెరా ముందు నేరం ఒప్పుకున్న ఈ రణవీర్ సేన ప్రైవేట్ సైన్యానికి, రాష్ట్రంలోనూ, కేంద్రంలోనూ రాజకీయ అండదండలు ఉన్నాయని చాలా స్పష్టంగా చెప్పడంతోపాటు, పనికి రానివిగా పక్కనపెట్టిన భారతీయ మిలటరీకి చెందిన ఆయుధాలను ఈ ముఠా సమకూర్చుకోవడంలో వీరికి సహకరించిన మాజీ ప్రధాన మంత్రితో పాటు, పలువురు పేరు మోసిన రాజకీయ నాయకుల పేర్లను సైతం చెప్పడం జరిగింది. రణవీర్ సేనకు ఒక మాజీ ఆర్థిక మంత్రి, ఆర్థిక సహాయం చేశాడనీ, బిజెపి కి చెందిన కొందరు ప్రముఖ వ్యక్తులు పోలీసు దర్యాప్తును ప్రభావితం చేయడానికి ప్రయత్నించారని చెప్పారు.

## సామూహిక హత్యాకాండలకు పాల్పడిన వారితో కె.ఆశిష్ జరిపిన ఇంటర్వ్యూ.

చాంద్‌కేశ్వర్ సింగ్: రణవీర్ సేన కమాండర్‌గా ఈ ఊచకోత లన్నింటిలో ముందువరసలో ఉండి నడిపించాడు. లక్ష్మన్‌పురా బాతే నరమేధంలో ఇతనికి ప్రమేయముడటంతో కింది కోర్టు ఇతనికి జీవిత ఖైదీ విధించింది. కానీ పాట్నా హైకోర్టు 2013 లో ఇతనిని విడుదలచేసింది. చాంద్‌కేశ్వర్ సింగ్ 1996 లో జరిగిన బదానీతోలా మారణహోమంలో

22 మంది దళితుల ఊచకోతలో తన ప్రమేయాన్ని అంగీకరించడమే కాకుండా ఈ దాడిలో తక్కువ కులస్తులైన ఐదుగురి మత్స్యకారుల తలలు తను ఒక్కడే కత్తితో నరికి చంపినట్లుగా అంగీకరించాడు.

చాంద్‌కేశ్వర్ మాటల్లో చెప్పాలంటే: గడియారం 3 గంటలు కొట్టింది, సేన కాల్పులు ప్రారంభించింది. ఊచకోత ప్రారంభమైంది. అక్కడ పోలీసు శిబిరం కూడా ఉంది. చాంద్‌కేశ్వర్ చంపబడ్డ బాధితుల తలల లెక్క చెబుతున్నాడు. కొన్ని శవాలు దాడిలో భాగంగా ఇక్కడి నుండి తీశాం. ఐతే ఇంకా 22 శవాలు సంఘటనా స్థలం వద్దనే ఉన్నవి.ఈ మారణకాండ కాండవ్ గ్రామానికి చెందిన గుప్తేశ్వర్ సింగ్ ఆదేశాల మేరకు జరిగింది. కారణం అతను పంపిన ఉత్తరంలో సిపిఐ-ఎంఎల్ సభ్యులు భూస్వాములను ఏవిధంగా వేధిస్తున్నారో వివరించాడు. కనుక ఇది చక్కని అవకాశంగా భావించి సేన సభ్యులు చర్య తీసుకున్నారు. ఐతే చాంద్‌కేశ్వర్ గ్రామంలో సమావేశం ఏర్పాటుచేసి బదానితోలా దాడికి గ్రామస్తుల అంగీకారం తోనే జరిగిందని వివరించాడు. చాంద్ కేశ్వర్ ఐదుగురు పేద మత్స్యకారులను సిపిఐ-ఎంఎల్ మద్దతు దారులుగా భావించి వారి తలలు నరికినట్లు విరించాడు.

కోబ్రాపోస్టు రిపోర్టర్ చాంద్‌కేశ్వర్ సింగ్‌తో మరో ఐదుగుర్ని చంపామంటున్నారు కదా.. వాళ్ళ తలలు లేని మొండాలు మరుసటి రోజు నది దగ్గర దొరికాయి కదా.. అని అడిగినప్పుడు, ఔను, వాళ్ళ తలలు నేనే నరికా. ఈ మారణ కాండ జరుగుతున్న స్థలం నుండి ప్రాణభయంతో పారిపోతుండగా మావాళ్ళు వెంటాడి చుట్టు ముట్టి పట్టుకున్నారు. వీళ్ల పై తుపాకీ గుళ్ళు ప్రయోగించడం అనవసరమనిపించి, కత్తితో వాళ్ల తలలు నరికేశాననీ, వంద రూపాయలు ఖరీదు చేసే ఈ తుపాకీ గుళ్ళను ఉపయోగించడం ఎందుకు అనిపించిందని అన్నాడు. అందుకని తన దగ్గర ఉన్న కత్తిని ఉపయోగించడం మంచిదనిపించిందని ఈ సామూహిక తలల నరికివేతలో తన ప్రమేయాన్ని అంగీకరించాడు.

1 డిసెంబర్ 1997 న ఆ కాళరాత్రి లక్ష్మన్‌పురా బాతే ఆ ఆనంద దాయక ఊచకోత హత్యలు తరువాత సోనే మీదిగా భోజ్‌పూర్ పారిపోయామని ఎల్ఎంజి, ఆటోమాటిక్ ఎస్ఎల్ఆర్ మౌసెర్స్ తో పేద దళితులపై చేసిన దాడి తనకు బాగా గుర్తుందని చాంద్‌కేశ్వర్ వివరించాడు. మేము అక్కడికి పోయేసరికి 10 గంటలు అయ్యింది. వెంటనే సేన కాల్పులు ప్రారంభించారు. ఆ కాల్పులు 29 నిమిషాలు జరిగాయి. ఈ దాడిలో 58 మంది చనిపోయారు. రణవీర్ సేన లక్ష్మన్‌పురా బాతేలో పేద, దళిత, మహిళలను, చిన్నారులను, ఇంకా తల్లి గర్భంలో ఉన్న పిండంతో సహా 58 మందిని కాల్చి, నరికి చంపిన నేరం గురించి వివరించాడు.

సిద్దనాథ్ : మరో సేనా కమాండర్ రాష్ట్ర సిఐడి జరిపిన పరిశోధనలలో ప్రబలంగా వినిపించిన పేర్లలో సిద్‌నాథ్ ఒకరు. ఇతను సేన అధినేత బ్రహ్మేశ్వర్ సింగ్ ముఖ్య కు ప్రధాన అనుచరుడు. సేన సభ్యుడిగా ప్రతి ఊచకోతకు పథక రచన నిర్దేశకుడు. లేదా ప్రత్యక్షంగా ఊచ కోతలో పాల్గొనే వాడు. ఎలాగైతేనేం, సిద్‌నాథ్ చట్టం చాటున నక్కి స్వేచ్ఛగా ఉంటున్నాడు. వ్యక్తిగత పూచికత్తుపై బయట ఉంటున్న సిద్దనాథ్ చాలా ఆత్మ విశ్వాసం కలవాడు. సేన కార్యకర్తలు అమలు జరిపిన ఆరు ప్రధాన దళితుల ఊచకోతలలో తన ప్రమేయాన్ని బహిరంగంగానే అంగీక రించాడు. లక్ష్మన్‌పురా బాతే లో సేన నెత్తుటి స్నానం గురించి స్పష్టంగా వివరించడమే గాక ఈ దళిత మారణకాండలో తాను ఎలా పాల్గొన్నది హత్యలు గావించింది, ఆయుధాలు సమకూర్చింది మాజీ ప్రధాన మంత్రి అని వివరించాడు.

ఐతే మేము వాళ్ళను (సిపిఐ-ఎంఎల్) తుడిచి పెట్టాలని నిర్ణయించుకున్నాం. ఎట్టి పరిస్థితులలో వాళ్ళను ప్రజలలో బలపడనీయదలుచుకోలేదు. లక్ష్మన్‌పురా బాతే పై దాడికి ముందు ఆ దాడికి పథకం ఎలాచేయాలి అనే విషయమై అరహ్ జిల్లా లోని బేలార్ గ్రామంలో సమావేశమయ్యారు. ఇతనితోపాటు సేన ప్రధాన సభ్యులలో బ్రహ్మేశ్వర్ ముఖ్య, వకీల్ చౌదరి, భోలా సింగ్, శివ్ నారాయణ్ సింగ్, కృష్ణానంద్ చౌదరి కలిసి ఊచకోతకు ముందు అరహ్ జిల్లా లోని బేలార్ గ్రామంలో రెండు రోజులు సమావేశమయ్యాం.

సిద్దనాథ్ కోబ్రాపోస్టు సభ్యులకు తను పోలీసు నిర్బంధంలో ఉన్నప్పుడు పోలీసులతో, ఇండియన్ మిలిటరీ మాత్రమే అధికారికంగా కలిగి వుండి, ఉపయోగించే అత్యంత ప్రమాదకరమైన మారణాయుధాలు తమకు ఎలా వచ్చిందీ వివరించాడు. ఇండియన్ మిలటరీ తిరస్కరించిన ఆయుధాలు మాకు ప్రధాన మంత్రి ద్వారా వచ్చినవని చెప్పాడు. వాళ్లు మమ్ములను దేశ ద్రోహులన్నారు, మేము దేశ ద్రోహులం కాము. ఈ దేశ ఆకాంక్షల మేరకే పని చేస్తున్నామన్నాడు. అందుకనే మన ప్రధాన మంత్రి మంచే మాకు ఆయుధాలు సమకూరాయన్నాడు. ఏ ప్రధాన మంత్రి అని వాళ్ళు అడిగారు. చంద్రశేఖర్ అని చెప్పాడతను. దన్‌బాద్‌కు చెందిన పేరెన్నికగన్న రాజకీయ నాయకుడు సూర్య దేవ్ తమ గొప్ప మద్దతుదారుడని, ఇతనే మిలిటరీ


Statement about ownership and other particulars of periodical **ARUNATARA** as required to be published in the first issue of every year after the last day of February.

**Form IV (See Rule 8)**

| | | |
|---|---|---|
| 1. Place of Publication | : | Hyderabad |
| 2. Periodicity of its Publication | : | Monthly |
| 3. Printer's Name | : | Duvvuri Venkata Ramakrishna Rao |
| Whether citizen of India | : | Indian |
| Address | : | 12-15-963, Manikeshwarinagar, Osmania University Campus, Tarnaka, Hyderabad-500007. |
| 4. Publisher's Name | : | Duvvuri Venkata Ramakrishna Rao |
| Whether citizen of India | : | Indian |
| Address | : | 12-15-963, Manikeshwarinagar, Osmania University Campus, Tarnaka, Hyderabad-500007. |
| 5. Editor's Name | : | Duvvuri Venkata Ramakrishna Rao |
| Whether citizen of India | : | Indian |
| Address | : | 12-15-963, Manikeshwarinagar, Osmania University Campus, Tarnaka, Hyderabad-500007. |
| 6. Name and addresses of Individuals who own the newspaper | : | Duvvuri Venkata Ramakrishna Rao |

I, Duvvuri Venkata Ramakrishna Rao, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

*Sd/-*

Date : 1st March, 2017

*(Duvvuri Venkata Ramakrishna Rao)*
Signature of the Publisher

ఆయుధాలు సమకూర్చారని తెలిపాడు.

సిద్దనాథ్ ఇంకా చెపుతూ, ఆ రోజుల్లో ప్రధాన మంత్రి చంద్ర శేఖర్ సింగ్‌కు సూర్య దేవ్ బాబు చాలా సన్నిహిత మిత్రుడు. సిద్దనాథ్ కాన్‌పత్ పోలీసు స్టేషన్‌లో ఉన్నప్పుడు అయ్‌బాత్ పూర్‌లో ముషహర్ కులానికి చెందిన ఏడుగుర్ని చంపిన నేరంలో తన మనుషులతోపాటు తన ప్రమేయం కూడా ఉందని నేరాన్ని ఒప్పుకున్నాడు. ఈ హత్యలలో తొమ్మిది మంది సేన దళ సభ్యులు పాల్గొన్నారు, ఐతే స్థానిక పోలీసులు 64 మంది మీద ఎఫ్ఐఆర్ నమోదు చేశారు. దీని ఫలితంగా ముఖ్య హంతకులు అంతిమంగా శిక్ష నుండి తప్పించుకోడానికి సహకారం దొరికింది.

సిద్దనాథ్ ప్రకారం తొమ్మిది మంది ప్రముఖ నాయకులు కీలక నిర్ణయాలు చేయడానికి ఒక అధికార బృందంగా ఏర్పడ్డారు. ఆరు సామూహిక హత్యాకాండలలో తన ప్రమేయం ఉన్నట్లు అంగీకరించాడు. మేము బాతే బేలార్ లో ఒక హత్యాకాండ, ఇంకొకటి చౌరిలో, ఆ తరువాత లక్ష్మన్‌పురా బాతే, శంకర్ బిగా మూడోది నారాయణ్ పూర్, నాలుగోది మియాన్ పూర్, సైదర్ పూర్ ఐదోది, జల్‌పురా ఆరోది. నిస్సందేహంగా కాస్త అటూ ఇటూ గా మొత్తం ఆరు ఊచకోతలు. పోలీసుల ఎవరైతే 65 పేర్లు ఎఫ్ఐఆర్ లో చేర్చారో వారి సహాయంతో సిద్దనాథ్ హత్యారోపణలను తికమక చేసి తప్పించుకోవడం కష్టంతో కూడిన పని. నిజమైన నేరస్తులను తప్పించాలంటే, ఇక్వారి గ్రామస్తుడైన అరవింద్ కుమార్ సింగ్ అతని సహ సేన మనుషులు తాము 1996, 1997 జరిపిన దళితులు, ముస్లింల సామూహిక హత్యల నుండి ప్రత్యక్ష సాక్షులను, బాధిత కుటుంబ సభ్యులను భయపెట్టి రాజీ చేశారు.

అరవింద్ కుమార్ సింగ్: సామూహిక హత్యలు చేయడమంటే ఒక రకంగా ఏదో విజయం సాధించిన భావన. అరవింద్ సింగ్ మొదటి సారి 1996 లోనూ ఆ తరువాత 1997 లో తన సొంత గ్రామస్తులను చంపిన ప్రతి సంఘటనను ఎంతో ఆనందంగా వివరించాడు. సేన మనుషులు ఇక్వారిలో ఎప్పుడు ఎలా చంపిందీ వివరించాడు. ఔను రెండు మారణకాండ సంఘటనలు జరిగాయి. మొదటి నర సంహారణలో ఏడుగురిని చంపగా, రెండో నర సంహారంలో తొమ్మిది మందిని చంపడం జరిగింది. ఒకటి1996 లో జరిగింది, రెండోది 1997 లో జరిగింది. అరవింద్ సింగ్ నిర్వహించిన ఇక్వారి నర సంహారాలు కేవలం స్థానిక గ్రామ భూమిహార్‌ల పనితనమే, వారే ప్రణాళిక రచించి అమలు చేశారు. బ్రహ్మేశ్వర్ ముఖ్య కుగానీ రణవీర్ సేన కు గానీ ఎటువంటి పాత్రలేదు. అరవింద్ సింగ్ తనకు తానే చిక్కులు తెచ్చుకునే పద్ధతిలో మాట్లాడుతూ, కేవలం ఇక్వారి స్థానిక గ్రామస్తులే పాల్గొనడం జరిగింది. బ్రహ్మేశ్వర్ ముఖ్య ప్రమేయం అక్కడ అసలు లేదు. బయట వాళ్ళు ఎవరూ లేరు. రణవీర్ సేన సభ్యులు అసలే లేరు. ఇక్వారి గ్రామంలో మావి 500 కుటుంబాలు ఉన్నవి. ప్రతి కుంటుంబం నుండి ఒకరు వస్తే ఒక సేన అవుతుంది. మాకు రణవీర్ సేన సహకారం అవసరం లేదు. భూమిహార్‌ల కుంటుబాలు 500 ఉన్నప్పుడు ప్రతి 200 కుటుంబాల నుండి ఒక మనిషి వస్తే చాలు మాకు సేన సమకూరినట్లే. అరవింద్ సింగ్ అతి తక్కువ సమయంలోనే ఒక పెద్ద సైన్యాన్ని ఏర్పాటు చేయడమే కాకుండా పథకం పూర్తి చేయడానికి ఆధునిక మారణాయుధాలను కూడా సిద్ధం చేసుకున్నాం. కుల-వర్గ శత్రువు లక్ష్యం తమ ఊరిలోనే ఉండటంతో పని ఇంకా సులువైనది. అరవింద్ సింగ్ చెబుతూ రక్షణ కొరకు ఆధునిక మారణాయుధాలను తమ ఇండ్లలోనే నిలువ ఉంచాం గనుక, ఖరీదైన ఆయుధాలు కూడా దాచాము. రెండు మారణ కాండలలో ఆరోపణలు ఎదుర్కొంటున్నప్పటికీ అరవింద్ సింగ్ ఇతర హంతకులు ఆయుధ చట్టాల కేసుల నుండి బయట పడటానికి బాధిత కుటుంబాలను రాజీ కొరకు ఒత్తిడి చేస్తున్నాడు. ఇక్వారీ గ్రామ ఊచకొతల నేరాలలో తనపై గానీ తన అనుచరులపై గానీ ఎటువంటి కేసులు పెండింగులో లేవని చెప్పుకుంటున్నాడు. శిక్షలు పడకుండా ఏలా తప్పించుకున్నారో వివరిస్తూ, సమస్య పరిష్కారం కొరకు వాళ్లతో అన్ని కేసులలో రాజీ పడడానికి వాళను బుజ్జగించడమో, ఒత్తిడి చేయడమో జరిగింది. దాని ఫలితంగా అన్ని కేసులు ఉపసంహరించు కోవడం జరిగింది.

ప్రమోద్ సింగ్: క్రూరమైన హంతకులలో ఒకడు. ఇతను, ఇతని అనుచరులు కలిసి అనేక దళిత సామూహిక మారణ కాండలలో నిందితుడు.పాట్నా హైకోర్టు ప్రమోద్ సింగ్‌ను నిర్దోషిగా భావించి విడుదల చేసింది. ఐతే ఇతను వేరే నేరాలకు సంబంధించి అరహ్ జైల్లో శిక్ష అనుభవిస్తున్నాడు, కోబ్రాపోస్ట్ రిపోర్టర్ ఇతన్ని జైల్లో కలిసి ఇంటర్వ్యూ చేయగా, కనీసం జంకు బొంకు లేకుండా ఈ హంతకుడు జరిపిన నర సంహారంలో తన ప్రమేయాన్ని గుర్తుకు చేసుకున్నాడు.

ఔరంగబాద్ జిల్లాలో 2000 లో ఇతను ఇతని అనుచరులు కలిసి చేసిన మియాన్ పుర్ నర సంహారంలో ఇతని ప్రమేయాన్ని అత్యంత వికారంగా అంగీకరించాడు. మియాన్ పుర్ లో రణవీర్ సేన ఎప్పుడు, ఎందుకు, ఎలా 32 మంది దళితులును, ముస్లింంలను నరికి చంపింది, తన సొంత మాటలలో వివరిస్తూ, మియాన్ పుర్ గ్రామస్తులు నక్సలైట్లకు మద్దతు పలకడం వలన రణవీర్ సేన కు లక్ష్యంగా మారారు. కనుక మేమే ఆ మారణకాండను అమలు చేశాము. రణవీర్ సేన నాయకుడే మారణకాండకు నాయకత్వం వహించాడా అని అడగగా, ఈ దాడి మరొకరితో పనిలేకుండా బ్రహ్మేశ్వర్ ముఖ్య అనుచరుడు స్వయంగానే నిర్వహించాడని ప్రమోద్ సింగ్ అస్పష్టంగా చెప్పాడు. రణవీర్ సేన మిలటరీ తిరస్కరించిన అత్యాధునిక ఎల్ఎంజిలు ఆయుధాలను కూర్చుకున్నది. గ్రామీణ బీహర్ లో సిపిఐ-ఎంఎల్ సామాజికంగా, ఆర్థికంగా అట్టడుగున అత్యధికంగా భూమి లేని దళితులకు, ఇతర కింది కులాల కూలీలకు మద్దతు పలికారు. ప్రముఖ బిజెపి నాయకుడు ఈ క్రూరమైన నేరస్తులకు ఆర్థిక సహాయం చేశాడు. కేంద్రంలో బిజెపి ప్రభుత్వం అటల్ బిహారీ వాజ్‌పాయ్ ప్రధాన మంత్రిగా ఉన్నప్పుడు, యస్వంత్ సిన్హా క్రమం తప్పకుండా బ్రహ్మేశ్వర్ ముఖ్యను కలిసేవాడు. పోలీసులు మా వెంట పడి మా స్థావరాలపై దాడులు చేసినపుడు, మేము కోల్పోయిన ఆయుధాలకంటే మాకు రెట్టింపు ఆయుధాలు వెంటనే వచ్చేవి. లక్ష్మన్‌పురా బాతే ఊచకోతకు సంబంధించి, బీహార్ ప్రభుత్వం విచారణ కమిషన్ చైర్మన్‌గా పాట్నా హైకోర్టు మాజీ న్యాయమూర్తి జస్టిస్ అమీర్ దాస్‌ను నియమించింది. కానీ శివానంద్ తివారి, చంద్రేశ్వర్ ప్రసాద్ ఠాకూర్, మురళి మనోహర్ జోషి, సుశీల్ కుమార్ మోడీ విచారణను పక్క దారి పట్టించాలని చూశారనీ, ముఖ్యంగా వీరిలో మురళి మనోహర్ జోషి పోలీసులను బెదిరిస్తూ "ఇప్పుడు మాకు అడ్డు వస్తే మేము అధికారంలోకి వచ్చిన తరువాత మీపని పడతామని విచారణా అధికారిని బెదిరించి నందుకుగాను, ఈ కేసు విచారణ కమిషన్ చైర్మన్ జస్టిస్ అమీర్ దాస్ మురళి మనోహర్ జోషి కి నోటీసులు కూడా జారీ చేశాడని వివరించాడు.

రవీందర్ చౌదురి: బీహర్ లో రణవీర్ సేన 1995లో జరిపిన దళితుల ఊచ కోతలలో ప్రధాన నిందితుడు. కానీ ఎటువంటి సంకోచం లేకుండా తన నేరాలను కోబ్రాపోస్టు కెమేరా ముందు అంగీకరించాడు. రణవీర్ సేన ఒకే రోజు 50 గ్రామాలలో దళితులను హతమార్చాలని

పథకం రచించిందనీ, ఈ హత్యల ద్వారా ప్రభుత్వం మొద్దు నిద్ర నుండి మేల్కొనేటట్లు చేయాలనీ ఒక పెద్ద ప్రణాళికనే రచించామనీ తెలిపాడు. ఎందుకంటే ప్రభుత్వాలు పీడిత కులాలలు, మైనార్టీలు కాకుండా ఈ దేశంలో ఇంకో కులాలతో పనిలేదన్నట్లు ప్రవర్తిస్తుంది. దీని మూలంగానే బీహార్‌లో వేల మంది దళితులను అత్యంత క్రూరాతి క్రూరంగా చంపడం జరిగిందని వ్యాఖ్యానించాడు. రణవీర్ సేనకు భారత మిలటరీతో సంబంధాలు ఉన్నాయని, సైనికులు సెలవుపెట్టి గానీ, పదవీ విరమణ చేసిన వాళ్ళు గానీ మాకు ఎల్ఎంజిలు, ఎస్ఎల్ఆర్‌లు అత్యాధునిక ఆయుధాలు వినియోగించడంలో శిక్షణ ఇస్తారని రవీందర్ చౌదరి వివరించాడు.

బీహార్ పోలీసులు ఈ నేరాలను పరిశోధించి నిందితులను పట్టుకోవడంలో స్పష్టమైన కారణాలతోనే ఉదాసీనంగా వ్యవహరిస్తున్నారు. నేరస్తులు నేరాన్ని అంగీకరించిన వారికి కొమ్ముకాస్తున్న పద్ధతిని కోబ్రాపోస్ట్ బహిర్గతం చేసింది. అలాగే జస్టిస్ అమీర్ దాస్ విచారణ కమిషన్‌కు రాజకీయ మద్దత్తు తగ్గిపోయి, బిజెపి కారణంగా పార్లమెంట్‌లో, అసెంబ్లీలో రణవీర్ సేన మద్దతు పెరగటమే. భూమిహార్ భూస్వాములకు అత్యంత క్రూరమైన సొంత మిలటరీకి మద్దతుగా నిలిచింది కనుకనే విచారణా కమిషన్‌ను ఎటువంటి ముందస్తు సమాచారం లేకుండానే అర్ధాంతరంగా నిలిపివేశారు. అసలు కమిషన్ నివేదికని సమర్పించమని కూడా కోరలేదు. కారణం నితీష్ కుమార్ ముఖ్య మంత్రి కాగానే సుశీల్ కుమార్ మోడిని ఉప ముఖ్య మంత్రిగా ప్రకటించారు.

ఇక నితీష్ కుమార్ ఈ కేసు గురించి పట్టించుకో లేదు. ఐతే సశీల్ కుమార్ మోడి పేరు తోపాటు బిజేపిలోని ఆర్ఎస్ఎస్ నాయకుల పేర్లు బయటపడినవి. కమిషన్ నివేదిక కోబ్రాపోస్ట్ వద్ద ఉంది. నిర్దోషులుగా విడుదలైన వారు సుప్రీం కోర్టులో సవాల్ చేశారు. ఈ దాడులకు సంబంధించిన చీకటి కోణాలను వెలుగులోకి తేవాలనే కోరికతో కోబ్రాపోస్ట్ ఈ అన్వేషణ చేపట్టింది. మరళీమనోహర్ జోషి, సిపి ఠాకూర్, సుశీల్ కుమార్ మోడి లను, జస్టిస్ అమీర్ దాస్ విచారణా కమిషన్ నివేదికకు స్పందించవలసిందిగా కోరగా ఇంతవరకూ సమాధానం రాలేదు. కోబ్రాపోస్ట్ ఈమెయిల్ కు మాజీ ఆర్థిక మంత్రి యశ్వంత్ సిన్హా సమాధానం ఇవ్వలేదు.

కోబ్రాపోస్ట్ ప్రచురించిన కథనాన్ని కుదించి ప్రచురించడం జరిగింది.

నర హంతకులు ధరాధిపతులై చరిత్రమున ప్రసిద్దికెక్కిరి. దేశంలో దళితులపై కొనసాగిన, కొనసాగుతున్న హత్యాకాండలు, అత్యాచారాలు మరియూనేపీ దళిత ఊచకోతల కుట్ర నుండి గానీ, కిలవేన్‌మణి మారణ కాండ నుండి గానీ కారంచేడు సంఘటన నుండి మాత్రమే విశ్లేషించడ మంటే, ఈ దేశ మూలవాసుల ప్రాచీన చరిత్రను పరిశీలించడానికి ఇష్టపడని దళిత వ్యతిరేక కుట్రగానే అర్థం చేసుకోవాలి. కారణం "భారత సమాజానికి చరిత్ర అనేదే లేదు, కనీసం తెలిసిన చరిత్ర లేదు, దాని చరిత్ర అని మనం చెప్పేదంతా, ఎదురు చెప్పని, మార్పు లేని గ్రామీణ సమాజపు నిర్లిప్త పునాది మీద, ఒకరి తరువాత ఒకరుగా దాన్ని దురాక్రమించి తమ సామ్రాజ్యాలు నిర్మించుకున్న వారిదే" నని భారత దేశ చరిత్రను విశ్లేషించారు కారల్ మార్క్స్ మహాశయుడు.

నిజమే, దగ్గరకు రమ్మంటే-రావడం, పొమ్మంటే-పోవడం, నిర్మించుకున్న ఊరి నుండి పశువులను వేటాడి వెంటాడి తరిమికొడితే ఊరు, విడచి వాడకు, ఆ వాడ దాటి అడవులకు, కొండలకు, కోనలకు తరలిపపోవడం తప్ప, నోరున్నా ఎదురు చెప్పని మనుషులు. ఎదుటి వాళ్ళెవరైనా సరే, రంగు ఏదైనా సరే, రెండు కాళ్ళు, రెండు చేతులు, రెండు కళ్ళు ఉన్న ప్రతివారిలో సాటి మనిషినే చూశారు తప్ప, వారిలో దురాక్రమణ దారులను, కుట్రదారులను, దానవులను పోల్చుకోలేని, సర్వమానవ సమానత్వపు విశ్వ మానవతా వాద దృక్పథం ఉన్న వారు ఈ దేశ దళితులు. ఏ తల్లైనా తన కన్న బిడ్డ మల-మూత్రాలు శుభ్రం చేసే బాధ్యత మహా ఐతే కేవలం ఐదు సంవత్సరాలు మాత్రమే వహిస్తుంది. కానీ దళితులు వేల తరాల నుండి నేటికీ ఈ సమాజంలో కన్న తల్లి పాత్ర నుండి తప్పుకోవడానికి చేసిన ప్రతి ప్రయత్నం యుద్ధంగానే ముగిసింది.

ఈ దేశంలో అనేక రూపాలలో కరాళ నృత్యం చేస్తున్న అంటరాని తనాన్ని భరిస్తూ, నోరు లేని వాళ్ళుగా-నోరున్న వాళ్ళతో కలిసి నాలుగు మాటలు నేర్చుకున్నందుకు, వాళ్ళతో కలిసి నాలుగు అడుగులు నడిచినందుకు, తరతరాల వివక్ష, అంటరానితనం, శ్రమ దోపిడీని ప్రశ్నించినందుకు, భూస్వాములు వెంటాడి, వేటాడి చంపుతున్న హంతకులకు ఆయుధాలు అందించిన కుట్రలో ఏకంగా తమ దేశ ప్రధానే ఉన్నా డంటే, ఈ దళితులు ఎవరిని నమ్మాలి? ఏ పోలీసు ఠాణాలో ఫిర్యాదు చేయాలి? ఏ కోర్టుల్లో కేసులు పెట్టాలి? ఏ ఎస్.సి. కమిషన్ల చుట్టు తిరగాలి?

ఈ దేశ-సార్వభౌమాధికార వ్యవస్థలైన అసెంబ్లీ, పార్లమెంటులలో దళితులు కూడా ప్రాతినిథ్యం వహిస్తున్న ఈ ప్రజాస్వామిక వ్యవస్థలో హిందుత్వ అగ్ర కుల భూస్వాములు మూకుమ్మడిగా దళితులను జంతువుల మాదిరిగా వెంటాడి వేటాడుతున్నారు. ఆర్యుల దురాక్రమణ కాలం నుండి మధ్య యుగాల ఇండో ఆర్యన్ వారసులైన గుప్తులు, మౌర్యులు, నందులు, శాతవాహనులు మొదలైన బ్రాహ్మణ రాజుల చీకటి యుగాల పాలనలో దళితుల దుస్థితి ఎంతటి దయనీయంగా ఉండేదో ఊహకందని వాస్తవం.

ఒక ప్రధాన మంత్రి దళితులను చంపేందుకు రణవీర్ సేన హంతక ముఠాకు భారత సైనికులను, అత్యాధునిక మిలటరీ ఆయుధాలను సమకూరిస్తే, మరో ప్రధాని "దళితులను చంపాలనుకుంటే ముందుగా నన్ను చంపండి" అని ఆవేశాన్ని కుమ్మరిస్తూనే దళిత విద్యార్థి, మేధావులను తమకు తామే ఆత్మహత్యలు చేసుకొని చనిపోయేదాకా మానసిక హింసలకు గురిచేసిన వాళ్ళకు ప్రోత్సాహక గౌరవ పథక పురస్కారాలు ఇచ్చి సత్కరిస్తాడు. ఐతే, నేరస్తులను కోర్టు నిర్దోషులుగా భావించి విడుదల చేస్తుంది. కానీ విచిత్రంగా ఆ నిర్దోషి-నేరస్తులు, ఈ రోజు నిర్భయంగా కోబ్రాపోస్ట్ కెమెరా కంటి ముందు నిలబడి ఈ ఊచకోతలు, దళిత నర సంహారాలను, ఈ అత్యాచారాలను మేమే చేశాం, అని ఈ నేరానికి సాక్ష్యం నేరస్తుడే ప్రత్యక్షంగా ప్రకటించుకున్నాడు. అంతే కాకుండా ఈ నేరాలు [illegible] నానికి ఆయుధాలు, ఆర్థిక సహకారం, రాజకీయ అండదండలు [illegible] తమ వెన్ను తట్టి రక్తపు క్షేత్రాల్లోకి నడిపించిన వాళ్ళ పేర్లతో స[illegible] గానే ప్రకటించారు. వీరిలో కొందరు ప్రభుత్వం[illegible] క్ష భాగస్వాములుగా గానీ, లేక వ్యూహాత్మకంగా తెర వెను[illegible] ఉ[illegible] పరోక్షంగా క్రియాశీల రాజకీయ పాత్ర పోషిస్తూనే ఉన్నారు. మ[illegible] కాషాయీకరించబడిన నాజీ బ్రాహ్మణీయ చట్టాలు ప్రజాస్వామీకరించ బడనంత వరకూ నేరస్తులు శిక్షించబడరు. సరికదా రాజ్యమేలుతూనే ఉంటారు. 'గతమంతా తడిసె రక్తంతో కాకుంటే కన్నీళ్ళతో'.

(ద కోబ్రాపోస్టు స్టోరి. గ్లోబల్ ఇన్వెస్టిగేషన్ జర్నలిజం నెట్‌వర్క్ తేది: 16/8/2015)



# సామాజిక సంక్షోభాలకు

## సోషలిజమే ప్రత్యామ్నాయమని చాటిన ప్రొద్దుటూరు సాహిత్య పాఠశాల

సోషలిజమే ప్రత్యామ్నాయమనే మాట కేవలం విశ్వాసం కాదు. ఎప్పటికైనా సోషలిజం వస్తుందనే ఆశావాదం మాత్రమే కాదు. గత విప్లవాలను, సోషలిస్టు నిర్మాణ ప్రయత్నాలను అధ్యయనం చేసి రేపొద్దటి సోషలిజాన్ని నిర్మించే శాస్త్రీయ మార్గం. ఇవాళ ప్రజలు అనుభవిస్తున్న సమస్యలన్నీ వ్యవస్థ కల్పించినవే. వాటి వ్యక్తీకరణలే. కాబట్టి వాటి మూలాలు తెలుసుకొని వాటిపై జరిగే ఆందోళనలను వర్గపోరాటంగా తీర్చిదిద్దవలసి ఉన్నది. సాహిత్యంలో అయినా అంతే. గొప్ప సాహిత్యం వస్తున్నప్పటికీ దాన్ని విశ్లేషించే శక్తి కొంత మంది సాహిత్య విమర్శకులకు లేదు. పైగా సాహిత్యాన్ని సమాజం నుంచి వేరు చేయాలనే పాతకాలపు నాటి కూట వాదాలు మళ్లీ జడలు విప్పుతున్నాయి. ఇది సాహిత్య రంగం ఎంత సంక్షోభంలో ఉన్నదో ఒక సూచిక.

అందుకే విప్లవ రచయితల సంఘం ఫిబ్రవరి 11, 12 తేదీల్లో ప్రొద్దుటూరులో నిర్వహించిన సాహిత్య పాఠశాల పతాక శీర్షిక 'సోషలిజమే ప్రత్యామ్నాయం'. ఒక వెనుకబడిన వ్యవసాయిక దేశంలో విప్లవం నిర... చారిత్రక కర్తవ్యాన్ని తలకెత్తుకున్న కమ్యూనిస్టుపార్టీ.. ఆ తరా... , సోషలిస్టు నిర్మాణ ప్రయత్నానికి ఎన్నో కొత్త ప్రయోగాలు చే... . దానికి లోపలా, బైటా ఎదురైన సవాళ్లను ఎదుర్కోడానికి, ఆ వ్యవస్థే విధించిన పరిమితులను దాటి సోషలిజం దిశగా సాగిపోవడానికి జరిపిన మహత్తర శ్రామికవర్గ సాంస్కృతిక విప్లవానికి ఇప్పుడు యాభై ఏళ్లు. అంతకంటే ముందే కార్మికవర్గమే జయిస్తుందనే కలను నిజం చేసిన బోల్షివిక్ విప్లవానికి ఇప్పుడు నూరేళ్లు.

ఇవాళ విప్లవ రచయితల సంఘం సోషలిజమే ప్రత్యామ్నాయం అనడానికి ఈ గొప్ప చారిత్రక సందర్భం ఉన్నది. దీని వెలుగులో ఇవాళ మన వ్యవస్థ ఎదుర్కొంటున్న సంక్షోభాలను విరసం సాహిత్య పాఠశాల కేంద్రంగా చేసుకున్నది. 'సంక్షోభ కాల సూచికలు: ప్రజా ఆకాంక్షలు, ఆచరణ' అనే అంశంపై జరిగింది. అసలు సంక్షోభమంటే ఏమిటి? సంక్షోభాలను ఎలా అర్థం చేసుకోవాలి? అనే మౌలిక భావనల దగ్గరి నుంచి పాఠశాల థీమ్ మీద విరసం కార్యదర్శి ఒక వివరమైన కీనోట్ పేపర్ సమర్పించారు.

పెట్టుబడి స్వభావమే అసమానత. జాతుల మధ్య తీవ్ర అసమానతలేగాక ఒకే జాతిలోని వేర్వేరు ప్రాంతాల మధ్య అసమానతలు తలెత్తుతాయి. అప్పుడు అన్యాయానికి గురైన ప్రాంతం తన డిమాండ్లను ముందుకు తెస్తుంది. అది న్యాయంగా తనకు రావాల్సిన వాటా దగ్గరి నుంచి ప్రత్యేక రాష్ట్రం కావాలనేదాకా ఉండొచ్చు. నిస్సందేహంగా ఇది బూర్జువా డిమాండే. ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడితే ఆ ప్రాంతపు బూర్జువా వర్గమే అధికారంలోకి వస్తుందనడానికి, అదే విధంగా అది ఆ ప్రాంత ప్రజా ఆకాంక్ష కూడా అని గుర్తించడానికి పెద్దగా సిద్ధాంత జ్ఞానమేమీ అక్కర్లేదు. రాయలసీమ రాష్ట్ర ఆకాంక్షను విప్లవ రచయితల సంఘం ఎప్పటి నుంచో బలపరుస్తూ వచ్చినా, ఆ ఉద్యమంలో క్రియాశీలంగా పాల్గొంటూ వచ్చినా.. మరోసారి రెండు తెలుగు రాష్ట్రాల ప్రతినిధుల సమక్షంలో విరసం స్పష్టంగా రాయలసీమ రాష్ట్రమే ఒక వెనుకబడిన ప్రాంతంగా సీమ ఎదుర్కొంటున్న సమస్యలకు పరిష్కారమని చెప్పింది. విరసం సభ్యుడు, రాయలసీమ విద్యార్థి వేదిక నాయకుడు కా. భాస్కర్ ఈ నేపథ్యంలో రాయలసీమ రాష్ట్రం-ప్రజాస్వామిక దృక్పథం అనే అంశంపై ప్రసంగించారు.

పెద్ద నోట్ల రద్దు వల్ల రోజువారి జీవితంలో ప్రజలు ఎదుర్కొంటున్న ఇబ్బందులు కంటికి కనిపిస్తున్నవే. ఇంతకూ ప్రభుత్వం ఎందుకు పెద్ద నోట్ల రద్దు చేసింది? 'నల్ల నోట్లు' అని ప్రభుత్వం అంటోంది కాని కష్టం చేసి సంపాదించుకుంటున్న పేద, మధ్య తరగతి ప్రజల దగ్గర ఉండే డబ్బు తప్ప అదనపు విలువ దోపిడి ద్వారా సంపన్నుల దగ్గర పోగైన సంపద, పన్ను చెల్లిస్తున్న సంపద, పూర్తి చట్ట విరుద్ధంగా చెలామణి చేస్తూ పన్ను ఎగవేస్తున్న సంపద అంతా నల్ల ధనమే. మధ్య తరగతి పొదుపు చేసుకుంటున్న చిన్న మొత్తాలను బ్యాంకర్లు కార్పొరేట్లకు మదుపుగా తరలిస్తున్నారు. నగదు రహిత ఎకానమీలోకి మళ్లించడానికి నోట్ల రద్దు చేసి, ఎక్కడ ఒక రూపాయి దేనికి ఖర్చు చేసినా పన్ను వసూలు చేయాలని పాలకులు భావిస్తున్నారు. ఇక నుంచి అనుక్షణం పన్ను చెల్లింపుదారులుగా ప్రజలు మారిపోతారు. పన్ను చెల్లించనవసరం లేని కొనుగోళ్లు ఏవీ ఉండవు, అలాంటి చిన్న విక్రయ కేంద్రాలూ ఉండవు. పౌరులందరి ఆర్థిక లావాదేవీలు డిజిటలైజ్ అవుతుంటాయి. సారాంశంలో ఇది పూర్తి స్థాయిలో పన్నుల వసూళ్ల రాజ్యంగా మారిపోతున్నది అని పి. ప్రసాద్ నోట్ల రద్దు-రాజకీయార్థిక మూలాలు అనే అంశాన్ని విశ్లేషించారు.

రష్యన్ విప్లవంలో, నేపథ్యంలో రచయితలు అత్యంత క్రియాశీల పాత్ర పోషించారు. రష్యన్ సాహిత్యంలో ఆధునికతా వారసత్వాన్ని



పుష్కిన్ ఇచ్చాడు. ఆయన ఒరవడిలో డిసెంబరిస్టు ఉద్యమ నేపథ్యంలో గొప్ప సాహిత్యం వెలువడింది. గొగోల్ అద్భుత సాహిత్యాన్ని సృజించాడు. రష్యన్ రచయితల సాహిత్యం ఎంత గొప్పదో, వాళ్ల జీవితం అంతకంటే గొప్పది. అంతకంటే స్ఫూర్తిదాయకమైనది. రష్యన్ సమాజాన్ని, అందులో వస్తున్న మార్పులను ఈ రచయితలందరూ చిత్రించారు. దోస్తొవిస్కీ, టాల్‌స్టాయ్, గోర్కీలాంటి రచయితలు రష్యన్ సమాజ సంక్షోభంతో ప్రభావితమై రచనలు చేశారు. వాళ్ల రచనలు బోల్షివిక్ విప్లవానికి దోహదం చేశాయని 'రష్యన్ సాహిత్యం-బోల్షివిక్ విప్లవం' అనే అంశాన్ని నాగభూషణ్ విశ్లేషించారు.

సాహిత్యం మానవ జీవితాన్ని చిత్రిస్తుంది. సాహిత్య విమర్శ సాహిత్యాన్ని విశ్లేషిస్తుంది. అలంకారిక శాస్త్రాల బంధనాల నుంచి విమర్శ బయటపడి ఆధునిక దృక్పథాన్ని, మార్క్సిస్టు అవగాహనను ఒక క్రమంలో సంతరించుకుంది. అయితే తొలి తరం మార్క్సిస్టు సాహిత్య విమర్శకుల మీద ఎంతో కొంత అలంకార శాస్త్ర ప్రభావం ఉండేది. విప్లవోద్యమం మొదలయ్యాకే సాహిత్య విమర్శకు మార్క్సిస్టు తాత్విక, సిద్ధాంత పునాదిని సమకూర్చే ప్రయత్నం మొదలైంది. కొడవటిగంటి కుటుంబరావు, శ్రీశ్రీ లాంటి వాళ్లు కొంత ప్రయత్నించినప్పటికీ ఈ కృషి అంతా కేవీఆర్, టీఎంఎస్ విస్తృతంగా చేశారు. సాహిత్య విమర్శ రంగంలోని ఫ్యూడల్ బ్రాహ్మణీయ పద్ధతులను, ఆధునిక రూపంలో ఉన్న ప్రజా వ్యతిరేకశక్తులను వాళ్లు ఎదుర్కొన్నారు. సాహిత్యం సాహిత్యం కోసమే కాదు, వ్యక్తుల ఆనందం కోసం కాదు.. లాంటి ఎన్నో తప్పుడు భావనలను వాళ్లు ఎదుర్కొన్నారు. ఇప్పుడు తిరిగి మళ్లీ ఆనాటి పాత ధోరణులు కొత్త ముసుగులు వేసుకొని వస్తున్నాయి. కొన్ని నేరుగానూ వస్తున్నాయి. వాటిని ఎదుర్కొని విప్లవ సాహిత్య విమర్శ రంగం పురోగమించాల్సి ఉన్నదని 'సాహిత్య విమర్శ-విప్లవ దృక్పథం' అనే అంశాన్ని కాశీం వివరించారు.

చైనా సాంస్కృతిక విప్లవానికి యాభై ఏళ్లయిన సందర్భంలో దాన్ని ఎలా అధ్యయనం చేయాలనేది చాలా ముఖ్యమైన విషయం. రైతాంగం మీద ఆధారపడి విప్లవాన్ని విజయవంతం చేసి, అలాంటి వెనుకబడిన ఉత్పత్తి శక్తులపైనే ఆధారపడి సోషలిజం నిర్మించాల్సిన ఒక ప్రత్యేక చారిత్రక బాధ్యత చైనా కమ్యూనిస్టు పార్టీ మీద పడింది. రైతాంగ పునాదిగా సోషలిస్టు వ్యవస్థలతో నిర్మించే క్రమంలో లోపలా, బైటా ఎదురైన సంక్షోభాలను ఎదుర్కొనే ప్రాసెస్‌లో సాంస్కృతిక విప్లవం జరిగింది. 1953నాటికే చైనా పార్టీలో మొదలైన రివిజనిజం సోవియట్ పార్టీ 20 కాంగ్రెస్‌తో ఊతం పొందింది. కేంద్ర కమిటీలో రివిజనిస్టు శక్తులు తిష్ట వేశాక, వర్గపోరాటంతో సంబంధం లేకుండా ఉత్పత్తి శక్తుల అభివృద్ధి, సోషలిజం అనే నినాదం అందుకున్నాక అటు సోవియట్ పార్టీతో మహత్తర చర్చ జరుపుతూనే చైనాలోని రివిజనిస్టులతో పోరాడే క్రమంలో మావో సాంస్కృతిక విప్లవానికి పిలుపు ఇచ్చారు. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలను, కమ్యూన్‌లను ఏర్పాటు చేసినా, సోషలిస్టు వ్యవస్థకు తగినట్లు వ్యవసాయాన్ని తీర్చిదిద్దే ప్రయత్నం చేసినా మౌలికంగా అది చిన్న రైతు ఆర్థిక వ్యవస్థగానే ఉన్నందు వల్ల, దాన్నించి బూర్జువా ఉత్పత్తి సంబంధాలు ఏర్పడుతూ వచ్చాయి. మావో పిడికెడు మంది బూర్జువా వ్యక్తులు అని అన్నాడుగాని, అప్పటికే పార్టీలోనే కాదు, ఉత్పత్తి వ్యవస్థలోనే బూర్జువా వర్గం తయారై ఉన్నది. సాంస్కృతిక విప్లవం పదేళ్లపాటు జరిగి మావో మరణంతో ఆగిపోగానే వెనువెంటనే అధికారంలోకి బూర్జువా వర్గం వచ్చేసింది. సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ నిర్మాణ ప్రయత్నాల నుంచి సునాయాసంగా పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ పూర్తి స్థాయిలో ఉనికిలోకి వచ్చిందని సాంస్కృతిక విప్లవం గురించి, యాభై ఏళ్ల నక్సల్బరీ గురించి పాణి వివరించాడు.

రెండోరోజు సాయంకాలం విరసం కార్యదర్శి వరలక్ష్మి అధ్యక్షతన జరిగిన బహిరంగ సభలో ప్రముఖ కథా రచయిత స్వామి మాట్లాడుతూ రాయలసీమ ప్రజలను పాలకులు సమైక్యవాద ఆందోళనల్లో దించినా .. వాళ్లు మెల్ల మెల్లగా నిజాలు తెలుసుకొని ప్రత్యేక రాయలసీమ రాష్ట్ర ఉద్యమం నిర్మిస్తున్నారని అన్నారు. ప్రత్యేక రాష్ట్రం తప్ప రాయలసీమ ప్రాంతీయ సమస్యలకు పరిష్కారం లేదని అన్నారు. ఇంత వరకు రాయలసీమలో జీవితం ఎలా ఉన్నదో సాహిత్యం వచ్చింది, ప్రత్యేక రాష్ట్ర ఉద్యమం మొదలయ్యాక ఈ జీవితం ఎందుకు ఇలా ఉన్నదో, కోస్తా ప్రాంత పాలకుల జల దోపిడీ వల్ల రాయలసీమ ఎందుకు ఇలా తయారైందో చెప్పే సాహిత్యం వస్తున్నది. ఇది ఇంకా ఉధృతం కావాలి. సీమ జీవితం ఎలా ఉండాలో చిత్రించే సాహిత్యం ఇంకా రావాల్సి ఉన్నదని అన్నారు.

ఆ తర్వాత మానవహక్కుల వేదిక నాయకురాలు జయశ్రీ మాట్లాడుతూ రాయలసీమలో ప్రజలకు మానవ హక్కులు ఉన్నాయనే చైతన్యం ఇంకా అలవడలేదు. ఎంత హింస, దౌర్జన్యాలు జరుగుతున్నా.. నోరు తెరచి మాట్లాడలేకపోతున్నారు. పేదలు, దళితులు, స్త్రీలు ఆధిపత్య శక్తుల కింద నలిగిపోతున్నారు. అన్ని రకాల సంఘాలు కలిసి ప్రజల్లో హక్కుల చైతన్యం పెంచాల్సి ఉన్నదని అన్నారు. నానో కెమికల్ ఫ్యాక్టరీకి వ్యతిరేకంగా పోరాడుతున్న కొండ జాటూరు, నష్ట పరిహారం ఇవ్వకుండా నీరు వదిలితే నిర్వాసితులైన గండికోట రిజర్వాయర్ ప్రాంత ప్రజల పోరాటాలను ఉదహరిస్తూ హక్కుల ఉద్యమం ఒక ప్రజాస్వామిక సంస్కృతిగా విస్తరించాల్సి ఉన్నదని అన్నారు.

ఆ తర్వాత వివి మాట్లాడుతూ జాతుల సమస్యలో భాగంగా ఒకే జాతిలోని ప్రాంతీయ అసమానతలకు వ్యతిరేకంగా వచ్చే రాష్ట్ర ఉద్యమాలను మార్క్సిస్టులయిన వారందరూ సమర్థిస్తారని అన్నారు. అందులో భాగంగానే విరసం తెలంగాణ వలె ప్రత్యేక రాయలసీమ రాష్ట్ర ఉద్యమాన్ని బలపరిచి అందులో పాల్గొంటున్నదని అన్నారు. ఆర్టీఎఫ్ తరపున కూడా తాను ప్రత్యేక రాయలసీమ రాష్ట్ర డిమాండ్‌ను సమర్థిస్తున్నానని, మావోయిస్టు భావజాలం ప్రకారం ప్రత్యేక రాయలసీమ రాష్ట్ర ఉద్యమం న్యాయమైందని, అది విజయవంతం కావాలని ఆకాంక్షిస్తున్నానని అన్నారు. మూడో దశ ఆపరేషన్ గ్రీన్‌హంట్‌లో భాగమే రెండు తెలుగు రాష్ట్రాలకు చెందిన ప్రజా సంఘాల నాయకులను చత్తీస్‌ఘడ్‌లో అరెస్టు చేయడమని అన్నారు. బేలా సోనారిపై దాడి, అంతకు ముందు ఢిల్లీ అధ్యాపకులపై అక్రమ కేసులు ఇవన్నీ పెరిగి పోతున్న రాజ్యహింసలో, హిందూ ఫాసిజంలో భాగమని అన్నారు.

ఈ రెండు రోజుల పాఠశాల ఆరంభంలో ఎర్రజెండా పాట దగ్గరి నుంచి చివర్లో ఇంటర్నేషనల్ గీతం ఆలపించేదాకా ప్రజాకళామండలి కళాకారులు విప్లవోత్తేజాన్ని నింపేలా ప్రదర్శనలు ఇచ్చారు. మొదటి రోజు అరసవెల్లి కృష్ణ నిర్వహణలో కవిసభ జరిగాక ప్రజాకళామండలి కళాకారులు హిందూ ఫాసిజంపై నాటిక ప్రదర్శించారు. కా. సంధ్య నేతృత్వంలో విరసం కళా బృందం ఈ రెండు రోజులపాటు పాటలు పాడింది. రెండో రోజు రాయలసీమ కళాకారులు సీమ వలస గురించి ఒక నాటిక ప్రదర్శించారు. ఈ రెండు రోజుల పాటు వివిధ ప్రక్రియల్లో వచ్చిన విరసం సభ్యులు, మిత్రుల రచనలు, అనువాదాలు, పునర్ముద్రణలు 27 పుస్తకాలను ఆవిష్కరించారు.

## సాహిత్య పాఠశాలలో ఆవిష్కరించిన పుస్తకాలు

| పుస్తకం | రచయిత | ప్రచురణ | ఆవిష్కర్త |
|---|---|---|---|
| వెన్నెలవనం (కవిత్వం) | సూర్యచంద్ర | విరసం | వరవరరావు |
| ఎర్రదుక్కి (కథలు) | ఎం. నారాయణ | పాలమూరు ప్రచురణలు | శశికళ |
| దోసెడు పల్లీలు (కథలు) | ఉదయమిత్ర | పాలమూరు ప్రచురణలు | పద్మకుమారి |
| మా తుఝే సలాం (కథలు) | శశికళ | విరసం | వెంకటకృష్ణ |
| సాయంకాలం వానని (కవిత్వం) | రివేరా | విరసం సిటీ యూనిట్ | మహమూద్ |
| పూలు రాలిన చోట (కవిత్వం) | నాగేశ్వర్ | విరసం | అరసవెల్లి కృష్ణ |
| ఆవాజ్- మతంలేని సమాజం కోసం (వ్యాసాలు) | వరలక్ష్మి | విరసం | దాదాహయత్ |
| సాంగ్ ఆఫ్ ఫర్రోస్ (కవిత్వం) | ఉజ్వల్ | పాలమూరు ప్రచురణలు | కూర్మనాథ్ |
| కాగుతున్న ఋతువు (కవిత్వం) | కెక్యూబ్ వర్మ | ఝుంఝూవతి ప్రచురణలు | కూర్మనాథ్ |
| మలుపు తిప్పిన మహావిప్లవం (చరిత్ర) | అనువాదం: సి.ఎస్.ఆర్ | విరసం | విక్రాంత్ |
| అభాగ్యజీవులు (అనువాదం: ఎన్.రవి, అనురాధ) | | విరసం | ఉదయమిత్ర |
| బోల్షివిక్ పార్టీ చరిత్ర (అనువాదం: తుమ్మల వెంకట్రామయ్య, సరళీకరణ: సి.యస్.ఆర్) | | విరసం | మేఘరాజ్ |
| ప్రత్యేక తెలంగాణ-ప్రజాస్వామిక విశ్లేషణ | | దిక్సూచి | కాశీం |
| ప్రత్యేక తెలంగాణ-ప్రజాస్వామిక దృక్పథం | ప్రతాప్ | దిక్సూచి | కాశీం |
| ఆపరేషన్ గ్రీన్ హంట్ మూడో దశను ఓడిద్దాం | | దిక్సూచి | వరవరరావు |
| ఫాసిజం-బ్రాహ్మణీయ హిందూ ఫాసిజం (విశ్లేషణ) | | శ్రామికవర్గ ప్రచురణలు | మల్లేశ్ |
| బొల్షివీకరించడం పై కొన్ని వ్యాసాలు | | శ్రామికవర్గ ప్రచురణలు | రామచంద్రం |
| పోస్టుమార్టం పోస్ట్ ట్రూత్ (వ్యాసాలు) | వరవరరావు | విరసం | పాణి |
| 30 ఇయర్స్ ఆఫ్ దండకారణ్య కల్చరల్ రివల్యూషన్ | | సేతుప్రకాశన్ | అరవింద్ |
| నక్సల్బరీ ఒక ఊరు మాత్రమే కాదు (చరిత్ర) | అనువాదం: సి.ఎస్.ఆర్ | విరసం | రాంకీ |
| కార్మిక వర్గ విప్లవం, విప్లవద్రోహి కౌట్స్కీ, లెనిన్ | కుప్తీకరణ: ఎన్.వి.ఎస్.నాగభూషణ్ | విరసం | సి.ఎస్.ఆర్ |
| మార్క్స్ పెట్టుబడి పరిచయం | అనువాదం: పార్థసారథి | విరసం | పెద్ది కృష్ణ |
| గోరపిట్ట (కథలు) | సువర్ణముఖి | సిక్కోలు బుక్ ట్రస్ట్ | కెక్యూబ్ వర్మ |
| సాహిత్యంలో వస్తు రూప శిల్పాలు | చెంచయ్య | | శివరాత్రి సుధాకర్ |
| రాయలసీమ రాష్ట్రం | అరుణ్ | రాయలసీమ విద్యావంతుల వేదిక | పెనుగొండ బాషా |
| రైతుల ఆత్మహత్యలు | రైతు సేవా సమితి | రైతు సేవా సమితి | యోగానంద్ |
| మేమున్నాం | పాలమూరు అధ్యయన వేదిక | పాలమూరు ప్రచురణలు | మేడక యుగంధరరావు |



విరసం కరపత్రాలను, స్టేట్‌మెంట్లను, అరుణతార పత్రికలను, విరసం ప్రచురణలను www.virasam.org వెబ్‌సైట్‌లో చూడవచ్చు. సాఫ్ట్‌కాపీలు డౌన్‌లోడ్ చేసుకోవచ్చు. 15 రోజులకు ఒకసారి పెట్టే విరసం వెబ్ మ్యాగజైన్‌ను సైట్‌లో చూడవచ్చు. అలాగే వివిధ సాహిత్య పత్రికల బ్లాగులు, సైట్‌ల లింకులను కూడా చూడవచ్చు. - సం.

## ప్రస్తుతం మా వద్ద అందుబాటులో ఉన్న విరసం, ఇతర ప్రచురణలు, వాటి ధరలు

### కథ, నవల, కవిత్వం, సాహిత్య విమర్శ

1. నీ దాకా వచ్చినా తాకుతావో లేదో .. (రివేరా కవిత్వం) 30-00
2. పూలు రాలిన చోట (నాగేశ్వర్ కవిత్వం) 50-00
3. మా తుర్మె సలాం (ఆర్. శశికళ కథలు) 60-00
4. వెన్నెల వనం (సూర్యచంద్ర కవిత్వం) 50-00
5. కొడవటిగంటి కుటుంబరావు - 7 (నవలలు) 250-00
6. కొడవటిగంటి కుటుంబరావు - 8 (నవలలు) 250-00
7. కొడవటిగంటి కుటుంబరావు - 9 (నవలలు, కథలు నాటికలు) 250-00
8. కొడవటిగంటి కుటుంబరావు - 11 (చరిత్ర వ్యాసాలు) 150-00
9. కొడవటిగంటి కుటుంబరావు - 12 (రాజకీయ వ్యాసాలు) 400-00
10. కొడవటిగంటి కుటుంబరావు - 13 (సంస్కృతి వ్యాసాలు) 300-00
11. కొడవటిగంటి కుటుంబరావు - 14 (సినిమా వ్యాసాలు-1) 300-00
12. కొడవటిగంటి కుటుంబరావు - 15 (సినిమా వ్యాసాలు-2) 250-00
13. కొడవటిగంటి కుటుంబరావు - 16 ఎ (సాహిత్య వ్యాసాలు-1) 300-00
14. కొడవటిగంటి కుటుంబరావు - 16 బి (సాహిత్య వ్యాసాలు-2) 300-00
15. కొడవటిగంటి కుటుంబరావు - 17 (తాత్విక వ్యాసాలు) 150-00
16. కొడవటిగంటి కుటుంబరావు - 18 (లేఖలు) 125-00
17. కె.వి.ఆర్. సాహిత్య వ్యాసాలు (మొదటి భాగం) 300-00
18. కె.వి.ఆర్. సాహిత్య వ్యాసాలు (రెండవ భాగం) 250-00
19. కె.వి.ఆర్. సాహిత్య వ్యాసాలు (మూడవ భాగం) 250-00
20. కె.వి.ఆర్. సామాజిక వ్యాసాలు (నాల్గవ భాగం) 300-00
21. కె.వి.ఆర్. మహోదయం 200-00
22. వసంతగీతం (అల్లం రాజయ్య) 250-00
23. కొమురం భీం (అల్లం రాజయ్య) 150-00
24. సాహిత్య సమాలోచన (కృష్ణాబాయి) 300-00
25. భావవిప్లవకారుడు కొకు 80-00
26. కొకు సమకాలీనత - విశ్లేషణా వ్యాసాలు 50-00
27. అక్షరతుణీరం (కె.వి.ఆర్. సాహిత్య విమర్శ వ్యాసాలు) 20-00
28. సుబ్బారావు పాణిగ్రాహి కవిత్వం, పాటలు 25-00
29. బీజభూమి (వరవరరావు కవిత్వం) 100-00
30. గుమ్మెటమోత (పాణి నవల) 100-00
31. కలిసి పాడాల్సిన గీతమొక్కటే (పాణి కవిత్వం) 10-00
32. చలసాని ప్రసాద్ రచనలు 100-00
33. దండకారణ్య కథలు (2005-2012) 125-00
34. సామాజికం (వి. చెంచయ్య) 30-00
35. సాహిత్యధోరణులు - విప్లవ దృక్పథం 30-00
36. కథల పంట-3 120-00
37. తీత్వాల్ కుక్క, మరికొన్ని కథలు (సాదత్ హసన్ మంటో) 60-00
38. జాజిపూల పరిమళం (షహీదా కథలు) 150-00
39. ఒక మాట, ఒక సంభాషణ (షహీదా కవిత్వం) 75-00
40. సామాన్యుల సాహసం (నిత్య, మైనా, సుజాత కథలు) 60-00
41. ఫాల్గుణ (పద్మకుమారి నవలిక) 30-00
42. లాల్‌బనో గులామీ ఛోడో బోలో వందేమాతరం (ఎన్కె దీర్ఘ కవిత) 25-00
43. తెహెల్కా అద్దంలో సర్కారు బింబం మరికొంత కవిత్వం (బాసిత్) 100-00
44. ఆఖరి బిడ్డ (బాసిత్ నాటిక) 10-00
45. కిటికీ పిట్ట (పి. మోహన్ కవిత్వం) 10-00
46. మంజీరా మూడ్స్ (మంజీరా కవిత్వం) 25-00
47. కవితా ఝుంకార్ (విరసం కవితా సంకలనం) 75-00
49. నెగడు (కథలు) (నల్లూరి రుక్మిణి) 90-00
50. పరామర్శ (నల్లూరి రుక్మిణి) 80-00
51. Wake of Telangana? - A docu-drama by Basith 10-00
52. యంత్రాల మధ్య 35-00
53. అక్షర కిరణం (కె.వి.ఆర్.) 50-00
54. అగ్నిశిఖ 80-00
55. బలహీనుడి బలం 25-00
56. పాలమూరు వలస బతుకు చిత్రాలు - గీతాంజలి 150-00
57. ఏది నేరం?! (హజారీబాగ్ జైలు గాథలు) - బి. అనూరాధ 75-00
58. వెలుగు రవ్వల జడి (ఆలూరి భుజంగరావు) 70-00
59. అరణ్య పర్వం (ఆలూరి భుజంగరావు) 120-00
60. ప్రజలు అజేయులు (ఆలూరి భుజంగరావు) 25-00
61. మైనా (ఆలూరి భుజంగరావు) 50-00
62. గమ్యం దిశగా గమనం (ఆలూరి భుజంగరావు) 30-00
63. దిక్కు మొక్కు లేని జనం (ఆలూరి భుజంగరావు) 30-00
64. సాహిత్య వ్యాసాలు (చలసాని ప్రసాద్) 1[illegible]-00
65. కలం యోధుడు చెరబండరాజు (వి. చెంచయ్య) 20-00
66. ఫాలింగ్ (నల్లూరి రుక్మిణి కథ) 20-[illegible]
67. దండకారణ్య కథలు (2013-2015) 70-00
68. లొంగిన ప్రతిసారీ (కిరణ్ కవిత్వం) 50-00
69. మందిపాట ఒరవడిలో (సిటీయూనిట్ కవిత్వం) 40-00
70. కాశీం కవిత్వం 140-00
71. తెలంగాణ సాహిత్య వ్యాసాలు (కాశీం) 140-00
72. కవిత్వంతో ములాఖత్ (ఎన్.వేణుగోపాల్) 120-00
73. వెలివాడె తొలిపొద్దై 70-00
74. దండకారణ్య కథలు (2013-2015) [illegible]-00
75. మేమున్నాం (పాలమూరు అధ్యయన వేదిక) 60-00
76. ఒక ఆకుపచ్చని కల (కెనరి) 40-00
77. లక్ష్మీంపేట (విరసం) 25-00
78. వివేచన (వి. చెంచయ్య) 50-00
79. కలిసి పాడాల్సి గీతం ఒక్కటే (పినాకపాణి) 10-00
80. అవ్వజెప్పిన తొవ్వ (శాఖమూరి రవి) 10-00
81. పోస్టుమార్టం రిపోర్టు (వడ్డెబోయిన శ్రీనివాస్) 10-00
82. విప్లవ సాహిత్య విమర్శ (విరసం) 25-00
83. ఎదురగ్గి (నవల) కనుమపల్లి రాజారాం 100-00

| | | |
|---|---|---|
| 84. | చలసాని ప్రసాద్ సాహిత్య సర్వస్వం-1 | 270-00 |
| 85. | ముడిమనిషి (అరుణతార కథలు 1) | 30-00 |
| 86. | చేపలు (అరుణతార కథలు 2) | 30-00 |
| 87. | కథ అడ్డం తిరిగింది (అరుణతార కథలు 3) | 30-00 |
| 89. | కో...బలి (అరుణతార కథలు 4) | 30-00 |
| 90. | అడవిలోని వెన్నెల (అరుణతార కథలు 5) | 30-00 |
| 91. | నెలవు (అరుణతార కథలు 6) | 30-00 |
| 92. | ఒక వీరుడు మరణిస్తే (అరుణతార కథలు 7) | 30-00 |
| 93. | బదిలీ (అరుణతార కథలు 8) | 30-00 |
| 94. | అరణ్య పర్వం (అరుణతార కథలు 9) | 30-00 |
| 95. | పద్మ (అరుణతార కథలు 10) | 30-00 |
| 96. | విప్లవంలో మాతృత్వం (అరుణతార కథలు 11) | 30-00 |
| 97. | కొండపందికొక్కు (అరుణతార కథలు 12) | 30-00 |
| 98. | ఓడిపోయిన కథలు (అరుణతార కథలు 13) | 30-00 |
| 99. | దాడి (అరుణతార కథలు 14) | 30-00 |
| 100. | తుఫాను (అరుణతార కథలు 15) | 30-00 |
| 101. | కొండవాగు (అరుణతార కథలు 16). | 30-00 |
| 102. | డిసెంబరు ఆరు కథ (అరుణతార కథలు 17) | 30-00 |
| 103. | భూమి (అరుణతార కథలు 18) | 30-00 |
| 104. | ఫ్యూచర్ (అరుణతార కథలు 19) | 30-00 |

## సంస్కృతి, చరిత్ర, రాజకీయార్థిక, సైద్ధాంతిక రచనలు

| | | |
|---|---|---|
| 1. | ప్రజాకళలు - పి.కె.ఎం. ప్రభాకర్ రచనలు | 70-00 |
| 2. | ఆవాజ్ మతం లేని సమాజం కోసం (పి. వరలక్ష్మి వ్యాసాలు) | 65-00 |
| 3. | నక్సల్బరీ (అనువాదం : సి.ఎస్.ఆర్. ప్రసాద్ ) | 80-00 |
| 4. | మలుపు తిప్పిన మహా ఉద్యమం (విలియం హింటన్, అను: సి.ఎస్.ఆర్.) | 80-00 |
| 5. | అభాగ్యజీవులు (ఫ్రాంజ్ ఫనాన్, అను. ఎన్.రవి, బి. అనురాధ) | 170-00 |
| 6. | పోస్ట్‌మార్టం - పోస్ట్‌ట్రూత్ (వరవరరావు వ్యాసాలు) | 50-00 |
| 7. | ప్రత్యేక రాయలసీమ రాష్ట్రం ప్రజాస్వామిక దృక్పథం (అరుణ్) | 20-00 |
| 8. | ప్రత్యేక తెలంగాణ ఉద్యమం - ప్రజాస్వామిక విశ్లేషణ | 50-00 |
| 9. | ప్రత్యేక తెలంగాణ ఉద్యమం - ప్రజాస్వామిక దృక్పథం (ప్రతాప్) | 30-00 |
| 10. | మార్క్స్ పెట్టుబడి ... (ఫ్రాన్సిస్ వీన్, అను. ముక్తవరం పార్థసారధి) | 50-00 |
| 11. | కార్మిక వర్గ విప్లవం-విప్లవ ద్రోహి కౌట్స్కీ (లెనిన్, అను.నాగభూషణ్) | 60-00 |
| 12. | రైతు ఆత్మహత్యలన్నీ ప్రభుత్వ హత్యలే (రైతు సేవా సమితి) | 100-00 |
| 13. | బోల్షివిక్ పార్టీ చరిత్ర (అను.తుమ్మల వెంకటరామయ్య/సి.ఎస్.ఆర్.) | 250-00 |
| 14. | బోల్షివీకరించడంపై కొన్ని వ్యాసాలు | 20-00 |
| 15. | ఆపరేషన్ గ్రీన్‌హంట్ మూడవ దశను ఓడిద్దాం | 10-00 |
| 16. | ఫాసిజం, బ్రాహ్మణీయ హిందూ ఫాసిజం | 10-00 |
| 17. | సామ్రాజ్యవాద సంస్కృతి (జేమ్స్ పెట్రాస్ వ్యాసాలు) | 125-00 |
| 18. | మావో రచనలు - 1 | 220-00 |
| 19 | మావో రచనలు - 2 | 220-00 |
| 20. | రివిజనిజం (మావో) | 75-00 |
| 21. | మార్క్సిజం, లెనినిజం, మావోయిజం | 170-00 |
| 22. | మార్క్సిస్టు తత్వశాస్త్రం | 80-00 |
| 23. | చారుమజుందార్ 8 డాక్యుమెంట్లు | 50-00 |
| 24. | మంద్రస్థాయి యుద్ధం | 100-00 |
| 25. | రాజకీయ కృషి - మన కృషి అంతటికీ జీవనాడి (చైనా విప్లవోద్యమన పత్రిక హాంకీ వ్యాసాలు) | 35-00 |
| 26. | జగిత్యాల జంగల్‌మహల్ (1) | 75-00 |
| 27. | జగిత్యాల జంగల్‌మహల్ (2) | 100-00 |
| 28. | స్టోలిపిన్ అభివృద్ధి నిరోధక కాలంలో | 15-00 |
| 29. | అంతర్జాతీయ విప్లవోద్యమాల్లోని ఆటుపోట్లు | 60-00 |
| 30. | ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయోత్పత్తి సంబంధాలు | 30-00 |
| 31. | నేటి రాయలసీమ | 100-00 |
| 32. | గతాన్ని సమీక్షించుకుందాం | 50-00 |
| 33. | చూటే ఏరిన రచనలు | 125-00 |
| 34. | మావో సే టుంగ్ | 80-00 |
| 35. | గెరిల్లా యుద్ధం | 60-00 |
| 36. | చైనా ప్రజా విముక్తి సైన్యం | 40-00 |
| 37. | భూమి సంస్కృతి నాగరికత | 15-00 |
| 38. | స్త్రీవాద ఉద్యమం (అనురాధ గాంధీ) | 25-00 |
| 39. | కొత్త చూపు (ఆర్.ఎస్. రావు) | 120-00 |
| 40. | అభివృద్ధిని ఇలా చూద్దాం (ముదునూరి భారతి) | 80-00 |
| 41. | In Search of Method (Mudunuri Bharati) | 200-00 |
| 42. | On Education (Mudunuri Bharati) | 180-00 |
| 43. | Crisis and Development in Marxian Frame Work (Mudunuri Bharati) | 80-00 |
| 44. | Individual, Sub-Groups, Groups and Freedom (Mudunuri Bharati) | 75-00 |
| 45. | Methodology of Social Enquiry (Mudunuri Bharati) | 150-00 |
| 46. | Fifty Years of Andhra Pradesh 1956-2006 | 300-00 |
| 47. | జనతన సర్కార్ కావాలి మేక్ ఇన్ ఇండియా కాదు | 15-00 |
| 48. | విద్యార్థి ఉద్యమాల్లో విప్లవ దిద్దుబాటు | 30-00 |
| 49. | జాతుల సమస్య రిజర్వేషన్లు కార్మిక వర్గ దృక్పథం | 25-00 |
| 50. | తత్వశాస్త్రం మాయాజాలం కాదు | 20-00 |
| 51. | వైరుధ్యాలు | 20-00 |
| 52. | చైనా తాత్విక రంగాన మూడు ప్రధాన పోరాటాలు 1949-64 | 20-00 |
| 53. | జనాతన రాజ్యం (పాణి) | 300-00 |
| 54. | మార్క్సిస్టు మహోపాధ్యాయుల జీవన రేఖలు | 20-00 |
| 55. | దండకారణ్య సాంస్కృతికోద్యమ చరిత్ర (పునర్ముద్రణ) | 100-00 |
| 56. | సీమ గొంతుక వినండి (అరుణ్ వ్యాసాలు) | 70-00 |
| 57. | ఈలం విముక్తి పోరులో మహిళలు | 50-00 |
| 58. | సామ్రాజ్యవాద దోపిడి మండలాలు (రత్నమాల) | 50-00 |
| 59. | సమగ్ర తెలంగాణ (సంపాదకులు - ఎన్. వేణుగోపాల్) | 295-00 |
| 60. | విప్లవ పథంలో వరంగల్ విద్యార్థి ఉద్యమం (విరసం) | 40-00 |
| 61. | వామపక్ష కమ్యూనిజం-ఒక బాలారిష్టం (ఎన్.వి.ఎస్. నాగభూషణ్) | 30-00 |
| 62. | ఐక్య సంఘటన (దిక్సూచి) | 35-00 |
| 63. | అభాగ్యజీవులు (ఫ్రాంజ్ ఫనాన్) | 170-00 |

64. మలుపు తిప్పిన మహోద్యమం (విలియం హింటన్) 60-00
65. బోల్షివీకరణ వ్యాసాలు 20-00
66. సాహిత్యంలో వస్తురూప శిల్పాలు - వి. చెంచయ్య 40-00

## వర్తమాన సమాజం, ప్రజా ఉద్యమాలు

1. ముజఫర్‌నగర్ మరో మానని గాయం 20-00
2. ఆకాస ఉద్యమ అమరులు 10-00
3. దండకారణ్యంలో గ్రీన్‌హంట్ 60-00
4. ఉద్యమ ఆకాశంలో సగం 15-00
5. తూర్పు మధ్య భారతంలో విస్థాపన-ప్రజా ప్రతిఘటన 20-00
6. జనతన జైత్రయాత్ర 20-00
7. ఫిలిప్పినో ఉద్యమం 15-00
8. ఖైదీల సైరన్ 60-00
9. విముక్తిబాటలో నారాయణపట్నా 50-00
10. అంతర్యుద్ధంలో ఆదివాసులు 30-00
11. ఆకుల భూమయ్య రచనలు 40-00
12. ది ఫ్లేమ్స్ ఆఫ్ నారాయణ పట్నా 60-00
13. దాక్షిణ్య వాదం నుంచి దండకారణ్యం దాకా (రత్నమాల) 200-00
14. నూతన సంభాషణ (రత్నమాల) 80-00
15. జర్నలిజం ప్రొఫెషన్ (రత్నమాల) 50-00
16. సాహిత్య ధోరణులు విప్లవ ధోరణులు 30-00
17. ప్రాణహిత (అల్లం నారాయణ) 150-00
18. గ్రీన్‌హంట్ ఉత్పాదాలు (విరసం) 25-00
19. ఆకాసంలో సగం పా. సగం మహిళ విముక్తి (విరసం) 35-00
20. లాంగ్ మార్చ్ (తెలంగాణ జర్నలిస్టులు) 100-00
21. పచ్చని బతుకులపై నిప్పులు కురుస్తున్న రాజ్యం (బిడి దమయంతి)15-00
22. కృష్ణానది నీళ్ళు. (ఎం. రాఘవచారి) 20-00
23. మండుతున్న గాయాలు (బిడి దమయంతి) 40-00

## స్మృతి సాహిత్యం

1. మెరిసే అక్షరాల వెనుక (ఎన్. రాజశేఖరం) 30-00
2. ఖాన్‌దాదా (ఎం.టి.ఖాన్ స్మృతి) 10-00
3. ఆదర్శజీవులు అమరులు 30-00
4. గంటి ప్రసాదం రచనలు 25-00
5. సూర్యుడు మరణించడు 60-00
6. చిరునవ్వు సితార 80-00
7. గెరిల్లా డైరీ 10-00
8. మన్యం వెలుగులు 15-00
9. అక్షర కిరణం 20-00
10. అడవి పుత్రుడు మంగన్న 10-00
11. గజ్జెల సరోజ 15-00
12. మహిత 10-00
13. అమరుల యాదిలో 50-00
14. అమరుల జీవిత చరిత్ర 30-00
15. వేగుచుక్కల వెలుతురులో 10-00
16. లంకపల్లి అమరులకు విప్లవ జోహార్లు 10-00
17. శారద స్మృతి శకలాలు 30-00
18. దండకారణ్యంలో చలసాని ప్రసాద్ 10-00
19. సాహసయోధురాలు (గజ్జెల సరోజ రచనలు) 40-00
20. అమరుడు కామ్రేడ్ సంజయ్ 10-00
21. రైజింగ్ సన్ (సూర్యం స్మృతి) 20-00
22. అజ్ఞాత విప్లవ యోధుడు కొండన్న (దిక్సూచి) 50-00
23. పువ్వర్తి అమరులు (దిక్సూచి) 20-00
24. కా॥ సహస గెరిల్లా యోధుడు మాసా (దిక్సూచి) 50-00
25. కె. దాసారావు కనకచారి (దిక్సూచి) 10-00
26. మృత్యుంజయులు మొద్దుగుట్ట అమరులు 20-00
27. బొట్టెం అమరుల జీవిత చరిత్ర (అమరుల బంధుమిత్రుల సంఘం) 40-00
28. గెరిల్లా అమ్మ (అమరుల బంధుమిత్రుల సంఘం) 20-00
29. కన్నబిడ్డల కలల యాది (అమరుల బంధుమిత్రుల సంఘం) 20-00
30. దండకారణ్య విప్లవ మహిళ కా॥ హేమ్లాలచ్చి (దిక్సూచి) 10-00
31. ప్రజాయుద్ధ వీరుడు కా. నగేష్ (దిక్సూచి) 10-00

## డివిడిలు

1. అరుణతార సాహిత్య సాంస్కృతిక మాసపత్రిక (1977-2013) 125-00

---



---

# -: స్వీకారం :-

లెనిన్ సుప్రసిద్ధ గ్రంథం
కార్మికవర్గ విప్లవం
విప్లవద్రోహి కాట్స్కీ
క్లుప్తీకరణ :
నాగభూషణ్
ప్రచురణ :
విప్లవ రచయితల సంఘం
వెల : రు. 60/-
పేజీలు : 104

ప్రత్యేక రాయలసీమ రాష్ట్రం
ప్రజాస్వామిక దృక్పథం
అరుణ్
ప్రచురణ :
రాయలసీమ విద్యావంతుల వేదిక
వెల : రు. 20/-
పేజీలు : 48

మెరిసే అక్షరాల వెనుక
ఎన్. రాజశేఖరం
రచనలు
ప్రచురణ :
సృజన ప్రచురణలు
వెల : రు. 30/-
పేజీలు : 84

ప్రత్యేక తెలంగాణ ఉద్యమం - ప్రజాస్వామిక విశ్లేషణ
ప్రచురణ :
దిక్సూచి ప్రచురణలు
వెల : రు. 50/-
పేజీలు : 160

ప్రత్యేక తెలంగాణ ఉద్యమం - ప్రజాస్వామిక దృక్పథం
ప్రతాప్
ప్రచురణ :
దిక్సూచి ప్రచురణలు
వెల : రు. 30/-
పేజీలు : 86

గోరపిట్ట
కథలు
సువర్ణముఖి
ప్రచురణ:
సిక్కోలు బుక్ ట్రస్ట్
వెల : రు. 120/-
పేజీలు : 190

నోట్లరద్దు ప్రజలపై యుద్ధం
నల్లడబ్బు వెలికితీత నాటకం - అవినీతి అంతం బూటకం
ప్రచురణ :
తెలంగాణ ప్రజా ఫ్రంట్
వెల : రు. 10/-
పేజీలు : 32

రైతు ఆత్మహత్యలన్నీ ప్రభుత్వ హత్యలే
ప్రచురణ :
రైతు సేవా సమితి, వరంగల్
వెల : రు. 100/-
పేజీలు : 296

అల్లూరి సీతారామరాజు
వచన కవితా విప్లవ వీరకథా కావ్యం
అద్దేపల్లి రామమోహనరావు
వెల : రు. 150/-
పేజీలు : 256

అంతర్వేది
కవిత
డా॥ అవధానం రఘుకుమార్
వెల : రు. 60/-
పేజీలు : 88

అత్యాధునిక కవితారూప ప్రక్రియ-నానీ
చలపాక ప్రకాష్
ప్రచురణ :
వెల : రు. 87/-
పేజీలు : 352

పక్షితీర్థం
దీర్ఘకవిత
ఈతకోట సుబ్బారావు
వెల : రు. 50/-
పేజీలు : 42

శాంతిసాగరం సరికొండ నరసింహరాజు
రచన: సృజన ఆర్ట్స్ అకాడమీ ప్రచురణలు
వెల : రు. 50/-; పేజీలు : 56

ప్రేమ్‌చంద్
సాహిత్యం - పరిశీలన
రచన:
వలేటి వెంకటేశ్వర్లు
వెల : రు. 50/-
పేజీలు : 32

రచ్చబండ తీర్పు
(కథా సంపుటి-2)
డా. జి.వి. కృష్ణయ్య
ప్రచురణ :
జనసాహితి
వెల : రు. 80/-
పేజీలు : 123



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA101M195 |
| పుస్తకం పేరు | అరుణతార |
| తారీఖు | 08 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 67 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 55-60 |
| తయారు చేసినది | nazma |
| పేజీలు విడదీసినది | nazma |
| స్కాన్ చేసినది | sharmila |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు పరిచూపినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |